

లోకసభ కార్యదర్శి శ్రీ యం. యస్. కౌల్ వివిధరాష్ట్రాల శాసనసభల కార్యదర్శులతో సంప్రదింపులు జరుపుతున్నారు



ఆంధ్రప్రదేశ్ శాసనసభాధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు చేసిన విందుకు విచ్చేసిన అతిథులలో కొందరు



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 | ఏప్రిల్, 1957 | సంచిక 6

చైత్రము, శాలివాహనశకము - 1879

## విషయసూచిక



— చందా —

సాలుసరి రు. 1–8–0 లేక ఒక రూపాయ 50 నయాపైసాలు

విడిప్రతి 0–2–0 లేక 12 నయాపైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# ముఖచిత్రం

1957 మార్చి 22 వ తేదీ నుంచి శాలివాహన శకం ప్రాతిపదికగా గుణించబడిన నూత్న భారత జాతీయపంచాంగం అమలులోకి వచ్చింది. ఆ తేదీ నుంచి శాలివాహన శకం 1879 చైత్రం నెల ఆరంభమయింది. ఈ శకాన్ని ప్రారంభించిన శాతవాహనరాజు ఇలా ఉంటాడని ఊహించి ఒక చిత్రకారుడు రచించిన ఊహాచిత్రం ఇది.

ఒకానొక చారిత్రకగాథ ఇలావుంది. పూర్వం దీపకర్ణి అనే ఒక మహారాజు ఉండేవాడు, ఆయన భార్య శక్తిమతి అమిత సౌందర్యవతి. కాని, పాపం సంతానంలేకుండానే ఆమె చనిపోయింది. మహారాజు ఒకరాత్రి కలగన్నాడు. ఆ కలలో ఎవరో మహాపురుషుడు కన్పించి, " రేపు నీవు వేటకు వెళ్లు. అక్కడ సింహాన్ని ఎక్కి స్వారీ చేస్తున్న ఒక చక్కని బాలుడు కన్పిస్తాడు. నీ కులానికి అలంకారం వాడే. వాణ్ణి తెచ్చుకొని పెంచుకో " అని చెప్పాడు. అలాగే దీపకర్ణి మహారాజు వేటకు వెళ్లాడు. నిజంగానే అరణ్యంలో సింహం, ఆ సింహం పైన ఒక బాలుడు కన్పించారు. రాజు ఆ పిల్లవానికి ఏమాత్రం ప్రమాదం జరగకుండా సింహాన్ని బాణంతో కొట్టాడు. సింహం మనిషిగామారి, రాజు దగ్గరికి బాలునితో సహా నడిచివచ్చాడు. అలావచ్చి " ఓ ఆంధ్రరాజా, నా పేరు సాతుడు. ఈబిడ్డ నాకొడుకు. ఒక శాపంవల్ల నేను సింహాన్ని అయ్యాను. ఇప్పుడు నాకు శాపవిముక్తి కలిగింది. ఇక ఈ బిడ్డను నీవే పెంచుకొని నీకు వారసుణ్ణిగా జేసుకో". ఇట్లాచెప్పి అంతర్ధానమై పొయ్యాడు సాతుడు. ఎప్పుడూ సాతుని వీపు మీదనే ఉండేవాడు గనుక ఆ బాలుణ్ణి సాతవాహను డన్నారు.

ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడై మహారాజయ్యాడు. ఆయనే ఆంధ్ర శాతవాహన వంశానికి మూలపురుషుడు. ఆయన పేరిటనే శాతవాహన శకం ఆరంభమయింది.

నూత్న వత్సర శుభాకాంక్షలు :

# లోటు బడ్జెట్లు ఎప్పుడూ ఉండేవి కావు

## అవి పోవాలంటే ప్రజల కర్తవ్యాన్ని గూర్చి ముఖ్యమంత్రి అభిభాషణం

*లోటు బడ్జెట్ కదా అని మనం అధైర్యపడ నక్కరలేదు. ఉత్పత్తిని ఎక్కువచేసి ఈ లోటు బడ్జెట్లబెడదను మనం తప్పించుకో వచ్చు. మన రాష్ట్రానికి అపారమైన ప్రకృతి సంపదవుంది. ఆ సంపద నంతటినీ వినియోగానికి తెచ్చుకొని కొరతలను మిగుళ్లుగా మార్చు కొనడానికి మనం కృతనిశ్చయులమై యున్నాము.*

*రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నూత్నసంవత్సర శుభాకాంక్షలు తెలుపుతూ ఒక హితవు చెప్పారు. "మరి కొంచెం కష్టపడి పనిచేసి అధికోత్పత్తిని సాధించండి."— ఇదే వారి అభిభాషణ సారాంశం.*

"తెలుగు ఉగాది సందర్భంగా ప్రాచీనకాలంనుంచీ మనకు సంప్రదాయసిద్ధంగా వస్తూవుండే "నూతన సంవత్సరపుణ్యకాలే, లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనే మంగళ వచనంతో రాష్ట్ర ప్రజలందరికీ నా శుభా కాంక్షలు తెలుపుతున్నాను.



ఆంధ్రప్రదేశ్ ఏర్పడి ఐదు మాసాలు పూర్తి అవుతున్నది. ఈకొత్త రాష్ట్రం ప్రప్రథమంగా ఉగాది పండుగ చేసుకొంటున్నది. తనకు గల మానవ బలగమును, ప్రకృతి సంపదను గుర్తెరిగి దృఢ విశ్వాసంతో నూతన సంవత్సరంలోకి అడుగిడుతున్నది. తన ఆర్థిక పరిస్థితిని సమీక్ష చేసుకుంటూ కడు జాగ్రత్తగా ముందడుగు వేస్తున్నది. మన ఆర్థిక మంత్రి శ్రీ కళా వెంకటరావుగారు శాసనసభలో తాత్కాలిక బడ్జెటును ప్రవేశపెడుతూ మన ఆర్థిక స్థితిని ఒక్క ముక్కలో చక్కగా చెప్పారు. "ఆంధ్ర ప్రదేశ్‌కు ఉజ్జ్వలమైన భవిష్యత్తు వున్నది. అయితే రెవిన్యూ పెట్టుబడుల ఆదాయ వ్యయాల రీత్యా ఇప్పుడు మనం ఎదుర్కొంటున్న క్లిష్టస్థితిని విజయవంతంగా అధిగమిస్తే తప్ప, లేకపోతే అట్టి ఉజ్జ్వల భవిష్యత్తును మనం సాధించలేము" అని వారన్నారు.

ఈ క్లిష్టస్థితి ఒక్క మన రాష్ట్రానికే కాదు; భారత దేశంలోని అన్ని ప్రాంతాలలోను వుంది. యూనియన్ ప్రభుత్వం రోజుకు కోటి రూపాయల లోటును ఎదుర్కొంటున్నది. యూనియన్ ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. క్రిష్ణమాచారిగారన్నట్లు అంతర్జాతీయ పరిస్థితి ముఖ్యంగా మన దేశరక్షణ వ్యవస్థను బలపరచడం అవసరమౌతుంది. కనుకనే మన వ్యయం పెరిగింది. అది పైకి చాలా పెద్ద మొత్తంగా కన్పిస్తుంది. కాని అంత క్లిష్టమైన విషయం కాదు. ఇంత విశాలమైన దేశం, వినియోగ పరచుకోవడానికి ఎంతో ప్రకృతి సంపదగల దేశం, పెద్ద జనాభా గల దేశం ఈ మాత్రపు లోటును సులభంగా భర్తీ చేసుకోగలుగుతుంది. లెక్కపెట్టి చెప్పాలంటే ఈ లోటు తల ఒకటికి రోజుకు రూపాయలో 36 వ వంతు అనగా మూడు నయాపైసాలకు తక్కువగానే పడుతుంది. మన రాష్ట్రపు లోటు రోజుకు రెండు లక్షల రూపాయలకు తక్కువగా వుంటుంది. రాష్ట్రంలోని 313 లక్షల మంది ప్రజలు దీనిని పంచుకున్నట్లయితే ఒక్కొక్క మనిషికి రోజుకు ఒక నయాపైసా కూడా పడదు. దీని సారాంశమేమంటే ఇంతకు పూర్వం మనం ఎన్నిగంటలు పనిచేసి సంపాదిస్తున్నామో అంతకంటె మరికొంత సమయం ఎక్కువ పనిచేసి అదనంగా నాలుగు నయాపైసలు సంపాదించాలి. అప్పుడు మనం మన రాష్ట్రం లోటును, దేశపు లోటును పూర్తి చేయవచ్చు. మన ఉత్పత్తి విధానాలు, కార్య విధానాలు ఆధునికమైనవైతే ఎక్కువ సమయం పనిచేయనవసరం కూడా లేదు.

మన రాష్ట్రంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయాదాయం నూటికి 19 వంతులు పెరిగిందని అంచెనా వేయబడింది. అంటే 1950-51 లో జాతీయాదాయం రూ. 691 కోట్లు వుండగా 1955-56 లో అది రూ. 823 కోట్లకు పెరిగింది. ప్రజల ఆదాయం తల ఒకటికి 13 శతి చొప్పున పెరిగినట్లు అంచెనా వేయబడింది. మనది వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రం. రాష్ట్రంలోని 313 లక్షల ప్రజలలో దాదాపు 211 లక్షల మంది వ్యవసాయంపై జీవిస్తున్నారు. అంటే రాష్ట్ర జనాభాలో 67.4 శతి అన్నమాట. కనుక వ్యవసాయం పద్దు క్రిందనే రాష్ట్ర జాతీయాదాయం ఎక్కువగా పెరిగింది. మనం ఇంకా ఎక్కువ భూమిని సాగుబడి క్రిందికి తేవలసి వున్నది. సాగు భూములకు సాగు నీరు లభింపజేయబడుతున్నది. మనకు గల జలాలలో నూటికి 5 మొదలు 7 వంతుల జలం మాత్రమే ప్రస్తుతం వినియోగానికి తేబడుతున్నది. అపారమైన ఖనిజ సంపదను వెలికి తీసి ఉపయోగానికి తేవలసి వున్నది. మన ఆర్థిక మంత్రి చెప్పినట్లు అఖిల భారత ఆహార కొరతను తీర్చడానికి అవసరమైన ధాన్యాలను మన రాష్ట్రం ఉత్పత్తి చేయగలదు. ఆయన అన్నప్పుడు బహుశా కృష్ణా గోదావరి నదులే ఆయన దృష్టిలో ఉండి వుంటాయి. ఒక్క గోదావరి నదే ప్రతి యేటా 2000 మిలియనుల ఘనపు టడుగుల నీరు సరఫరా చేసి రెండు కోట్ల ఎకరాల భూమిని సాగుకు తెచ్చి రూ. 200 కోట్లు విలువచేసే ఆహార ధాన్యాలను పండించగలదని ప్రవీణుల అభిప్రాయం. అంతేగాక ఎంతో విద్యుచ్ఛక్తి కూడా దానివల్ల లభించగలదు. సాగు నీటికీ విద్యుచ్ఛక్తికీ కృష్ణా గోదావరి లోయలను ఉపయోగానికి తేవడానికి సమగ్రమైన పథకాన్ని సిద్ధంచేసి తద్వారా ఇప్పుడు నిర్మింపబడుతున్న నాగార్జున సాగర్ ప్రాజెక్టును ఇకముందు నిర్మింపబొయ్యే రామపాద సాగర్ ప్రాజెక్టుతో కలుపడానికి అవకాశాలున్నవి. మన నదులవల్ల, మనకుగల బొగ్గుగనులవల్ల ఎంతో విద్యుచ్ఛక్తి లభించగలదు. ఆ విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకోలేకపోతే భారతదేశ పారిశ్రామిక పటములో మనకు స్థానం వుండదు. వీటన్నిటినీ ఉన్నడబ్బుతోనే సాధింప బూనుకోవడానికి మన రెండవ పంచవర్ష ప్రణాళికలో అవకాశ మేర్పరచబడింది.

మన జనాభాలో ఎక్కువమంది గ్రామాలలో నివసిస్తున్నారు. దారిడొంకలు లేని మన పల్లెప్రాంతాలను అభివృద్ధి పరచకుండా మనం పురోగమించలేము.

గ్రామాభివృద్ధి సాధనకు బహుళార్థ సాధకమైన సామాజికాభివృద్ధి ప్రాజెక్టులు, జాతీయవిస్తరణ సేవా కేంద్రాలు, స్థానిక అభివృద్ధి పనులు ప్రధానమైనవి. స్వతంత్ర భారత లక్ష్యం సహకార జనరాజ్యం. అటువంటి సందర్భంలో ప్రజలువేరు, ప్రభుత్వంవేరు కాదు. ప్రభుత్వానికి అధికారమూ, బలమూ చేకూర్చేది ప్రజలే. కనుక ప్రజలు ఎంత ఎక్కువగా చొరవ తీసుకొని ప్రభుత్వానికి పుష్టపఱిస్తే ప్రభుత్వం అంత పటిష్ఠంగా వుంటుంది.

కనుక నూతన సంవత్సరంలో మనం ప్రతిరోజూ అదనంగా 5 నయాపైసాల విలువగల ఉత్పాదక కృషి చేసి వచ్చే సంవత్సరం మన రాష్ట్రం మిగులు రాష్ట్రమయ్యేటట్లుగా, వచ్చేయేడు మనం ఎక్కువ ప్రాజెక్టులను, హెచ్చుగా జాతినిర్మాణ కార్యక్రమాలను చేపట్టుటకు వీలుండునట్లుగా చేసి సంపత్సమృద్ధిను సాధిద్దాము. ఇట్లా ఇదివరలో మనం చేశాము. ఇకముందు కూడా చేయగలం.

మనం సక్రమమైన మార్గంలో పురోగమిస్తున్నామన్న విషయం దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పదేండ్ల స్వల్ప వ్యవధిలోనే మనం సాధించిన ప్రగతినిబట్టి విదితమవుతుంది. విశాలమైన ఈ రాష్ట్రం ఏర్పడి ఐదు నెలలుమాత్రమే అవుతున్నది. ఈ కాలంలో నూత్నరాష్ట్రం స్థిరపడింది. ఆంధ్ర తెలంగాణాల పరిపాలనా వ్యవస్థల విలీనీకరణ సాఫీగా జరిగిపోయింది. అనేక క్లిష్టసమస్యలను ఎదుర్కొంటూ కూడా ఈ నూత్నరాష్ట్రం తెలంగాణాలో శాసనసభకూ, లోకసభకూ పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలోని 11 జిల్లాలలో లోకసభకు ఎన్నికల కార్యక్రమాన్ని నిర్వర్తించింది. ఫలితాలు అందరికీ తెలిసినవే. రాష్ట్రంలో సుస్థిర ప్రభుత్వం ఏర్పాటయ్యే అవకాశం కలిగింది గనుక ప్రజలు ప్రభుత్వోద్యోగుల తోడ్పాటుతో రాష్ట్రం రెండవ ప్రణాళికను విజయవంతం చేయగలరని ఆశిస్తున్నాను. ఆ ప్రణాళిక అమలు జరగడంపైననే మన ఆర్థిక శ్రేయస్సు ఆధారపడి వున్నది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకు నూత్న సంవత్సరంలో సంపత్సౌభాగ్యాలు కలుగుగాక అని మరొకమారు శుభాకాంక్షలు తెలుపుతున్నాను."

# శాలివాహన శకారంభం



శాలివాహన శకం ప్రాతిపదికగా సమన్వయం చేసి గుణించబడిన నూత్న జాతీయ పంచాగం 1957 మార్చి 22 వ తేదీ నుంచి అమలులోకి వచ్చింది. ప్రభుత్వ వ్యవహారాలలో ఈ కొత్తపంచాంగంతోపాటు గ్రిగరియన్ పంచాంగం కూడా ఉపయోగింపబడుతుంది. కొత్త పంచాంగంలో మొదటి నెల చైత్రం. సంవత్సరానికి సాధారణంగా 365 రోజులు. అధిక (లీపు) సంవత్సరంలో మాత్రం 366 రోజులు వుంటాయి.

భారతదేశం మొత్తంలో శాలివాహనశకమే హెచ్చుగా వ్యాప్తిలోవున్న కారణంచేత కొత్త పంచాంగం శాలివాహనశకం ఆధారంగా గుణించబడింది. సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడగు వరాహమిహిరుని కాలంనుంచి కూడా భారతజ్యోతి శ్శాస్త్రజ్ఞులు ఈ శకమునే గ్రహిస్తూ వచ్చారు. భారతీయ పంచాంగకర్తలు ఈనాటికి కూడా శాలివాహనశకం ప్రకారమే మొదట గుణించి ఆ తరువాత తమ పద్ధతిలోకి మార్చుకుంటారు.

నూత్న పంచాంగం ప్రకారం కొత్తనెలల కన్నిటికీ రోజులు నిర్ణయింపబడినవి. కొత్త సంవత్సరం ఎప్పుడూ వసంతారంభం మరుసటిరోజు విషువద్దినం నుంచి ప్రారంభ మవుతుంది. ఈ విధంగా కొత్త సంవత్సరంలో రోజులూ ఇంతవరకూ అమలులో వుంటూవచ్చిన గ్రిగరియన్ పంచాంగపు రోజులూ శాశ్వతంగా ఒకలాగే సరిపోతూ వుంటాయి.

దేశంలోవున్న పంచాంగముల నన్నిటినీ పరిశీలించి వాటి లోపములను గుర్తించి సకల భారతానికీ సర్వ వ్యవహారోప యోగియగు, శాస్త్రీయమగు పంచాంగమును తయారు చేయుటకు ప్రతిపాదనలు చేయవలసిందిగా భారత ప్రభుత్వం 1952 లో పంచాంగ సంస్కరణల సంఘాన్ని నియమించింది. ఈ సంఘం వారు 1955 లో తమ నివేదికను దాఖలు చేశారు. వారి సూచనలను పురస్కరించుకొని ప్రభుత్వం ఇప్పుడు ఈ కొత్త పంచాంగాన్ని అనుసరించుటకు నిర్ణయించింది.

భారతదేశం మొత్తంలో దాదాపు 30 రకాల పంచాంగములు అమలులో వున్నట్లు, అవి శకారంభం విషయంలోనూ సంవత్సరం యొక్క ప్రారంభ తేదీ విషయంలోనూ, గుణించే పద్ధతుల విషయంలోనూ వివిధ రాష్ట్రాలలో విభిన్నంగా వున్నట్లు పంచాంగ సంస్కరణల సంఘంవారు గ్రహించారు.

భారతీయ పంచాంగకర్తలు సంవత్సర ప్రమాణాన్ని 365.25876 రోజులుగా నిర్ణయించి లెక్కలు వేస్తున్నారు. కాని వాస్తవానికి ఉష్ణమండలంలో సంవత్సర ప్రమాణం 365.2422 రోజులు మాత్రమే. ఇది దృగ్గణితంలోనూ, విషువద్దినాల నిర్ణయంలోనూ వచ్చిన లోపం.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగడమేగాక, దాని అక్షము క్రాంతివృత్త ధ్రువము చుట్టూ శంకువు రీతిలో తిరుగుతుంది. ఈ విశేషమే అయనచలనమని వ్యవహరింపబడు తున్నది.

## 23 రోజుల తేడా

గుణింపులో ఈలోపం 14 వందల సంవత్సరాలుగా వస్తూవున్నది. ఫలితంగా సౌరమాన సంవత్సరాది విషువద్దినం అనగా మార్చి 21 వ తేదీ తరువాతనుంచి ఆరంభం కావడానికి బదులుగా 23 లేక 24 రోజులు ఆలస్యంగా మొదలవుతున్నది. ఈ విధంగా ఋతువులను లెక్కించడంలో 23 రోజుల తేడా వస్తున్నది. ఇప్పటికి 14 వందల సంవత్సరాల క్రిందట ఏయే ఋతువులలో ఏయే పండుగలను మనం జరుపుకొనే వారమో ఆ పండుగలిప్పుడు అసలు పండుగ నాటికి 23 రోజులు తేడాగా వస్తున్నవి. ఈ తేడాను ఇంక ఇంతటితో ఆపాలనీ దాన్ని ఇంక పెరుగనివ్వరాదనీ పంచాంగసంస్కరణల సంఘం

వారు నిర్ణయించారు. అందుచేత ఇప్పుడు మనం అనుసరిస్తున్న పండుగలలో కాని, ఇతర మతకర్మలలో కాని మార్పు ఏమీ వుండదు, మతకర్మల నిమిత్తమై కొత్త పంచాంగంయొక్క చాంద్రమానం ప్రతి శుక్ల పక్ష పాడ్యమినుండి ఆరంభ మవుతుంది. ఆ నెల సౌర మాసమని వ్యవహరింప బడుతుంది.

ఈ వ్యాసంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖ డైరక్టర్ డా. పి. శ్రీనివాసాచారిగారు శాలి వాహనశకము యొక్క పుట్టు పూర్వోత్తరాలను ప్రస్తావించి దీని విషయమై గల ఊహాపోహలను నివా రించడానికి చరిత్రను, శాస్త్రాన్నీ, సంప్రదాయాన్నీ ఉల్లేఖించారు.

ఆంగ్లమూలం :
డా. పుట్టపర్తి శ్రీనివాసాచారి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టరు.

భారతదేశ చారిత్రక రికార్డులు అనేక శకముల ప్రకారం వ్రాయబడి వున్నవి. బహుశా మరేదేశం లోనూ ఇన్ని శకాలలో అక్కడి కవిలెలు వ్రాయబడి వుండవు. భారతదేశమును పరిపాలింప నుద్యుక్తుడైన ప్రతి మహారాజు ఒక శకాన్ని స్థాపించ ప్రయత్నించే వాడు. అలా కొంతమంది నూత్న శకాలను స్థాపిం చారు కూడా. అయితే అలాంటివి ఆ రాజుల జీవిత కాలం వరకే నిలిచివుండి ఆ తరువాత పేరూవూరూ లేకుండాపొయ్యేవి. కారణమేమంటే అప్పటి చరిత్ర కారులు చరిత్ర రచనలో తేదీలను సరిగా నిర్ణయించి వాటిని చరిత్రలో చేర్చే పట్టుదల వారికి వుండేవ కాదు. ఒక్కొక్కప్పుడు ఒక శకం లేదా ఒక ముఖ్య మైన చారిత్రక సంఘటన జరిగిపోయి ఒక తర మైనా గడిచిపోకముందే ఆ శకం ఎప్పటినుంచి ప్రారంభమైందీ లేక ఆ సంఘటన ఎప్పుడు జరిగిందీ నిశ్చయంగా చెప్పడానికి వీలు లేకుండా వుండేది. కాబట్టి శక నిర్ధారణ చెయ్యడం కష్టసాధ్యమైన పని అయిపోయింది. కనుకనే ఇటీవల ఒకానొక రచయిత ఈ ప్రస్తావన తెస్తూ "కొన్ని శకాలు సరిగా ఏ రోజు నుంచి ప్రారంభమైందీ, వాటి స్థాపకుల పేర్లేమిటి అన్న విషయమై పండితులమధ్య జరిగిన వాదోప వాదాలు చర్చలూ బహుశా మరే పరిశోధన సంద ర్భంగానూ జరిగివుండవు" అన్నాడు.

కొన్ని శాసనాలలో వ్రాయబడిన తేదీలలో జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన వివరము లివ్వబడినవి. వాటినిబట్టి మనం ఆయాశకముల ప్రారంభ తేదీలను నిర్ణయించడానికి వీలవుతున్నది. కొన్ని సందర్భాలలో భారతీయ శకాల పుట్టుపూర్వోత్తరాలను నిర్ధారణ చేయడానికి అల్బెరూనీ, అబుల్ ఫజల్ వంటి వారల రచనలు మనకెంతో ఉపకరిస్తున్నవి. మరి కొన్ని సందర్భాలలో ప్రాచీన భారతీయ గ్రంథాలు, ముఖ్యంగా జ్యోతిశ్శాస్త్ర గ్రాంథాలు కొన్ని వివ రాలు తెలుపగలుగుతున్నవి. సంప్రదాయంవల్లకూడా కొన్ని విషయాలు తెలుస్తాయి. అయితే ఇందువల్ల విషయం స్పష్టంకావడానికి బదులు అయోమయత్వం ఏర్పడుతున్నది. ఇన్ని చిక్కులున్నప్పటికీ చరిత్రకారులు వాటి నన్నిటినీ ఎదుర్కొని, పరిశీలనలు చేసి కొన్ని నిర్ధారణలు చేశారు. అవి మనకు ఇంకనూ పరిశోధ నలు సలుపడానికి ప్రాతిపదికలుగా ఉపకరిస్తాయి.

## రెండు శకములు

ప్రాచీన భారతదేశంలో ఇరవై లేక ముప్పై శకాలు వాడుకలో వున్నట్లు తెలుస్తుంది. వాటిలో విక్రమసంవత్, శాలివాహన శకం విపులంగా వ్యాప్తిలో వుండేవి. ఇప్పటికీ అవి వ్యాప్తిలో వున్నవి. విక్రమసంవత్ క్రీ. పూ. 58 నుంచీ, శాలి వాహనశకం క్రీ. శ. 78 నుంచీ ఆరంభమైనవి. ఈ రెండు శకములు అసలు ఎలా ప్రారంభమైందీ సరిగా తెలియదు. అయితే పలువురు పలువిధాలుగా చెబుతారు.

విక్రమసంవత్‌ను స్థాపించినవాడు విక్రమాదిత్యు డని ప్రసిద్ధి. ఈయనను గూర్చి సంప్రదాయ సిద్ధంగా అనేక గాథలు వాడుకలో వున్నవి. వాటి నన్నిటినీ చూస్తే స్పష్టంగా ఏ విషయమూ తేలదు. కనుక

ప్రస్తుత చరిత్ర పరిశోధనా పరిస్థితినిబట్టి ఆయనను గూర్చి ఇదమిద్ధమని చెప్పడానికి వీలులేదు. వేతాళ పంచవింశతి, ద్వాత్రింశత్ పుత్తళిక మున్నగు గ్రంథాలలో విక్రమాదిత్యుని ధైర్యసాహసములు, గుణగణములు, తెలివితేటల ప్రసక్తి కలదు. నవరత్నము లన బడు ఉద్దండపండితులతో ఆయన సాహితీగోష్ఠులు జరుపుతూండేవాడట. ఆయన చేసిన సాహసకార్యాలన్నీ బృహత్కథలో వివరింపబడినవి. అయినా చారిత్రకంగా ఆ గాథలన్నీ ఎంతవరకు వాస్తవమైనవో నిరూపించడం కష్టం. కాలకాచార్య కథవంటి జైన సంప్రదాయ గ్రంథాలలో, మేరుతుంగుని థేరావళి వంటి జైనమత చరిత్రలలో విక్రమాదిత్యునిగూర్చిన ప్రసక్తి, పై రెండుశకముల స్థాపనకు సంబంధించిన ప్రస్తావన వున్నది.

ఉజ్జయిని రాజ్యమును పరిపాలించిన వివిధ రాజ వంశములను గూర్చి చెబుతూ గర్దభిల్ల వంశం 152 సంవత్సరాలపాటు అధికారంలో ఉన్నట్లు మేరుతుంగుడు తన గ్రంథంలో వ్రాశాడు. "గర్దభిల్లుడు 13 పండ్లు పాలించాడు. ఆ తరువాత శకరాజులు అతనిని తరిమివేసి 4 పండ్లు పరిపాలన చేశారు. గర్దభిల్లుని కుమారుడగు విక్రమాదిత్యుడు మరల ఉజ్జయిని రాజ్యమును కైవసము చేసుకొని, విక్రమ శకమును ఆరంభించి 60 పండ్లు పరిపాలించాడు. ఆయనతరువాత రాజ్యానికివచ్చిన నలుగురురాజులు ఒకరు 40 పండ్లు, రెండవవారు 11 పండ్లు, మూడవవారు 14 పండ్లు, నాల్గవవారు 10 పండ్లు పాలించారు. అప్పుడు శకం ప్రారంభమయింది."

## జైన సంప్రదాయం

కాలకాచార్య కథ అనునది మరొక జైన గ్రంథము. ఇందులో శక ప్రారంభము, ఉజ్జయిని విజయమునకు సంబంధించిన కొన్ని వివరాలున్నవి. "కాలకాచార్యునికి ఒక సోదరి వుండేది. ఆమె పేరు సరస్వతి. ఆమె. మఠంలో చేరింది. గర్దభిల్లుడు ఆమె సౌందర్యాన్ని చూచి మోహించి ఆమెను బలవంతముగా లేవనెత్తుకు పోయ్యాడు. ఇందుకు కాలకాచార్యుడు క్రుద్ధుడై సింధుకు పశ్చిమానగల ప్రాంతానికి పోయి అక్కడ తనజ్యోతి శ్శాస్త్రజ్ఞానంవల్ల ప్రభావితుడైనట్టి ఒక షాహీ (శక) నాయకునికి అతిథిగా



*గోదావరీ తీరాన పైఠాన్ (ప్రతిష్ఠానం) దృశ్యం.*

వున్నాడు. తనను పోషించే భావీ నాయకుడూ ఆ ప్రాంతంలోని 95 మంది ఇతర నాయకులు అంతా ఒకే మహారాజుకు సామంతులై వున్నట్లు అతడు క్రమేణా తెలుసుకొన్నాడు. వారి నందరినీ గర్దభిల్లుని పైకి దండెత్త వలసిందిగా ప్రేరేపించి, తాను కూడా వారి సైన్యంతోచేరి సింధు గుజరాతుల మీదుగా ఉజ్జయినిని ముట్టడించాడు. ఉజ్జయిని పతనమైంది. శకులు మాళ్వాపై ఆధిపత్యం వహించారు. ఇది జరిగిన పదిహేడేండ్ల తరువాత గర్దభిల్లుని కుమారుడు విక్రమాదిత్యుడు శకులను తరిమివేసి రాజ్యం స్వాధీన పరచుకున్నాడు. కాలకాచార్యుడు గర్దభిల్లుని ఓడించి తన సోదరిని విడిపించుకున్న తరువాత ప్రతిష్ఠానంలోని శాతవాహనరాజు ఆ స్థానానికి వెళ్ళి పొయ్యాడు."

పై గాథ వివిధ గ్రంథములలో వ్రాయబడి వున్నది. మరికొన్నిటిలో ఈ దిగువ పేర్కొనబడిన విశేష వృత్తాంతంకూడా కలదు: "కనుక క్రీ॥ పూ॥ 58 సంవత్సరపు విక్రమాదిత్యుడు అసలు లేడనీ, సంప్రదాయ సిద్ధంగా చెప్పుకోబడే విక్రమాదిత్యుడు తరువాతి కాలపు రాజులలో ఒకడై వుండవచ్చుననీ చెప్పే మాటలో ఏమాత్రం సత్యం లేదు."

## శాలివాహన సంప్రదాయం

శాలివాహనుడు, అతడు ప్రారంభించిన శకమును గూర్చి సంప్రదాయసిద్ధంగా చెప్పుకోబడే గాథలు మరీ అయోమయంగా వున్నవి. ఇవి విక్రమాదిత్య సంప్రదాయానికి సన్నిహితంగా కన్పిస్తాయి. ఒక జైనగ్రంథంలో శాలివాహనుని పుట్టుకను గూర్చి విక్రమాదిత్యునిపై అతడు పొందిన విజయమును గూర్చి ఈ క్రింది గాథ చెప్పబడి వున్నది.

గోదావరి తీరంపైనున్న ప్రతిష్ఠానం (ఇప్పుడు ఔరంగాబాదు జిల్లాలోని పైఠాన్‌పట్టణం) ఒకప్పుడు దక్షిణా పథంలోని మహారాష్ట్ర ప్రాంతంలోకెల్ల సుందరమైన నగరంగా వుండేది. అది భారతదేశ రాజధాని నగరంతో తులదూగునట్లుగా వుండేది. ఆ నగరంలో ముగ్గురు పేద బ్రాహ్మణులు ఉపాదాన వృత్తితో జీవిస్తూ వుండేవారు. వితంతువగు వారి సోదరి వారికి వండిపెడుతూ, గృహమును కనిపెట్టుకొని వుంటూవుండేది. ఆమె నాలుగేండ్ల బాలిక. ఒకరోజు ఆమె నీళ్ళు తెచ్చుకొనడానికి గోదావరి తీరానికి వెళ్ళింది. పాతాళ నాగరాజు ఆదిశేషుడు ఆమెను చూచి సమ్మోహితుడై మానవ స్వరూపం ధరించి ఆమె అభీష్టానికి విరుద్ధంగా ఆమెతో సంభోగించాడు. ఆ బాలిక గర్భధారణకు యుక్తవయస్సురాలు కాకపోయినప్పటికీ ఆదిశేషుని మహాత్మ్యంవల్ల ఒక శిశువును కన్నది. సోదరు లామెనుచూచి ఏవగించుకొని ఆమెను త్యజించారు. ఆమె ప్రతిష్ఠానపురంలోనేవుండి, నలుగురిఇంట ఊడిగం చేసుకుంటూ పిల్లవాడిని పెంచుకుంది. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడై తేజోవంతుడయ్యాడు. తన సహచరులతో ఆడుకుంటూ వుండగా వారాతనిని రాజుగా ఎన్నిక చేసుకొనే వారట. అతడు వారికి సైనికులను, గుర్రములను, ఏనుగులను, వాహనములను. ఇతర ఆట బొమ్మలను ఇచ్చేవాడట. కనుకనే అతనికి శాతవాహనుడనే పేరు వచ్చినది. "శాత" అనగా ఇచ్చువాడు. శాతవాహనుడనగా వాహనములను ఇచ్చువాడు, ఆ మట్టిబొమ్మల నన్నిటిని బాల్యంలో అతడు బావిలో పడవేశాడు. తరువాత అతడు విక్రమాదిత్యునిపై యుద్ధం చేసేటప్పుడు ఆ బొమ్మలన్నీ సప్రాణముగా పైకివచ్చి అతని విజయానికి తోడ్పడ్డవి. ఆ తరువాత ప్రతిష్ఠానం గొప్ప పట్టణమై విశాలమైన రాజవీధులతో, పెద్ద దేవాలయములతో, మేడలతో, విపణివీధులతో, దుర్గములతో, అగడ్తలతో అలరారింది. శాతవాహనుడు నర్మదానది తీరంవరకు దేశమును జయించి, దక్షిణాపథంలోని ప్రజల నందరిని విముక్తుల గావించి తన శకమును ప్రవేశపెట్టాడు.

మధ్యయుగపు మరాటీ గ్రంథమగు కవి చరిత్రములో శాలివాహనునికి చేర్చబడిన బిరుదులు గమనింపదగి వున్నవి. శాలివాహన శకకర్త అని ఒక బిరుదు, విక్రమాజిత్ అని మరొక బిరుదు కలవు. కానీన అనికూడా చెప్పబడి వున్నది. అంటే కన్యకు పుట్టినవాడని అర్థము.

ఈ గాథలవల్ల కొన్ని అంశాలు స్పష్టమవుతున్నవి. 1. శాలివాహన లేక శాతవావన అనునతడు రాజ కుటుంబంలో పుట్టినవాడు కాడు. అతనితల్లి బ్రాహ్మణ స్త్రీ, 2, అతడు ప్రతిష్ఠానం (ఇప్పటి పైఠాన్)లో పుట్టి పెరిగాడు. భారతదేశానికి అటు సముద్ర తీరంనుండి ఇటు సముద్ర తీరంవరకు

వ్యాపించివుండి, దక్షిణాపథం అనగా ఇప్పటి దక్కన్ ప్రాంతమంతా కలిసివున్నట్టి ఆంధ్ర - శాతవాహన సామ్రాజ్యపు రాజధానీ నగరాలు రెండింటిలో ప్రతిష్ఠానం ఒకటి. 3. అతడు పెండ్లికానట్టి స్త్రీకి పుట్టిన వాడనే అపప్రథ వుండడంచేత బాల్యంలో కుమ్మరివారితో, ఇతర హీనజాతుల వారితోనే నివసిస్తూ వారితోనే తిరుగుతూ ఉండేవాడు. 4. బాల్యంలోని అటువంటి మిత్రులంతా అతడు పెద్దవాడైన తరువాత చేసిన యుద్ధాలలో ఆయుధాలు ధరించి అతనికి తోడ్పడ్డారు 5. అతడు స్వయంకృషివల్ల పైకి వచ్చినవాడు. కడునేర్పుతో (బహుశా దైవికంగా) తనసాధన సంపత్తులన్నీ సమకూర్చుకున్నాడు. 6. అతడుశకులపైన, ముఖ్యంగా విక్రమాదిత్యుడనే వానిపై యుద్ధాలుచేసి విజయం పొందాడు. 7. రాజుగా అతడు జైనమతంపట్ల అనుకూలుడై ముఖ్యంగా ఒకానొక జైన గురువుపట్ల భక్తిభావం కలిగి ఉండేవాడు.

## చారిత్రక సత్యాలు

పైవిషయా లన్నిటికీ సంబంధించిన చారిత్రకాంశాలను చర్చించకుండా వాటిని పరిశీలించడం సాధ్యంకాదు. అయితే సాధారణంగా అందరూ ఒప్పుకొనే కొన్ని ముఖ్యాంశాలను గమనిద్దాము. శాతవాహనులు పూర్వం నుంచీ రాజకీయంగా బలం, ప్రతిష్ఠ గలవారు. అశోకుని కాలంలో వారికి హెచ్చు ప్రాముఖ్య ముండేది. క్రీ. పూ. మూడవ శతాబ్ది మధ్యకాలం నాటికి వారు స్వతంత్రులై తమ పరిపాలనను నెలకొల్పుకొని క్రీ. శ. మూడవ శతాబ్దియొక్క పూర్వార్ధ భాగంవరకు అంటే దాదాపు నాలుగున్నర శతాబ్దాలపాటు పరిపాలించారు. పశ్చిమోత్తర ఉశనుంచి శకులు వీరి రాజ్యంలోకి చొచ్చి వీరిని ప్రతిఘటిస్తూ వుండేవారు. కాని శాతవాహనులు ఒకపర్యాయం క్రీ. పూ. ప్రథమ శతాబ్దిలో (బహుశా క్రీ. పూ. 58లో), రెండవ పర్యాయం క్రీ. శ. 78లో వారిని ఘోరంగా పరాజితులను చేశారు. మొదటి పర్యాయం ఆంధ్ర - శాతవాహన సామ్రాజ్యంలో ఒక భాగమైనట్టి మాళ్వప్రాంతం సంరక్షింప బడింది. రెండవపర్యాయం శత్రువులు మొదటి ఓటమినుంచి కోలుకొని మాళ్వను, ఇతర రాష్ట్రములను లోబరచుకొని రాజధానీ నగరమైన ప్రతిష్ఠానంపైకి దండెత్తి రాగా అప్పుడు వారి బారినుండి సుందరమైన ఆ నగరం కాపాడబడింది.

## శక ప్రారంభం

కనుక క్రీ. శ. 78 సంవత్సరమే శాలివాహన శకప్రారంభమని, సంప్రదాయం చెప్పేమాటసత్యం. ఆ సంవత్సరమే పశ్చిమోత్తర ప్రాంతంలో శకులు శాతవాహనునిచే రెండవ పర్యాయం ఓడింపబడ్డారు. ఈ శాతవాహనరాజు శకులను మొదట ఓడించినట్టి వారి వంశీకుడే.

ఒకేవిధమైన కారణాలవల్ల, ఒకే వంశానికి చెందిన ఇద్దరు సుప్రసిద్ధ రాజులు కొద్దికాలంలోపలనే రెండు శకాలను ప్రారంభించడంచేత అయోమయత్వం ఏర్పడిందన్న విషయం అనేక శాసనాలలోను, ఇతర సాహిత్యంలోను ప్రస్తావించబడివుంది. క్రీ. పూ. 58 లో ప్రారంభమైన విక్రమసంవత్, క్రీ. శ 78 లో ప్రారంభమైన శాలివాహనశకం— ఈ రెండిటినీ కొన్నిచోట్ల కలిపివేసి అయోమయం చేసివేశారు. అక్బరు దర్బారులో ప్రామాణిక చరిత్రకారుడైనట్టి అబుల్ ఫజల్ వంటి వాడు కూడా "శాతవాహనుల దండయాత్ర తరువాత విక్రమాదిత్య శకం మారి సంవత్ వచ్చింది" అని వ్రాశాడు. జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలలో శకాలవిషయమై తప్పులువుండకూడదు. కాని జ్యోతిర్విదాభరణ మను గ్రంథంలో— *త్రిఖేందుభిర్ విక్రమభూగతేర్మితే* అని చెప్పబడి వుంది.

అకలంకచరితం అనే మరొక ప్రసిద్ధ గ్రంథంలో— *విక్రమార్క శకాబ్దీయ శతసప్త ప్రమాజుషి* అని చెప్పబడి వుంద.

అనంతుడనే ప్రఖ్యాత భాష్యకారుడు కాణ్వయజుర్భాష్య మను తన గ్రంథంలో— *త్రిపర్వతర సైకకల్పమితే విక్రమేశకే* అని చెప్పాడు.

విక్రమసంవత్, శాలివాహనశకం— ఈ రెండు శకాలు ఒకానొక భారతదేశ మహారాజు దండయాత్రలలో సాధించిన గొప్ప విజయం కారణంగా ప్రారంభమైనవని వ్యక్తమవుతున్నది. అతడు శాత

వాహనరాజై వుండాలి. బహుశా ఆయన శకులని చెప్పబడే విదేశీ మతాలను ఓడించివుంటాడు.

సంక్షిప్తంగా వుండడంకోసం శకాన్ని సాధారణంగా శకవర్షమని అన్నారు. అయితే దానికి శాలివాహనునితో గల సంబంధం నిర్వివాదాంశము. విజయనగర రాజు విరూపాక్షుని తామ్ర శాసనంలో 1389 శకం అని వ్రాయబడి వున్నది. అంతేగాక శకవర్షం అనేది శాలివాహనునితోనే నిర్ధారణ చేయబడిందని అందులో స్పష్టం గనుపడింది (శాలివాహన నిర్ణీతే శకవర్షక్రమాగతే)

ఈ శకాన్ని ఒక విదేశీరాజు బహుశా శకరాజు స్థాపించివుంటాడని కొంతమంది భావిస్తారు. కాని అది తప్పు. అలాంటివాదం సరియైనదికాదు. ఎందుచేత నంటే శకరాజ్యం అంతరించిన తరువాతనే ఈ శకం ప్రారంభమైంది. కనుక ఇది తప్పనిసరిగా శకరాజులకు శత్రువులైనవారి చేతనే ఆరంభింపబడి వుంటుంది. ప్రముఖజ్యోతిశ్శాస్త్రజ్ఞుడగు భాస్కరుడు "సిద్ధాంత శిరోమణి" అను తన గ్రంథంలో "శక నృపస్యాన్తే కలేర్వత్సరాః"అనీ, మరొకజ్యోతిశ్శాస్త్రజ్ఞుడు భట్టఉత్పలుడు వరాహమిహిరునిచే రచింపబడిన బృహత్ సంహితకు భాష్యంవ్రాస్తూ "శకానామ మ్లేచ్ఛ జాతీయా రాజానస్తే యస్మిన్కాలే విక్రమాదిత్యదేవేన వ్యాపాదితాః సకాలో లోకే శక ఇతి ప్రసిద్ధః" అనీ వ్రాశాడు.

కలి శకంతో పాటుగా శాలివాహన శకానికి కూడా అనేక ప్రస్తావన లుండడంచేత శాలివాహన శకం క్రీ. శ. 78 లోనే ఆరంభమయిందని చెప్పడానికి నిదర్శనము కనుపిస్తున్నది. కలి శకం ఎప్పుడు ఆరంభమైందో మనకు తెలుసు కాబట్టి శకం ఎప్పుడు ఆరంభమైందో గుణించి చెప్పడం కూడా చాలా తేలిక. క్రీ. శ. 16 వ శతాబ్దానికి చెందిన బ్రహ్మగుప్తుడను జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు శకముల అంతంలో అంటే శాలివాహనశకం ఆరంభమైనప్పటికి కలియుగంలో 3179 సంవత్సరాలు గడచిపోయ్యాయనిచెప్పాడు "త్రీణికృతా దీంక లేర్గోఽగ్నిగుణాః శకాన్తేఽబ్దాః". శ్రీపతి అను మరొక జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు కూడా "సిద్ధాంత శేఖరం" అను తన గ్రంథంలో శక కాలం అంతరించు నాటికి కలియుగంలో 3179 సంవత్సరాలు గడిచాయని చెప్పాడు. (యాతాః నవనగేన్దు గుణాః 3179 శకాన్తే)

ఆ తరువాతకాలపు రచనలవల్ల కూడా శాలివాహనశకం క్రీ॥ శ॥ 78 మార్చి 14 వ తేదీ సోమవారంనుంచి ఆరంభమైనట్లు తెలుస్తున్నది.

ఈ శకం యొక్క పుట్టుపూర్వోత్తరాలను గూర్చి, మొదట ఇది ఉపయోగింపబడిన సందర్భములను గూర్చి ఇంకా సందేహాలు కొన్ని వుండవచ్చును. అలా వుండడానికి ఎన్నో అవకాశాలున్నవికూడా. అయితే ఎన్ని సందేహా లున్నప్పటికినీ ఆంధ్ర శాతవాహన వంశానికి చెందిన ఒకానొక రాజు విదేశీ ఆక్రమణదారులపై యుద్ధంలో గొప్ప విజయం సంపాదించి, శాలివాహనశకమును ప్రారంభించాడనీ, ఆ శకమే భారతదేశంలో సార్వజనీన వ్యాప్తినొంది సర్వులచే స్వీకరింపబడిందనీ చేయబడ్డ నిర్ణయాన్ని అంగీకరించకుండా వుండడం కష్టతరం. ఆ నిర్ణయమే సత్యమని అనిపిస్తున్నది.

# ఆహార ధరల మార్పులు శ్రద్ధగా గమనించబడుతున్నవి

## ఉపాధ్యాయుల వేతనాలు హెచ్చించబడవచ్చు

### రాష్ట్ర పురోగమనంపై గవర్నరు సమీక్ష

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ సి. ఎమ్. త్రివేదీ 20-3-57 న ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఐదవ సమావేశాన్ని ప్రారంభించారు. ఆహార పదార్థాల ధరలు యెటు మొగ్గుతున్నవి అన్న విషయం శ్రద్ధగా గమనించబడుతున్నదనీ, అవి యిటీవల తగ్గు ముఖం పట్టడం కొంతవరకు సంతృప్తిని కలిగించినదనీ ఆ సందర్భంలో వారు పేర్కొన్నారు. ఉపాధ్యాయుల వేతనాలను హెచ్చించే విషయాన్ని ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నదనీ కూడా ఆయన పేర్కొన్నారు.

గవర్నరు ప్రసంగంలోని కొన్ని భాగాలు దిగువ యివ్వబడినవి.



#### ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క మొదటి సంవత్సరం త్వరలోనే ముగుస్తున్నది. ఇంతవరకు ప్రథమ ప్రణాళిక ననుసరించి మనం సాధించిన అభివృద్ధి మనకు ఆత్మ విశ్వాసాన్ని కలుగజేసింది. ఆవిశ్వాసంతో రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద అమలు జరుగవలసిన కార్యక్రమాలను తగురీతిగా నిర్వహించడానికి మనకు ధైర్యంకలిగింగి. రెండవ ప్రణాళికలో ఆంధ్ర రాష్ట్రానికి రూ. 118.97 కోట్ల ఖర్చు తలపెట్ట బడింది. ఇక తెలంగాణా విషయం: పూర్వపు హైద్రాబాదు రాష్ట్రానికి తలపెట్టబడిన మొత్తం ఖర్చు రూ. 100.2 కోట్లలో నుంచి తెలంగాణాకు రూ. 55.5 కోట్లు కేటాయింపబడ్డవి. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దాదాపు రూ.174.5 కోట్లు ఖర్చు అయ్యేప్రణాళికను అమలు జరుపవలసి వున్నది.

ఆంధ్రరాష్ట్ర ప్రణాళికకు తొలి సంవత్సరం రూ. 19 కోట్లు కేటాయింప బడగా, అందులో నుంచి 1956 డిసెంబరు నెల ఆఖరు వరకు రూ. 10.40 కోట్లు ఖర్చు పెట్టబడ్డని. అంటే నూటికి 55 వంతుల మొత్తం ఖర్చు పెట్టబడిందన్నమాట. ఇప్పుడు ఇంకా అనేక పథకాలు అమలు జరుగుతున్నవి. అందువల్ల ఈ సంవత్సరం మిగిలిన మొత్తం కూడా ఈ ఆర్థిక సంవత్సరం ముగిసే లోపుగా ఖర్చు కాగలదని ఆశింప బడుతున్నది. తెలంగాణా ప్రాంతానికి మొదటి సంవత్సరపు ఖర్చు దాదాపు రూ. 10 కోట్ల వరకు వున్నది. అయితే డిసెంబరు నెల ఆఖరు వరకు ఖర్చు పెట్టబడిన మొత్తం రూ. 1 కోటి మాత్రమే. ఇంత తక్కువ ఖర్చుపెట్ట బడడానికి హైద్రాబాదు రాష్ట్రం మూడు ప్రాంతాలుగా విభజింప బడడం, దాని పర్యవసానంగా పరిపాలనా వ్యవస్థ కొంత తారు మారు కావడమే ముఖ్యకారణమని చెప్పవలెను. అయితే ఈ సంవత్సరం అయిపోవడానికి ముందే తెలంగాణా ప్రాంతంలో సాధ్యమైనంత హెచ్చు అభివృద్ధిని సాధించడానికి తీవ్రమైనకృషి జరుపబడు తున్నది.

## సమాజాభివృద్ధి కార్యక్రమం

ఇక సామాజికాభివృద్ధి విషయం. మన రాష్ట్రంలో 4 బహుళార్థసాధక ప్రాజెక్టులు, 40 సామాజికాభివృద్ధి బ్లాకులు, 63 జాతీయ వికాస సేవా కేంద్రాలు, 18 అనంతరకృషి కేంద్రాలు వున్నవి. ఇవి అన్నీ 33,390.18 చదరపుమైళ్ళ విస్తీర్ణంలో 9,229 గ్రామాలకు వర్తిస్తూ, 97.77 లక్షల జనాభాకు శ్రేయస్సును ఒనగూర్చడానికి తల పెట్టబడ్డవి. 1957 ఏప్రిల్ 1 వ తేదిన మరి 25 జాతీయ వికాససేవా కేంద్రాలు ప్రారంభింప బడ గలవు. ఈ అభివృద్ధి కార్యక్రమాలన్నిటిపట్ల ప్రజలు చూపుతున్న ఉత్సాహం మిక్కిలి ప్రశంసనీయమైనది. ప్రజా సహకారం ఎంతగానో లభిస్తున్నది.

గ్రామప్రజలకు వారి నిత్యజీవిత కార్యకలాపా లలో ఉపయోగపడే శాస్త్రీయ సాధనాలనుగూర్చిన



*ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఐదవ సమావేశాన్ని రాష్ట్రగవర్నర్ శ్రీ సి. యం. త్రివేది ప్రారంభిస్తున్న దృశ్యం.*

విజ్ఞానం కలిగించేందుకై భారత ప్రభుత్వ సహాయంతో కొన్ని నిర్ణీత గ్రామాలలో "విజ్ఞానమందిరములు" నెలకొల్పబడుతున్నవి. ఇవి చిన్నపాటి గ్రామీణ శాస్త్రీయ ప్రయోగశాలల వంటివి. ఈ రాష్ట్రంలో అటువంటివి రెండు కేంద్రాలు నెలకొల్పబడగలవు. ఆ కేంద్రాల కార్యక్రమాలు సామాజికాభివృద్ధి కార్యక్రమంలో ఒక భాగంగా అమలు జరుగుతూ వుండగలవు.

రెండవ పంచవర్ష ప్రణాళికలోని 10 కోట్ల రూ. ల అప్పు మొత్తం దేశమంతటా గ్రామీణ గృహవసతి ఏర్పరచడానికై పైలట్ ప్రాజెక్టులను ప్రారంభించడానికి వినియోగ పరచబడుతుంది. మన రాష్ట్రానికి గ్రామీణ జనాభా ప్రాతిపదికపై 56 ప్రాజెక్టులు లభించగలవు. పైలట్ ప్రాజెక్టు గ్రామాలు సామాజికాభివృద్ధి ప్రాంతాలలో వుంటవి. ఆంధ్రప్రాంతంలో స్థానికాభివృద్ధి పనులు సంతృప్తికరంగా అమలుజరుగుతున్నవి. తెలంగాణాలో ఈ పనులు ఇప్పటికంటె మరింత చక్కగా జరగడానికి తగుచర్యలు గైకొనబడ్డవి.

## పబ్లిక్ వర్క్సు కార్యక్రమం

మన రాష్ట్రి పబ్లికు వర్క్సు కార్యక్రమాలు ఎప్పటికప్పుడు విస్తృత మవుతున్నవి. తుంగభద్ర నీటి వినియోగం విషయమై మైసూరు ప్రభుత్వంతో ఒడంబడిక జరిగిన తరువాత తుంగభద్ర హైలెవెల్ కాలువపథకానికి నేనే 1956 అక్టోబరు 2 వ తేదీన ప్రారంభోత్సవం జరిపాను. పెన్నార్ రెగ్యులేటర్ పనికూడ చేపట్టబడింది. ఈపని తుంగభద్ర హైలెవల్ కాలువ పథకంలో ఒక భాగం. దీనికొరకై రూ. 16.98 లక్షల అంచెనా మంజూరు చేయబడింది. తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుక్రింద డాము పవర్ హౌస్‌లో 9000 కిలోవాట్ల ఉత్పత్తి శక్తిగల మొదటి జెనరేటర్, రామగుండం థర్మల్ పవర్ స్టేషన్‌లో 12,500 కిలోవాట్ల టర్బోఆల్టర్నేటర్ ఈసంవత్సరం పనిచేయనారంభించినవి. వచ్చే సంవత్సరం రామగుండంలోని యంత్రం వ్యాపార ప్రయోజనాల నిమిత్తం పని ఆరంభించగలదు. మాచ్‌ఖండ్ హైడ్రోథర్మల్ ప్రాంతంలో పారిశ్రామిక సంస్థల విద్యుచ్ఛక్తి వినియోగం నానాటికి హెచ్చుతున్నందువల్ల నిర్మాణ కార్యక్రమాలు త్వరిత గతిని అమలు జరుగుతున్నవి. వీటన్నిటివల్ల రాష్ట్రి ప్రభుత్వాదాయం తప్పకుండా హెచ్చగలదని ఆశింపబడుతున్నది. సాధ్యమైనంతవరకు పూర్వపు ఆంధ్ర ప్రాంతంలోను, తెలంగాణా ప్రాంతంలోను పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నది. వంతెనలు, రోడ్లు నిర్మాణానికై 22 పనులుగల ఒక పథకానికి భారత ప్రభుత్వం ఆమోదం తెలిపింది. ఈ పనులకు రూ. 34.05 లక్షలు ఖర్చు కాగలవని అంచెనా వేయబడింది. ఈ డబ్బు సెంట్రల్ రోడ్ ఫండ్‌లోని రాష్ట్రి ప్రభుత్వ వాటానుంచి సమకూర్చబడుతుంది. రంగాపురంవద్ద కృష్ణానదిపై ఒక వంతెన, తుంగభద్రపై మరొక వంతెనను నిర్మించే పని త్వరలోనే ఆరంభం కాగలదు.

## పారిశ్రామికాభివృద్ధి

మన రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికై కేంద్ర, రాష్ట్రి ప్రభుత్వాల దృష్టిలో ఒక పెద్ద కార్యక్రమం వున్నది. తొమ్మిది చక్కెర ఫ్యాక్టరీలను, నాలుగు సిమెంటు ఫ్యాక్టరీలను స్థాపించవలెనని తలపెట్టబడింది. నిజామాబాదుజిల్లా షక్కర్‌నగర్‌లో న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరి నొకదానిని నెలకొల్పవలెననే ప్రతిపాదనకూడా ఒకటి కలదు. హైదరాబాదు, విజయవాడలలో పారిశ్రామిక ఎస్టేట్లు ఏర్పాటు చేయబడగలవు.

కుటీర పరిశ్రమలకు, ముఖ్యంగా చేనేత పరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సాహ మివ్వవలెననే దృక్పథానికి హెచ్చు ప్రాధాన్య మివ్వబడుతున్నది. నిలువ సరుకులను అమ్మివేయడానికై ప్రభుత్వశాఖ అన్ని విధములా ప్రయత్నాలు చేస్తున్నది.

## వైద్య ఆరోగ్య సేవాకార్యక్రమం

మన రాష్ట్రంలో వైద్య, ప్రజారోగ్య సేవలు బాగా అభివృద్ధి జెందినవి. మూరు మూలలలోని గ్రామాలకు కూడా వైద్య సహాయం కల్పించబడుతున్నది. ప్రసూతి ఆసుపత్రులు, నేత్ర చికిత్సాలయాలు, గొంతు, చెవి, ముక్కు రోగముల ఆసుపత్రులు, కేన్సర్ ఆసుపత్రి నెలకొల్పబడ్డవి. కర్నూలులో క్రొత్త వైద్యకళాశాలకు 1957 జులైలో

ప్రారంభోత్సవం జరుగ గలదు. ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు విశ్వవిద్యాలయాధికారులు నిర్ణయించిన ప్రమాణాలు తు. చ. తప్పకుండా అమలు జరుపబడగలవు. ప్రత్యేకంగా భారతీయ వైద్య విధానపుశాఖ ఒకటి ఇప్పుడు నెలకొల్పబడింది. దీనివల్ల దేశీయ వైద్య విధానాలకు తగు ప్రోత్సాహం, పరిగణన లభించగలవు.

## నీటిసప్లై, మురుగుపారుదల సౌకర్యాలు

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో పూర్తి కాకుండా మిగిలి పోయినట్టి 16 నీటి సప్లయి పథకాలు, 3 డ్రైనేజి పథకాలు, రెండవ పంచవర్ష ప్రణాళికలో పూర్తిచేయబడుతున్నవి. అవిగాక రెండవ ప్రణాళిక క్రింద ఈ రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతంలోగల స్థానిక సంస్థలకొరకై క్రొత్తగా మరి పదకొండు నీటి సప్లయి పథకాలను, ఆరు డ్రెయినేజి పథకాలను ప్రారంభించ వలెనని తలపెట్టబడింది. హైద్రాబాదు వాటర్ వర్క్సు, హైద్రాబాదు డ్రెయినేజ్ సిస్టమ్ రీమాడల్ చేయబడగలవు. తెలంగాణాలో రెండవ ప్రణాళిక క్రింద 8 నీటి సప్లయి పథకాలు అమలు జరుపబడగలవు. గ్రామీణ ప్రాంతాలకు భారత ప్రభుత్వం తలపెట్టిన జాతీయ నీటి సరఫరా పారిశుధ్య పథకం ఇప్పుడీ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో అమలు జరుగుతున్నది. ఈ పథకము ననుసరించి ప్రతి గ్రామానికి మూడు మంచినీటి బావులు, ఇతర పారిశుధ్య సౌకర్యాలు ఏర్పాటు చేయబడగలవు. ఇందు నిమిత్తమై రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రూ. 95.97 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ. 39.39 లక్షలు కేటాయింపబడ్డవి.

## సాంఘిక సంక్షేమం

రాష్ట్ర సంఘసంక్షేమ సలహా సంఘం పునర్నిర్మింప బడింది. భాగ్య విహీనులైన స్త్రీ పురుషులకు పునరావాసం కల్పించడానికై సంఘసంక్షేమ సేవల పథకముననుసరించి రాష్ట్రంలో మూడు శరణాలయాలు, పది జిల్లా శరణాలయాలు నెలకొల్ప బడగలవు. రాష్ట్ర ప్రభుత్వం ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీలను స్వాధీన పరచుకొన్నది. వీటి సంఖ్యను, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో హెచ్చించ వలెనని తలపెట్ట బడింది. యన్. సి. సి. దళాలను విస్తృతం చేయడానికై అదనంగా రూ. 20 లక్షలను ఖర్చుపెట్ట వలెనని సంకల్పించ బడింది. ఉపాధ్యాయుల వేతనాలను హెచ్చించే విషయాన్ని కూడా ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తున్నది.

# ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక పరిస్థితి

## రాష్ట్ర శాసనసభలో ఆర్థికమంత్రి ప్రవేశపెట్టిన తాత్కాలిక బడ్జెట్ విశేషాలు

### క్రొత్త పన్నుల ప్రతిపాదన లేమీ లేవు

ఆంధ్రప్రదేశ్ ఆర్థికమంత్రి శ్రీ కళా వెంకటరావు 1957 మార్చి 20 వ తేదీన రాష్ట్ర శాసనసభలో ఆంధ్రప్రదేశ్ మొదటి బడ్జెట్టును ప్రవేశపెడుతూ రాష్ట్ర ఆదాయవ్యయాలలో వున్న తేడాను దృష్టిలో పెట్టుకొని వ్యవహరిస్తూ పోయినట్లయితే ఆంధ్రప్రదేశ్ భవితవ్యం ఉజ్జ్వలంగా ఉండగలదన్న ఆశాభావాన్ని వెలిబుచ్చారు.



రాష్ట్ర శాసనసభలో ఆర్థికమంత్రి శ్రీ కళా వెంకటరావు తాత్కాలిక బడ్జెట్ ప్రవేశపెడుతున్నారు.

రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని విశదీకరిస్తూ శ్రీ వెంకటరావు ఇలా అన్నారు. "ఆంధ్రప్రదేశ్‌కు ఉజ్జ్వలమైన భవిష్యత్తు వున్నది. అయితే రెవిన్యూ, పెట్టుబళ్ళకు సంబంధించిన మన ఆదాయవ్యయాలలో ప్రస్తుతంవున్న క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొన జాలకపోతే అట్టి భవిష్యత్తును మనం సాధించలేము. రాష్ట్ర వ్యవసాయాభివృద్ధికి మనకు అపారమైన అవకాశాలున్నవి. భగవంతుడు మనకు జీవనదులను ప్రసాదించాడు. మన రైతులు కార్యదీక్ష గలవారు. ఎప్పటికప్పుడు ఆధునిక పద్ధతులను గ్రహించి వాటిని అవలంబించే దృష్టిగలవారు. మనం అనేక బహుళార్థసాధక నిర్మాణాలను, ఆనకట్టలు, కాలువలు చెరువులు - తలపెట్టాము. ఇవి పూర్తి అయితే ఇప్పటికంటె ఇంకా ఎక్కువగా మిగులు ధాన్యాలను పండించ గలుగుతాము. యావద్భారత దేశపు ఆహార ధాన్యాల కొరతను తీర్చడమేగాక నాణ్యమైన పారిశ్రామిక ముడిసరుకులను హెచ్చు పరిమాణంలో ఉత్పత్తి చేయగలం. జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తికి మనకు ఎన్నో అవకాశాలున్నవి. ముడిఇనుము వున్నది. మైకా, మాంగనీస్ మొదలగు ఖనిజములు మన నేలలో లభిస్తవి. రాష్ట్రంలో అనేకచోట్ల పడవల రవాణాకు అనువైన కాలువలున్నవి. విశాఖపట్నం రేవు ఉన్నది. అక్కడే నౌకా నిర్మాణశాల, నూనె పరిశుద్ధి కర్మాగారం వున్నవి. మరి అయిదు చిన్న రేవులుకూడా వున్నవి.

ప్రతి ఆంధ్రుడు కష్టించి పనిచేసి రాబోవు తరాలవారికి మేలు చేకూర్చే ప్రయత్నాలు చెయ్యాలని శ్రీ వెంకటరావు తమ ప్రసంగంలో రాష్ట్ర ప్రజల నుద్బోధించారు. ఆంధ్రప్రదేశ్ పౌరులు కష్టించి పనిచేయడమేగాక, సక్రమంగా పన్నులు చెల్లిస్తూ, ఖర్చు తగ్గించుకొని డబ్బు పొదుపు చేసుకుంటూ ఆ డబ్బును ప్రభుత్వానికి పెట్టుబడి పెట్టాలి. అప్పుడు మాత్రమే మనకు ఉజ్జ్వల భవిష్యత్తుకు అవకాశాలుంటవి, అని ఆర్థికమంత్రి అన్నారు.

ఇప్పుడు ప్రవేశ పెడుతున్న బడ్జెటు సమగ్రమైనది కాదనీ, పూర్తిబడ్జెటు జూన్ లేదా జులై నెలలో సభవారిముందుంచబడ గలదనీ ఆర్థికమంత్రి వివరించారు ప్రస్తుతానికి 1957-58 ఆర్థిక సంవత్సరంయొక్క మొదటి నాలుగునెలల్లో పరిపాలనా నిర్వహణకూ, అత్యవసరమైన కొత్త పథకాలకు అవసరమయ్యే ధనాన్ని వ్యయపరచడానికీ ఆమోదం పొందేనిమిత్తం మాత్రమే ఈబడ్జెటు ప్రవేశ పెట్టబడుతున్నదని వారు తెలిపారు.

ఆర్థికమంత్రి ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో రూ 50.23 కోట్ల ఆదాయం, రూ 55.53 కోట్ల ఖర్చు అంచెనా వేయబడింది. అంటే బడ్జెటులో రూ 5 30కోట్ల లోటు వుందన్నమాట. ప్రస్తుత సంవత్సరంలో రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద అమలు జరుగవలసిన పథకాలకు బడ్జెట్‌లో రూ 34.15కోట్లు కేటాయింప బడ్డవి.

బడ్జెట్ లోటును విశదీకరిస్తూ "జాతీయ ప్రణాళికలో నిర్ణయించబడిన ప్రాధాన్యక్రమానికి అనుగుణంగా, అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడిన బడ్జెటు తప్పకుండా లోటుబడ్జెటేఅవుతుంది. ఒకవేళ పెట్టుబళ్ళనుతగ్గించడానికి ఏమాత్రంప్రయత్నంజరిగినా అందువల్ల ప్రణాళికలో నిర్ణయింపబడ్డ లక్ష్యాలు సిద్ధించకపోవచ్చు"అని ఆర్థికమంత్రి హెచ్చరికచేశారు.

వివిధ అంశములను గూర్చి ఆర్థికమంత్రి బడ్జెట్ ప్రసంగంలోని ముఖ్యవిశేషాలు, లెక్కల జాబితాలు ఈ దిగువ ఉల్లేఖింప బడ్డవి.

## రాష్ట్ర ఆర్థిక పరిస్థితి

క్రొత్తగా రూపొందిన ఆంధ్రప్రదేశపు విస్తీర్ణము 106,041 చదరపు మైళ్ళు; జనసంఖ్య 313 లక్షలు. క్రొత్తగా నిర్మించబడిన రాష్ట్రాలలో జనసంఖ్య రీత్యా ఆంధ్రప్రదేశము నాలుగోస్థానం; వైశాల్యం రీత్యా అయిదో స్థానం ఆక్రమిస్తున్నది. ప్రస్తుత పరిస్థితులలో, మొత్తం మీద ఆర్థికంగా ఆంధ్రప్రదేశపు వ్యవహారాలు సంతృప్తికరంగానే వున్నవి.

## ధరవరలు

1956 ఫిబ్రవరి నుండి 1957 జనవరి వరకు గల సంవత్సరాంతంలో ఆంధ్రప్రదేశ్‌లో సరుకుల సగటు టోకుధరలు సంవత్సరారంభంలోకంటే ఎక్కువగా వున్నవి. ఈ సంవత్సరకాలంలో వరి, గోధుమ ధాన్యాలలో 19 నుండి 26 శాతం వరకు ధరల పెరుగుదల సంభవించింది. జొన్నలు 49 శాతం; సజ్జలు 51 శాతం; రాగులు 61 శాతం ధరలు పెరిగినవి. పప్పుల ధరలు 12 నుండి 23 శాతం వరకు పెరిగినవి. వీటిలో మినుముల ధరమాత్రం 10 శాతం తగ్గింది. నూనె గింజలు, బెల్లం, ఉల్లిగడ్డ, చింతపండు మొదలైన వాటి ధరలు కూడా 16 నుండి 32 శాతం వరకు పెరిగినవి. పంచదార, కొబ్బరి ధరలు స్థిరంగా

ఉన్నవి. పసుపు, ధనియాలు మాత్రం తగ్గినవి. ఇవి ప్రధానమైన పంటల కోతల కాలంలోవున్న ధరలు. తరువాత కాలంలో అంటే 1956 ఆగస్టు, నవంబరు మధ్య కాలంలో ముఖ్యమైన ఆహార ధాన్యాల ధరలు సంవత్సరాంతంలో కంటె 3 నుంచి 7 శాతం వరకు ఎక్కువగానే వున్నవి.

## పరిశ్రమలు. ఖనిజములు

ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ, పారిశ్రామిక ఉత్పత్తి క్రమంగా అభివృద్ధి చెందుతున్నది. దక్షిణాపథానికి బొగ్గు సప్లయి చేయడంలో మనరాష్ట్రం ప్రధాన భూమిక వహిస్తున్నది. 1956 లో బొగ్గు ఉత్పత్తి 17.40 లక్షల టన్నులు; అంటే అంతకుముందు సంవత్సరంకంటే 9.4 శాతం ఎక్కువ. ఆంధ్రపదేశ్ సిగరెట్ల ఉత్పత్తిలో ప్రధానమైన రాష్ట్రం. భారతదేశంలోని సిగరెట్ల ఉత్పత్తిలో 5వ వంతు మన రాష్ట్రంలో తయారవుతున్నవి. 1956 లో సిగరెట్ల ఉత్పత్తి మన రాష్ట్రంలో 492 కోట్లు. అంటే 1955 ఉత్పత్తికంటే 21.5 శాతం ఎక్కువ. అంతేకాక భారతదేశంలో మొత్తం యాస్‌బెస్టాస్ ఉత్పత్తిలో సగంవరకూ ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్నది. దేశంలో లభ్యమవుతున్న బెరైటీస్ అంతా ఆంధ్రప్రదేశ్‌లోనే దొరుకుతుంది. మాంగనీస్, అభ్రకం, గ్రాఫైట్స్ మొదలైనవి కూడా మన రాష్ట్రంలో పుష్కలంగా లభ్యమవుతున్నవి. ఇంకా మన రాష్ట్రంలో సగ భాగంలో ఖనిజ పరిశోధన జరగ లేదనే విషయాన్ని దృష్టిలో పెట్టుకుని పరిశీలిస్తే, మన ఖనిజ సంపదను అభివృద్ధి పరుచుకునే అవకాశాలు ఎంత ఎక్కువగా వున్నవో స్పష్టమవుతుంది. మన రాష్ట్రంలో కాగితం, పంచదార కూడ భారీఎత్తున ఉత్పత్తి చేయబడుతున్నవి. దేశం మొత్తం ఉత్పత్తిలో మనరాష్ట్రంలోని కాగితం ఉత్పత్తి సుమారు 8.2 శాతం; పంచదార 7.3 శాతం. 1955 లో రాష్ట్రంలో 3.03 లక్షల హండ్రడ్ వెయిట్ల కాగితం, 1.16 లక్షల టన్నుల చక్కెర ఉత్పత్తి అయినవి.

1956 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ కంతటికీ వర్తించే సంఖ్యా వివరాలు లభ్యంకాలేదు. కాని తెలంగాణా ప్రాంతములో జరిగే పారిశ్రామిక అభివృద్ధి ప్రమాణాలు రాష్ట్రమంతటికీ ప్రాతినిధ్యం వహించగలవని చెప్పవచ్చు. తెలంగాణా ప్రాంతంలో గత సంవత్సరంకంటె పంచదార ఉత్పత్తిలో 26.2 శాతం; కాగితంలో 13.2 శాతం; సిగరెట్లలో 21.5 శాతం అభివృద్ధి సాధించబడింది. ఈ సంవత్సరం ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తి 1955 కంటే 6.9 శాతం ఎక్కువ. నూలు ఉత్పత్తి 3. 3 శాతం పెరిగింది. కాని వస్త్రాల ఉత్పత్తి మాత్రం వెనుకటి స్థాయిలోనే జరిగింది.

## గత రెండేండ్లలో బడ్జెటు పరిస్థితి 1957-58 సం. పు అంచెనాలు

1955 - 56 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మొత్తానికి రివిన్యూ ఆదాయం రు. 40.42 కోట్లు; రివిన్యూ ఖాతాక్రింద ఖర్చు రు. 47.41 కోట్లు. కాగా లోటు రు. 6.99 కోట్లు. పోతే ఆస్తి పెట్టుబడి రు. 10.85 కోట్లు. అందువల్ల సంవత్సరాంతానికి నిలువ ధనం రు. 4.27 కోట్లు.

1956-57 సంవత్సరానికి రివిన్యూ పద్దుక్రింద ఆదాయం బడ్జెటు అంచనా రు. 40.93 కోట్లు. సవరించబడిన అంచనా రు. 47.25 కోట్లకు పెరిగింది. అధికంగా అంచనా వేయబడిన 6.28 కోట్ల రూపాయిలు యీ క్రిందివిధంగా లభించినవి. రాష్ట్ర ఎక్సైజు పన్నులు రు. 75 లక్షలు, స్టాంపులు రు. 56 లక్షలు, అడవులు రు. 43 లక్షలు, వాహనాలమీద పన్నులు రు. 27 లక్షలు, యితర పన్నులు, సుంకాలు రు. 55 లక్షలు, నీటిపారుదల రు. 17 లక్షలు, పరిశ్రమలు, సప్లయిలు రు. 48 లక్షలు, విద్యుచ్ఛక్తి పథకాలు రు. 63 లక్షలు, చిల్లర పద్దులు రు. 34 లక్షలు, కమ్యూనిటీ ప్రాజెక్టులు రు. 184 లక్షలు, యితర పద్దులలో రు. 11 లక్షలు తరుగు.

పోతే యిక ఖర్చు విషయంలో, 1956-57 బడ్జెటు అంచనాలలో రు. 47.13 కోట్ల రివిన్యూఖర్చు చూపించబడింది. సవరించబడిన అంచనాలలో రివిన్యూ ఖర్చు రు. 51.94 కోట్లకు పెరిగింది. అంటే మొత్తంమీద రు. 4.81 కోట్ల ఖర్చు ఎక్కువ అంచనా వేయబడింది. ప్రధానంగా యీ క్రింది పద్దుల క్రింద యీఖర్చు అంచనా తయారు చేయబడింది. వివిధ పద్దులక్రింద వడ్డీ రు. 115 లక్షలు, ఋణపరిష్కారాలు రు. 15 లక్షలు, సాధారణ పరిపాలన రు. 42 లక్షలు, విద్య రు. 34 లక్షలు, వైద్య వసతులు రు. 26 లక్షలు, పరిశ్రమలు, సప్లయిలు రు. 19 లక్షలు, చిల్లరపద్దులు రు. 40 లక్షలు, కమ్యూనిటీ ప్రాజెక్టులు రు. 204 లక్షలు, యితర పద్దులక్రింద మొత్తం నికరంగా రు. 20 లక్షల తగ్గింపు జరిగింది. 1956-57 సంవత్సరానికి బడ్జెటు అంచనాలో స్థిరాస్తి నిర్మాణాలకు రు 24.34 కోట్లు కేటాయించ బడగా అది రు. 24.16 కోట్లకు సవరించ బడింది.

1956 అక్టోబరులో ఆంధ్ర ప్రభుత్వం రు. 6.58 కోట్లు ఋణం ప్రజలవద్ద నుండి సేకరించింది. పోతే పూర్వ హైదరాబాదు ప్రభుత్వం 1956 అక్టోబరులో సేకరించిన ప్రజాఋణంలో తెలంగాణావంతు రు. 1.30 కోట్లు అని అంచనా వేయగా, మొత్తం యిప్పటి ఋణం రు. 7.88 కోట్లవరకు ఉంటుంది. 1956-57 సంవత్సరానికి లభ్యమయ్యే కేంద్ర ప్రభుత్వపు ఋణ సహాయం రు. 21.73 కోట్లవరకు వుండవచ్చునని అంచనా. పోతే యితరులకు చెల్లింపుల విషయంలో, ఇండియా ప్రభుత్వం మద్రాసు ప్రభుత్వం రిజర్వు బ్యాంకులకు ఋణాల తీర్మానంక్రింద ఋణపులసింది రు. 9.70 కోట్లవరకు వుంటుంది. పోతే అప్పులు, అడ్వాన్సులు, యితర పద్దులక్రింద చెల్లించని పద్దులమొత్తం రు. 95 లక్షల వరకు తేలుతుంది.

1956-57 సంవత్సరాంతానికి రు. 7.50 కోట్ల లోటు కలుగుతుందని అంచనా.

## 1957-58 బడ్జెట్ అంచనాలు, రివిన్యూ ఆదాయం

1957-58 బడ్జెటు అంచనాలను పరిశీలిద్దాం. 1956-57 సవరించబడిన అంచనాలలోని రు. 50.23 కోట్లకుగాను, ప్రస్తుతం అమలులోవున్న పన్నుల స్థాయినిబట్టి రివిన్యూ ఆదాయం రు. 47.25 కోట్లు అని అంచనా. అంటే వచ్చే సంవత్సరములో రు. 2.98 కోట్లు ఎక్కువ వస్తుందన్న మాట. ఈ అధికాదాయం ఈ క్రింది పద్దులక్రింద లభిస్తుందని అంచనా. కేంద్ర సుంకాలమీద ఆదాయం రు. 20 లక్షలు; భూమిశిస్తు రు. 84 లక్షలు; యితర పన్నులు, సుంకాలు రు. 92 లక్షలు; పరిశ్రమలు, సప్లయిలు రు. 30 లక్షలు; విద్య రు. 38 లక్షలు; వైద్య, ప్రజారోగ్యాలు రు. 21 లక్షలు; వ్యవసాయం 31 లక్షలు; చిల్లర శాఖలు రు. 27 లక్షలు; విద్యుచ్ఛక్తి పథకాలు రు. 22 లక్షలు. సూపరాన్యుయేషను రు. 16 లక్షలు యితరత్రా అధికాదాయం రు. 20 లక్షలు; కమ్యూనిటీ ప్రాజెక్టులక్రింద తగ్గింపులద్వారా లభించే ఆదాయం రు. 82 లక్షలు; కేంద్ర ప్రభుత్వం యిచ్చే సహాయక గ్రాంట్లు రు. 21 లక్షలు.

1955-56, 1956-57 సంవత్సరాలకు యీనాం భూముల మీద బకాయీలు వసూలు చేయబడు తున్నందున భూమిశిస్తులో చూపిన ఎక్కువ ఆదాయం లభిస్తున్నది. ఇతర పన్నులు, సుంకాలక్రింద రు. 92 లక్షల అధికాదాయం సమకూర్చ గలిగింది ప్రధానంగా అమ్మకంపన్ను. పోతే పరిశ్రమలు, సప్లయిలు, విద్య, యితర శాఖల పద్దులక్రింద అంచనా వేయబడిన అధికాదాయం ముఖ్యంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పథకాలకుగాను కేంద్ర ప్రభుత్వం నుండి, యితర మార్గాలలోను లభించే గ్రాంట్లవల్ల కలుగుతున్నది. విశాఖపట్టణంలో కాల్టెక్స్ నూనె శుద్ధి కర్మాగారానికి, సిమెంటు ఫ్యాక్టరీలకూ, ఫెర్రో మాంగనీస్, ముడి పదార్థాల శుద్ధి ఫ్యాక్టరీలకూ విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడే కార్యక్రమాలవల్ల యీ పద్దుక్రింద చూపబడిన ఆదాయం లభిస్తుంది. పూర్వ హైద్రాబాదు రాష్ట్రపు పెన్షనర్లకు పెన్షన్ చెల్లింపు బాధ్యత మొదట్లో 1956 నవంబరు నుండి 1957 మార్చి 31 వరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే భరిస్తుంది, తరువాత అందులోనుండి కొంత మొత్తము సంవత్సరాంతానికి బొంబాయి, మైసూరు ప్రభుత్వాలనుండి రాబట్టుకో బడుతుంది. ఈ కారణాలవల్ల సూపరాన్యుయేషన్ పద్దు క్రింద అధికాదాయం చూపబడింది.

కమ్యూనిటీ ప్రాజెక్టుల క్రింద జరిగే ఖర్చులో కేంద్ర ప్రభుత్వం భరించే మొత్తాలు వాటిమీద ఆదాయంగా చూపబడినవి. ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వం వద్దనుండి రావలసిన బకాయీలు లెక్కలోనికి తీసుకోబడి 1956-57 సవరించబడిన అంచనాలలో యింతమొత్తం చూపబడింది. వచ్చే సంవత్సరం యీవిధంగా బకాయీలు పెట్టడం జరుగదు. అంతేకాక అనేక బ్లాకులలో మూడు సంవత్సరాల కార్యక్రమాలు పూర్తి అయినందున, వాటిలో అత్యవసరమైన సిబ్బంది మాత్రమే వుండి పనిచేస్తుంది. ఇందువల్ల కేంద్రప్రభుత్వము నుండి లభించే సహాయంకూడా తగ్గిపోతుంది.

చట్టరీత్యా కేంద్ర ప్రభుత్వమునుండి రావలసిన కొన్ని గ్రాంట్లకు ఆర్థిక కమీషన్‌వారు సిఫార్సు చేయడం అవసరం. అదియింకా జరుగలేదు. అందువల్ల ప్రస్తుతానికి అటువంటి పద్దులమీద ఆదాయం లెక్కలోకి తీసుకోబడలేదు.

## రివిన్యూ ఖర్చు

సవరించబడిన అంచనాలలో ఖర్చు రు. 51.94 కోట్లకుగాను 1957-58 బడ్జెటు అంచనాలో మొత్తం రివిన్యూ ఖర్చు 55.53 కోట్లవరకు పెరిగింది, అది యీ క్రింది విధంగా ఖర్చుచేయ బడుతుంది :-

| | రు. కోట్లలో |
|---|---|
| 1. స్టాంపింగ్ చార్జీలు | 52.85 |
| 2. ద్వితీయ ప్రణాళిక క్రింది పార్టు 2 పథకాలు | 2.68 |

ద్వితీయ ప్రణాళిక క్రిందిపార్టు 2 పథకాలకుగాను చేసిన కేటాయింపు రు. 2.68 కోట్లు యీ క్రిందివిధంగా ఖర్చు చేయబడుతుంది :—

| పద్దు వివరం | రు. లక్షలలో |
|---|---|
| 1. సాధారణ పరిపాలన | 2.67 |
| 2. విద్య | 72.08 |
| 3. వైద్య, ఆరోగ్యవసతులు | 25.87 |
| 4. వ్యవసాయం | 37.21 |
| 5. పశువైద్యం | 13.38 |
| 6. సహకారం | 10.17 |
| 7. అడవులు | 0.23 |
| 8. పరిశ్రమలు | 47.80 |
| 9. సాంఘిక సంక్షేమం, కార్మిక వ్యవహారాలు | 47.35 |
| 10. సివిల్ నిర్మాణాలు | 10.77 |
| 11. సంఖ్యా వివరాలు, శిక్షణ | 0.17 |
| మొత్తం | 267.70 |

సాధారణ పరిపాలనక్రింద చేయబడిన ఖర్చు కేటాయింపు మొత్తం రు. 2.67 లక్షలు అదనపు గ్రామీణ రేడియో సెట్టులకుగాను ఉద్దేశించబడింది.

విద్య : విద్యకొరకు కేటాయించబడిన రు. 72.08 లక్షలు యీ క్రింది విధంగా వినియోగించ బడుతవి :

| | రు. లక్షలలో |
|---|---|
| 1. యూనివర్శిటీ విద్య | 20.26 |
| 2. ప్రాథమికవిద్య | 20.11 |
| 3. ఉన్నత విద్య | 12.83 |
| 4. సాంకేతిక విద్య | 13.12 |
| 5. ఇతర రకార విద్యా వ్యాసంగాలు | 5.76 |

యూనివర్సిటీ విద్యకు కేటాయించబడిన రు. 20.26 లక్షలలో ఆంధ్ర విశ్వ విద్యాలయానికి రు. 2 లక్షలు; శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయానికి రు. 10 లక్షలు; ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రు. 6.5 లక్షలు; ఆర్ట్సు, సైన్సు కళాశాలకు సామగ్రి, పరికరాల నిమిత్తం రు. 1.76 లక్షలు ఖర్చు చేయబడుతవి. ప్రాథమిక, ఉన్నత విద్యా వ్యాప్తి కార్యక్రమలో 200 బేసిక్, 100 సాధారణ ప్రాథమిక పాఠశాలల ప్రారంభం, 640 ప్రాథమిక పాఠశాలలను బేసిక్ పాఠశాలలుగా మార్చుట, పాఠశాలకు ఫర్నిచరు సాధన సామగ్రి, భవనాలు, ఆటస్థలాలు మొదలైనవి చేకూర్చుట; ప్రాథమికోపాధ్యాయుల పూర్వదశలో శిక్షణ కొరకు ఒక ట్రైనింగ్ పాఠశాల నెలకొల్పుట; 13 మాధ్యమిక 3 క్రొత్త ఉన్నత, 2 హైయర్ సెకండరీ, 2 ప్రాథమిక బేసిక్ పాఠశాలలను నెలకొల్పుట; ప్రస్తుతపు పాఠశాలలలో 466 అదనపు సెక్షన్లను ఏర్పాటు చేయుట మొదలైన కార్యక్రమాలు చేరివున్నవి.

పోతే సాంకేతిక, వృత్తి విద్యల విషయంలో, రెండు బేసిక్ ట్రైనింగ్ పాఠశాలలు, ట్రైనింగు కళాశాలల్లో అదనపు సిబ్బంది నియామకం, రాజమండ్రిలోని ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో ఒక పరిశోధన కేంద్రం, పౌర శిక్షణ, ఫర్నిచరు, ఇతర సాధన సామగ్రి, చేతివృత్తుల శిక్షణ కేంద్రాలు మొదలైనవి ప్రారంభింప బడుతవి.

అంతేకాక ప్రాంతీయ గ్రంథాలయాలు, దృశ్య శ్రవణ విద్యా సౌకర్యాలు, నేషనల్ కేడెట్‌కోర్, ఆగ్జిలియరీ కేడెట్‌కోర్, హిందీ ప్రచారం మొదలైన కార్యక్రమాలకు కూడా ఖర్చు కేటాయించబడుతుంది.

## ఆరోగ్య సౌకర్యాలు

పార్టు 2 పథకాలకుగాను రు. 25.87 లక్షలు కేటాయించ బడినది. సహాయక నర్సులు, మంత్రసానులు, హెల్తు విజిటర్లు, లేబరేటరీ అసిస్టెంట్లు, రిఫ్రాక్షనిస్టులు, నేత్రరోగ నిపుణులు, పబ్లిక్ హెల్తు నర్సులు, మొదలైన వారికి శిక్షణ సౌకర్యాలు కలుగజేయుట, హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులను వృద్ధిచేయుట, దంతవైద్య కళాశాలలు ప్రారంభించుట, క్షయరోగ చికిత్స ప్రదర్శన కేంద్రాల నిర్వహణ, బలవర్ధక పదార్థాల కేంద్ర లేబరేటరీ, శానిటరీ ఇన్స్పెక్టర్ల శిక్షణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల స్థాపన, జాతీయ మలేరియా నివారణ పథకం, ఫైలేరియా నివారణ పథకం, పాఠశాలల్లో ఆరోగ్య కేంద్రాలు, కుష్ఠువ్యాధి నివారణ మొదలైన కార్యక్రమాలమీద ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## వ్యవసాయం

వ్యవసాయ అభివృద్ధి పథకాలకుగాను మొత్తం రూ. 37.21 లక్షలు కేటాయించబడినది. బాపట్లలోని వ్యవసాయ కళాశాలలో పరిశోధన సౌకర్యాలను వృద్ధిచేయుట, మాచ్ ఖండ్ ప్రాంతంలో భూసార పరిరక్షణ పథకం, పండ్ల పరిశోధన కేంద్ర స్థాపన పథకం, నూనెగింజల పరిశోధన కేంద్రం ఇంకా అనేక పరిశోధన పథకాలకై ఈ ధనం వెచ్చించబడుతుంది.

## పశువైద్యం

రిండర్ పెస్ట్ వ్యాధి నిర్మూలన పథకం, హైద్రాబాదు కేంద్ర కోళ్లపెంపకపు కేంద్రస్థాపన, హైద్రాబాదులో బైలాజికల్ దినుసుల ఉత్పత్తి కేంద్రం పునర్నిర్మాణం, గోశాలలకు గ్రాంట్లు, కోళ్లపెంపకం అభివృద్ధి మొదలైన కార్యక్రమాలకు బడ్జెటులో డబ్బు కేటాయించ బడింది.

## సహకారం

సహకార సంఘాల సభ్యులు, కార్యనిర్వాహక వర్గ సభ్యులకు శిక్షణ కల్పించుట. రాష్ట్ర సహకార అభివృద్ధి నిధికి, వ్యవసాయ పరపతినిధికి చందాలు, భూమి తనఖా బ్యాంకులు, సహకార మార్కెటింగ్ వ్యవస్థ అభివృద్ధి, హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో ఒక పాలసప్లయి పథకం అమలు పరచుట మొదలైన కార్యక్రమాలకు గాను రు. 10.17 లక్షలు కేటాయించ బడినవి.

## పరిశ్రమలు

చిన్నతరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమల వ్యాప్తికీ, అభివృద్ధికీ పథకాలు తలపెట్ట బడినవి. వీటిలో ప్రధానమైనవి: పింగాణి సామగ్రి, రేడియో పరికరాలు తయారు చేసే కేంద్రాలు, సైకిలుభాగాలు, గ్రాఫైట్ క్రూసిబిల్స్, ఫ్రాక్షనల్ హెచ్. పి. మోటార్లు. రేడియో ట్రాన్స్మిటర్ల విడిభాగాలు, 16 మిల్లీమీటర్ ప్రొజెక్టర్లు, విజయవాడ, విశాఖపట్టణాల్లో పారిశ్రామిక ఎస్టేట్ల నిర్మాణ పథకాలు. సహకార కార్యక్రమ కేంద్ర స్థాపన పథకం, డిజైన్ల కేంద్ర సంఘం, బీడీ ఉత్పత్తులు, హిమ్రూనేత కేంద్రాలు, గాజుల పరిశ్రమ, సిల్కు పరిశ్రమాభివృద్ధి మొదలైనవి.

## కార్మిక సాంఘిక సంక్షేమం

సంక్షేమ కేంద్రాల నిర్వహణ నిమిత్తం రు. 1.32 లక్షలు, ఉద్యోగుల యిన్సూరెన్సు పథకంక్రింద రు. 2.50 లక్షల కేటాయింపు జరిగింది.

హరిజనులకు గృహనిర్మాణ పథకం, సేవా సంస్థలకు సహాయం, హాస్టళ్లకు సబ్సిడీలు, వెనుకబడిన తరగతుల పాఠశాలల విద్యార్థులకు మధ్యాహ్న భోజన వసతి సౌకర్యాలు, మాజీ నేరస్థజాతుల గృహనిర్మాణ పథకం, విద్య, వ్యవసాయం, పశుపోషణ, కుటీరపరిశ్రమలు, గ్రామరోడ్లు, వైద్యవసతులు, భూమి కాలనైజేషన్, నీటి పారుదల సౌకర్యాలు. సహకారం, ఫైనాన్సుకార్పొరేషన్ మొదలగు అనేక రంగాలకు పరివ్యాప్తమయిన హరిజన సంక్షేమ కార్యకలాపాలు మొదలైనవాటికి గాను బడ్జెటులో రు. 37.53 లక్షల మొత్తం కేటాయించబడింది.

సాంఘిక సంక్షేమవ్యాప్తి పథకాలకుగాను రు. 4 లక్షలు. సాంఘికంగానూ, నైతికంగాను ఆరోగ్య ప్రమాణాలు (సోషల్ అండ్ మారల్ హైజీన్) పెంపొందించడానికి రు. 2 లక్షలు కూడా కేటాయింపబడినవి.

## ఆదాయపు లోటు

1957-58 వ సంవత్సరపు ఆదాయపు అంచెనాలప్రకారం రూ. 5.29 కోట్ల లోటు వస్తుంది. నాన్ గజిటెడ్ ఆఫీసర్ల సహాయానికిగాను చేయబోయేఖర్చుతో ఈ లోటు రూ. 6.88 కోట్లకు పెరుగుతుంది. ఈ సహాయం విషయమై తర్వాత ప్రస్తావిస్తాను.

## పెట్టుబడి ఖర్చు

1957-58 బడ్జెటు అంచనాలలో నిర్మాణయుతమైన పెట్టుబడి ఖర్చులక్రింద రు. 23.63 కోట్లు కేటాయించబడింది. ఇందులో రు. 13.94 కోట్లు ఆంధ్రప్రాంతంలోనూ, మిగిలిన రు. 8.89 కోట్లు తెలంగాణా ప్రాంతంలో పథకాలమీదను ఖర్చు జరుగుతుంది. ఉభయ ప్రాంతాలలో వివిధ కార్యక్రమాల వివరాలు యీ క్రింది విధంగా వున్నవి :

| | రు. కోట్లలో |
|---|---|
| 1. సాగునీటి పారుదల పథకాలు | 3.80 |
| 2. బహుళార్థసాధక నదీలోయ పథకాలు | 6.84 |
| 3. విద్యుచ్ఛక్తి పథకాలు | 6.25 |
| 4. సివిల్ నిర్మాణాలు | 4.83 |
| 5. ప్రజారోగ్య సౌకర్యాల అభివృద్ధి | 0.94 |
| 6. యితర పథకాలు | 0.97 |
| మొత్తం | 23.63 |

సాగు నీటి పారుదల పథకాల క్రింద చూపబడిన రు. 3.80 కోట్లలో యీ క్రింది కార్యక్రమాలు చేరివున్నవి.

(అ) *ఆంధ్రప్రాంతం :—*

| | రు. లక్షలలో |
|---|---|
| తుంగభద్ర | 47.94 |
| తుంగభద్ర ఎగువ కాలువ | 45.00 |
| కృష్ణా రెగ్యులేటర్ వంతెన | 66.22 |
| కర్నూలు-కడప కాలువ | 59.26 |
| దిగువ సగిలేరు ప్రాజెక్టు | 6.00 |

| | |
|---|---|
| వంశధార ప్రాజెక్టు | 5.00 |
| భైరవానితిప్ప ప్రాజెక్టు | 34.34 |
| రాళ్ళపాడు ప్రాజెక్టు (ద్వితీయదశ) | 2.15 |
| స్పెషల్ మైనర్ యిరిగేషన్ పథకాలు | 25.78 |
| (ఆ) తెలంగాణా ప్రాంతం :— | |
| కోయిల్‌సాగర్ ప్రాజెక్టు | 1.65 |
| సరళాసాగర్ ప్రాజెక్టు | 8.00 |
| మూసీ ప్రాజెక్టు | 32.45 |
| మైనర్ యిరిగేషన్ పథకాలు | 34.93 |

బహుళార్ధసాధక నదీలోయ పథకాలక్రింద కేటాయించబడిన రు. 6.84 కోట్లు ఈ క్రింది కార్యక్రమాలపై ఉద్దేశించబడినవి :

| | | |
|---|---|---|
| (అ) ఆంధ్ర ప్రాంతం :— | | రు. లక్షలలో |
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు | | 350.00 |
| (ఆ) తెలంగాణా ప్రాంతం :— | | రు. లక్షలలో |
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు | 200.00 | |
| గోదావరి ఉత్తరపు కాల్వ | 31.75 | 333.75 |
| రామగుండం థర్మల్ విద్యుత్పథకం | 102.00 | |
| (అ), (ఆ) ల మొత్తం | | రు. 6.84 కోట్లు |

విద్యుచ్ఛక్తి పథకాలకై కేటాయించబడిన రు. 6.25 కోట్ల డబ్బు యీ క్రింది పథకాల మీద వెచ్చించబడుతుంది :

(అ) ఆంధ్ర ప్రాంతం :—

| | రు. లక్షలలో |
|---|---|
| మాచ్‌ఖండ్ | 331.62 |
| తుంగభద్ర | 136.23 |
| చిత్తూరు | 35.92 |
| నెల్లూరు | 7.50 |
| (అ) మొత్తం | 511.27 |

(ఆ) తెలంగాణా ప్రాంతం :—

| | |
|---|---|
| నిజాంసాగర్ జలవిద్యుత్పథకం | 17.70 |
| దేవనూర్ హైడెల్ సివిల్ నిర్మాణాలు | 5.00 |
| గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి | 36.50 |
| నగర విద్యుచ్ఛక్తి శాఖల పునర్నిర్మాణం | 41.40 |
| జిల్లాలలో విద్యుత్పథకాలు | 8.11 |
| జలవిద్యుత్పథకాల పరిశీలన కార్యక్రమం | 1.50 |
| పరిశీలన, సర్వేశాఖ | 3.34 |
| (ఆ) మొత్తం | 113.55 |
| (అ), (ఆ) ల మొత్తం | 6.25 కోట్లు. |

సివిల్ నిర్మాణాల పద్దు క్రింద పెట్టుబడి ఖర్చుగా కేటాయించబడినది రు. 4.83 కోట్లు. ఈ కేటాయింపులో చాలా భాగం ప్రస్తుతం కొనసాగుతున్న నిర్మాణాలను పూర్తిచేయడానికి వినియోగించబడుతుంది. ఇందులో రు. 70 లక్షలు మాత్రం ద్వితీయ ప్రణాళిక క్రింద గల పార్టు 2 పథకాలకు సంబంధించిన పెట్టుబడి నిర్మాణాలకు కేటాయించబడింది. రెవిన్యూ అంచనాలలో యీ ఖర్చులకు అవకాశంకల్పించబడింది. ఈ రు. 70 లక్షల మొత్తం శాఖలవారిగా యీ క్రింది విధంగా విభజించబడింది.

| | | రు. లక్షలలో |
|---|---|---|
| 1. | విద్యాశాఖ | 28.77 |
| 2. | ఆరోగ్యశాఖ | 17.51 |
| 3. | వ్యవసాయశాఖ | 2.53 |
| 4. | పరిశ్రమలశాఖ | 5.54 |
| 5. | కార్మిక, సాంఘిక సంక్షేమశాఖ | 10.03 |
| 6. | పబ్లిక్ వర్క్స్ శాఖ | 5.60 |
| | మొత్తం | 69.98 లేక |
| | | రు. 70 లక్షలు |

ఈ ఖర్చులలో కొన్ని ముఖ్యమైన పద్దులు యీ క్రింద వుదహరింపబడినవి :

| | | రు. లక్షలలో |
|---|---|---|
| 1. | వుయ్యూరు, విశాఖపట్నం, తిరుపతి కాకినాడలలో పాలీటెక్నిక్ సంస్థలు | 15.00 |
| 2. | వివిధ కళాశాలలు, పాఠశాలలకు భవనాలు, ఆటస్థలాల నిర్మాణం | 6.33 |
| 3. | శ్రీకాకుళం, ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల భవనాలు | 3.00 |
| 4. | పెంటపాడు పోస్టు గ్రాడ్యుయేటు బేసిక్ శిక్షణ కళాశాలకు భవనాలు | 1.29 |
| 5. | ఇంజనీరింగ్ కళాశాల అభివృద్ధి | 1.80 |
| 6. | బాలభటోద్యమ అభివృద్ధికి గ్రాంటు | 1.00 |
| 7. | ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 4.55 |
| 8. | పిచ్చి ఆసుపత్రులు | 1.00 |
| 9. | పబ్లిక్ హెల్తు లేబరేటరీ | 2.50 |
| 10. | దంతవైద్య కళాశాలలు, ఆసుపత్రుల ప్రారంభం | 1.00 |
| 11. | క్షయవ్యాధి చికిత్స వసతులు | 1.50 |
| 12. | అంటువ్యాధుల చికిత్సకు ఆసుపత్రులు | 3.00 |

| | రూ. లక్షలలో |
|---|---|
| 13. కదం ప్రాజెక్టువద్ద వ్యవసాయక్షేత్రం | 0.95 |
| 14. సంగారెడ్డి మార్గో పరిశోధన పథకం | 0.25 |
| 15. మత్స్య పరిశ్రమ సామగ్రి సప్లయి | 0.87 |
| 16. తిరుపతిలో శ్రీవెంకటేశ్వర కాగితం అట్టలమిల్లు | 2.25 |
| 17. హైదరాబాదులో కుటీర పరిశ్రమల విక్రయశాల అభివృద్ధి | 1.00 |
| 18. చేతివృత్తుల సామగ్రికి విక్రయశాల నిర్మాణ పథకం | 0.82 |
| 19 దంతము, కొమ్ము పరిశ్రమలు, గుండీల పరిశ్రమ, కళాత్మకమైన తోళ్ళపరిశ్రమలు, కొయ్యలో చిత్రాలు చెక్కడం, ఎంగ్రేవింగ్ పరిశ్రమలు, శిల్కు పరిశ్రమ మొదలైన వాటికి పెట్టుబడిసప్లయి | 1.37 |
| 20. పారిశ్రామిక గృహనిర్మాణ పథకాలు | 7.03 |
| 21. సేవాకేంద్రాలు | 1.00 |
| 22. ఏజన్సీ ప్రాంతాల అటవీ ప్రదేశాలల్లో రోడ్ల నిర్మాణం | 2.00 |
| 23. రాజభవన్ అభివృద్ధి మరమ్మతులు | 5.00 |
| 24. యాత్రాక్షేత్రాల్లో సౌకర్యాల అభివృద్ధి | 0.60 |

## అప్పులు, అడ్వాన్సులు

వచ్చే సంవత్సరం బడ్జెటులో అప్పులు, అడ్వాన్సుల క్రింద కేటాయింపులు చేయబడిన ప్రధానాంశాలు యీక్రింద ఉదహరింప బడినవి.

## ఆంధ్ర ప్రాంతం :

| | |
|---|---|
| 1. భూమి అభివృద్ధి, వ్యవసాయదారులకు ఋణాల మంజూరు చట్టంక్రింద వ్యవసాయ దారులకు అప్పులు | 70.03 |
| 2. రసాయనిక ఎరువుల కొనుగోలు నిమిత్తం అప్పులు (స్వల్ప కాలిక ఋణాలు) | 125.00 |
| 3. నీటి సప్లయి, మురుగు నీటి పారుదల సౌకర్య ప్రణాళికల నిర్వహణకై పుర పాలక సంఘాలకు అప్పులు | 43.08 |
| 4. గృహ నిర్మాణ సహకార సంఘాలకు అప్పులు | 10.00 |
| 5. స్వల్పాదాయ వర్గాల గృహ నిర్మాణ పథకానికి అప్పులు | 25.85 |
| 6. చేనేత సెస్సు నిధినుండి ఆంధ్ర చేనేత పారిశ్రామిక సహకార సంఘాలకు స్వల్ప కాలిక ఋణాలు | 32.37 |
| 7. ఆంధ్రరాష్ట్ర కేంద్ర సహకార భూమి తనఖా బ్యాంకుకు అప్పులు | 82.00 |
| 8. జాతీయ విస్తరణ పథకాలు, సమాజ వికాస కార్యక్రమాల క్రింద అప్పులు | 57.36 |
| 9. ఇతర పద్దులు | 39.27 |
| మొత్తం | 484.96 |

## తెలంగాణా ప్రాంతం:

| | |
|---|---|
| 1. వ్యవసాయ తక్కావీ ఋణాలు | 168.47 |
| 2. పునరావాస, అభివృద్ధి కార్యక్రమాలకు తక్కావీ ఋణాలు | 12.21 |
| 3. పారిశ్రామిక ట్రస్ట్‌నిధి ద్వారా వర్తక, వాణిజ్య సంస్థలకు అప్పులు, అడ్వాన్సులు | 17.00 |
| 4. గృహ నిర్మాణం | 25.26 |
| 5. సమాజ వికాస కేంద్రాలు, జాతీయ విస్తరణ పథకాలక్రింద అప్పు | 19.98 |
| 6. చేనేత పారిశ్రామిక సహకార సంఘాలకు అడ్వాన్సులు | 21.74 |
| 7. చిన్నతరహా పరిశ్రమలకు అడ్వాన్సులు | 17.93 |
| 8. ఇతర పద్దులు | 23.88 |
| మొత్తం | 306.47 |
| ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలమొత్తం | 791.43 |

మూడు నిధులు

## రోడ్డు ఫండ్

పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో "స్టేట్‌రోడ్ ఫండ్" అనే నిధి ఒకటుండేది. మోటారు రవాణాకు కావలసిన రోడ్ల నిర్మాణానికి అయ్యే ఖర్చును భరించేందుకై ఇది ఏర్పాటు చేయబడింది. మోటారు వెహికిల్స్ టాక్స్ నుండి వసూళ్ల ఖర్చులు పోను వచ్చే నికరాదాయం ఈ ఫండ్‌కు జమకట్టబడేది. బడ్జెటు ఖర్చు విభాగంలో ఇది చూపబడేది. 1956 మార్చి మాసాంతానికి ఈ ఫండుకు రు. 88.72 లక్షల మిగులు ఉన్నది. ఇది బైట ఎక్కడా పెట్టుబడి పెట్టబడ లేదు, రాష్ట్ర పునర్నిర్మాణ చట్టంక్రింద పూర్వపు హైదరా

బాదు రాష్ట్రపు లావాదేవీల పూర్తి కేటాయింపు జరిగిన తర్వాత, ఈ నిధియొక్క భవిష్యత్తు నిర్ణయింప బడగలదు.

ఆంధ్రరాష్ట్ర సందర్భంలో మోటారు వెహికిల్స్ టెక్స్ వసూళ్ళు ఆదాయపు బడ్జెటులోనే ఉంచబడేవి. ఏ రోడ్ ఫండుకూ జమకట్టబడేవి కావు. రివిన్యూ తరుగు చాలా ఉండటం మూలంగానూ, ఈ ఆంధ్రలోని ఏర్పాటునే అనుసరిస్తూ, తెలంగాణాలోవచ్చే మోటారు వెహికిల్స్ టెక్సు వసూళ్ళను 1957-58 నుంచి ఆదాయపు బడ్జెటులోనే ఉంచాలని ఉద్దేశింప బడింది. స్టేట్ రోడ్ ఫండుకు ఇంకెట్టి జమలూ అవసరంలేదు కూడా. ఇక, క్రొత్తరోడ్ల నిర్మాణానికై కావలసిన ఖర్చుకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తగిన కేటాయింపు చేయబడింది.

## పంచదార చెరకు సెస్సు నిధి

పంచదార చెరకు సెస్సు ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లో విధింప బడుతోంది. ఆంధ్రలో మద్రాసు షుగర్ ఫ్యాక్టరీస్ కంట్రోల్ ఆక్టు 1949 క్రింద ఈ సెస్సు వసూలు చేయబడి యమ్, హెచ్. XXXII పరిశ్రమలు, సప్లయుల క్రింద జమకట్టబడేది. అంతకు సమానమైన మొత్తం సంవత్సరాంతాన డిపాజిటులు. అడ్వాన్సుల క్రింద షుగర్‌కేన్ సెస్సుఫండ్ పద్దుకు జమకట్టబడేది. పంచదార చెరకుకు సంబంధించిన అభివృద్ధి పరిశోధనలకు కావలసిన ఖర్చుకు ముందుగా బడ్జెటులో కేటాయింపు జరుగుతుంది. తర్వాత అది మినహాయింపు అంశంక్రింద ఫండు లెక్కకు మార్చబడుతుంది.

ఇక తెలంగాణా విషయం: హైద్రాబాదు షుగర్‌కేను సెస్సు ఆక్టు. 1953 క్రింద ఈసెస్సు విధింపబడుతున్నది. దీని ఉద్దేశ్యం పంచదార పరిశ్రమను అభివృద్ధి పరచేందుకై పంచదార చెరకు, తదితర మాగాణి పైరులను పెంచి, విక్రయ సౌకర్యాన్ని కలిగించి, ఆ సాగును పెంచి పెంపొందించడం. మామూలుగా వ్యవసాయాభివృద్ధికి తోడ్పడడం. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో షుగర్‌కేను సెస్సునిధి అనేదిలేదు. షుగర్‌కేను సెస్సునుంచి వచ్చే వసూళ్ళు ఆదాయపు బడ్జెటులో జమకట్టబడేవి.

మరి రివిన్యూ తరుగు చాలా ఉండడంవలన ఈ సెస్సు క్రింద ఉద్దేశించబడిన లక్ష్యాలు ప్రణాళికలోని స్కీముల మూలంగా నిర్వర్తింపబడుతవి. కాబట్టి ఆంధ్రలోని సెస్సు వసూళ్ళు కూడా ఫండుకు కాకుండా ఆదాయపు బడ్జెటుకే జమకట్టాలని సూచించ బడింది.

## కంటిన్‌జెన్సీ ఫండ్

రూ. 40 లక్షల మొత్తంలో ఆంధ్ర కంటిన్‌జెన్సీ ఫండు ఏర్పాటు చేయబడింది. ఆంధ్రప్రదేశ్ అవసరాలు అధికం అవటంవలన ఆంధ్రరాష్ట్రపు ప్రస్తుత కంటిన్‌జెన్సీ ఫండును రు. 40 లక్షలనుండి రు. 60 లక్షల వరకు హెచ్చించాలని ఉద్దేశించ బడింది.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

ఆంధ్రప్రదేశ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కేటాయింపు మొత్తం రు. 174.48 కోట్లు. ఇందులో ఆంధ్ర ప్రాంతాలకు చెందినది రు. 11.897 కోట్లు, తెలంగాణాభాగం రు. 55.50 కోట్లు. పంచవర్ష ప్రణాళిక కేటాయింపు మొత్తం రెండు ప్రాంతాల మధ్య యీ క్రింది విధంగా విభాగింపబడింది :

| | రు. కోట్లలో | | |
|---|---|---|---|
| | ఆంధ్ర | తెలంగాణా | మొత్తం |
| రివిన్యూ | 37.7 | 19.5 | 57.2 |
| పెట్టుబడి | 81.3 | 36.0 | 117.3 |
| మొత్తం | 119.0 | 55.5 | 174.5 |

ఈ రు. 174.5 కోట్లు మొత్తం వివిధ అభివృద్ధి కార్యక్రమాల పద్దులకుగాను యీ క్రింది విధంగా కేటాయించ బడింది :

| | రు. కోట్లలో | | |
|---|---|---|---|
| | ఆంధ్ర | తెలంగాణా | మొత్తం |
| 1. వ్యవసాయం, సమాజ వికాస కార్యక్రమాలు | 26 40 | 13.72 | 40.12 |
| 2. నీటి పారుదల, విద్యుచ్ఛక్తి పథకాలు | 54 10 | 22.47 | 76.57 |
| 3. పరిశ్రమలు | 9.51 | 3.85 | 13.36 |
| 4. రోడ్లు | 5.47 | 2.19 | 7.66 |
| 5. విద్య | 7.83 | 5.04 | 12.87 |
| 6. నీటి సప్లైతో సహా ఆరోగ్య పథకాలు | 7.84 | 3.72 | 11.56 |
| 7. గృహ నిర్మాణం | 1.90 | 3.26 | 5.16 |
| 8. సాంఘిక సంక్షేమం, కార్మిక వ్యవహారాలు | 4.48 | 1.05 | 5.53 |
| 9. యితర పద్దులు | 1.45 | 0.20 | 1.65 |
| మొత్తం | 118.98 | 55.50 | 174.48 |

1957-58 సంవత్సరానికి ప్రణాళిక పథకాల క్రింద కేటాయింపు రు. 34 15 కోట్లు యీ క్రింది విధంగా విభజింపబడింది :

| | రు. కోట్లలో |
|---|---|
| (ఎ) రివిన్యూ ఖాతా | 9 93 |
| (బి) పెట్టుబడి ఖాతా | 24.22 |

రివిన్యూ ఖాతా క్రింద గల రు. 9.93 కోట్లలో రు. 7.25 కోట్లు మొత్తం. 1956-57 లో ప్రారంభించబడి 1957-58 లో కూడా కొనసాగగల ద్వితీయపంచవర్షప్రణాళిక పథకాల క్రింద ఖర్చు చేయబడుతుంది. మిగిలిన రు. 2.68 కోట్లు పాప్టు 2 క్రొత్త పథకాల ఖర్చులకు కేటాయించ బడింది.

1957-58 సంవత్సరంలో రు. 34.15 కోట్లు ఖర్చు కాగల యీ కార్యక్రమాలకుగాను లభించే కేంద్రసహాయం రు. 24.50 కోట్లవరకు వుండవచ్చునని అంచనా. యిందులో నుంచి రు. 5.19 కోట్లు గ్రాంట్ల రూపంలోనూ, మిగిలిన రు. 19.31 కోట్లు ఋణాల రూపంలోనూ లభించగలవు.

## కమ్యూనిటీ ప్రాజెక్టులు

దేశమంతటా సామాజిక వికాస పథకాలు ప్రారంభింప బడిన ఏడాదికి 1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఇంకా అప్పటికి ఈ పథకాల ఉద్యమం బాగా వ్యాప్తిచెందలేదు. రాష్ట్రం ఏర్పడిన తర్వాతకూడా పరిస్థితులేమంత ప్రోత్సాహకరంగా లేవు. రాష్ట్రం శైశవదశలో ఉన్నది. అందువల్ల అనేకమైన ఇతర విషయాలు ముఖ్యమై పోయినవి. అందువల్లనే ఆంధ్రరాష్ట్రంలో ఈ పథకాలు చెప్పుకోతగ్గంతగా అభివృద్ధి చెందలేదు. కాని గత సంవత్సరంలో ఈ పథకాలకు సంబంధించిన ప్రతివ్యక్తి నడుమువంచి దీక్షతో పనిచేయడం మూలంగా, అంతకు మునుపున్న మందకొడితనం పోయింది, చైతన్యం హెచ్చింది. దేశంలోని మిగతా రాష్ట్రాలకు తీసిపోకుండా ఆంధ్రరాష్ట్రం ముందంజ వేసింది. 1956 ఆగస్టు మాసాంతంలో అప్పటి సామాజిక వికాస పథకాల నిర్వహణాధికారిగా ఉన్న ఇప్పటి ఆ శాఖామంత్రి. రాష్ట్రానికివచ్చి జరుగుతున్న పని వేగానికి ఎంతో తృప్తి చెందారు. మిగతా రాష్ట్రాలకన్నకూడా ఆంధ్రరాష్ట్రం మెరుగ్గా ఉందని ప్రకటించారు. తర్వాత లోకసభలో సెప్టెంబరు 8వ తేదీన దేశంలోని సామాజిక వికాస పథకాల అభివృద్ధిని గురించి మాట్లాడుతూ ప్రధానమంత్రి ఆంధ్రరాష్ట్రాన్ని ఈ విధంగా మెచ్చుకున్నాడు. "ఇటీవల వరకూ ఆంధ్ర రాష్ట్రం ఏలాగైనా కొంచెం వెనకబడేవుంది. కాని త్వరలోనే ముందుకు తోసుకుంటూవచ్చి, ఇప్పుడు అగ్ర రాష్ట్రాలతో అందుకో గల్గింది." లోకసభ అంచనాల సంఘం కూడా సామాజిక అభివృద్ధి శాఖను గురించిన 45వ నివేదికలో ఆంధ్ర రాష్ట్రంలోని అభివృద్ధి ప్రశంసాపాత్ర మైనదని పేర్కొన్నది.

సామాజిక వికాస పథకాల కార్యక్రమాల గడువు ముగియడంతో, రాష్ట్రపు కార్యక్రమంలోని తొలిమెట్టు అక్టోబరు 1వ తేదీకి పూర్తి అయింది. కాకినాడ - పెద్దాపురం, కర్నూలు-కడప కాలవ, నిజాంసాగర్, సామాజిక వికాస పథకాలు, ములుగు సామాజిక అభివృద్ధి బ్లాకు వరుసగా 8, 4, 5, 1 తీవ్ర కార్యక్రమానంతర బ్లాకులుగా ఏర్పాటు చేయబడినవి. ఇచ్ఛాపురం, వాయల్పాడు సామాజిక అభివృద్ధి బ్లాకుల్లో కూడా 1957 ఏప్రిల్ 1వ తేదీకి కార్యక్రమాల గడువు ముగిసి, అప్పటినుంచి పైవిధంగా ఏర్పాట్లు చేయబడుతాయి.

ఈ ఏడాదిలో నాలుగు బహుళార్థ సాధక ప్రాజెక్టులు ప్రారంభింప బడినవి. ఆ ప్రాంతాలివి —విశాఖపట్టణం జిల్లాలోని హుకుంపేట, అరకు; ఆదిలాబాదు జిల్లాలోని ఉట్నూర్; వరంగల్ జిల్లాలోని నర్సంపేట. వీటిలో ప్రతి ఒక్క ప్రాజెక్టుకు కార్యక్రమపు నిర్ణీతకాలమైన అయిదేళ్లకు రూ. 27 లక్షలు కేటాయింప బడుతవి.

ఈనాడు 40 సామాజిక అభివృద్ధి బ్లాకులు. 63 జాతీయ విస్తరణ సేవాబ్లాకులు. 18 తీవ్ర కార్యక్రమానంతర బ్లాకులు. పనిచేస్తున్నవి. వీటిమొత్తం వైశాల్యం 32,38". 18చ. మైళ్లు. మొత్తం గ్రామాలు 9,229. మొత్తం జనాభా 97.77 లక్షల మంది. వీటికి అదనంగా 1957 ఏప్రిల్ 1 వ తేదీన 25 జాతీయ విస్తరణసేవ బ్లాకులు ప్రారభింప బడుతవి. ఇప్పుడున్న బ్లాకుల్లో 21 బ్లాకులు 1957 అక్టోబరు 2వ తేదీ నుండి సామాజిక అభివృద్ధి బ్లాకులుగా మార్చబడుతవి. అంతేకాదు. 1957 అక్టోబరులో ఇంకా 32 క్రొత్త బ్లాకులను ఏర్పాటు చేయాలనికూడా అనుకుంటున్నాం. ఈ ఉద్యమం రాష్ట్రం అంతటా వ్యాపించినప్పుడు. మొత్తం 463 బ్లాకు లేర్పడుతవి. వీటిలో 160 తెలంగాణావి, 303 ఆంధ్ర ప్రాంతపువి.

గ్రామీణ ప్రజానీకాన్ని మానసికమైన జడత్వంలోంచి మేల్కొల్పి స్వయంకృషి, స్వయం సహాయ సంపత్తుల ద్వారా ప్రజలు స్వాతంత్ర్యపు సాఫల్యాన్ని ఇంకా యెక్కువ ఆర్థిక భద్రతను, సాంఘిక న్యాయాన్ని సాధించుకునేట్టు తోడ్పడటం, సామాజిక అభివృద్ధి కార్యక్రమపు ముఖ్య

లక్ష్యం. దేశం అంతటా ఈ కార్యక్రమం విజయవంతంగా కొనసాగుతోంది. మన రాష్ట్రం గురించి ప్రత్యేకంగా ఈ సందర్భంలో పేర్కొనవచ్చును. ప్రభుత్వం రూ. 280 లక్షలు ఖర్చుపెట్టితే. ప్రజలు తమ కాయకష్టంద్వారా ధన, వస్తు విరాళాలద్వారా రూ. 240 లక్షలు తమంతట తాము ఇచ్చారు. ప్రజల సహాయ సంపత్తులు ఎంతో ప్రోత్సాహ కరంగా ఉన్నప్పటికీ కూడా, ప్రారంభ విజయం మూలంగా కొంత నిర్లిప్తత ఏర్పడే ప్రమాదమున్నదని ఆ ప్రమాదాన్ని తప్పుకోవాలని ప్రజలు, ప్రభుత్వ సిబ్బంది గ్రహించడం అవసరం. నిజానికి అన్ని మహోద్యమాలు ప్రజల ఉద్య మాలే. ఈ శాంతియుతమైన, విప్లవాత్మకమైన ఉద్యమం ప్రజల ఉద్యమంగా కొనసాగుతూ, వారి శక్తి సంపదలచేత పోషింపబడి పెంపొందింపబడుతున్నంత వరకూ, దేశంలో ఈ ఉద్యమం ఇంకెక్కువ దృఢంగా వేర్లు తన్నుకొని, శతసహస్ర శాఖోపశాఖలలో కల్పవృక్షంగా పెరిగి పెద్ద దయి తీరుతుంది.

## స్థానిక అభివృద్ధి కార్యక్రమాలు

పూర్వ ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో గడచిన సంవత్సరంలో స్థానిక అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో అనేక సత్ఫలి తాలు సాధించబడినవి. ఈ కార్యక్రమాల మొత్తం ఖర్చు రు. 120 లక్షలు. వీటికిగాను కేటాయించబడిన రు. 66.00 లక్షల గ్రాంటులో రు. 58.10 లక్షలు ఖర్చుచేయబడింది. ఈ సంవత్సరంకూడా కార్యక్రమాలు సంతృప్తి కరంగానే కొనసాగుతున్నవి. కేంద్ర ప్రభుత్వం యిచ్చిన గ్రాంటు మొత్తం రు. 28.35 లక్షలకు గాను, 1957 జనవరి చివరి కాలానికి రు. 20.00 లక్షలు యీ కార్యక్రమాల నిర్వహణ క్రింద ఖర్చు చేయబడినవి. గ్రాంటులో మిగిలిన భాగం త్వరలోనే ఖర్చుపెట్ట బడుతుందని ఆశించబడు తున్నది. తెలంగాణా ప్రాంతంలో యీ కార్యక్రమాల నిర్వహణ కొంతవరకు కుంటుపడిందనే చెప్పవచ్చు. దీనికి ప్రధాన మైన కారణాలు రాష్ట్ర పునర్నిర్మాణ కార్యక్రమ వ్యవ హారాలు, ప్రత్యేకంగా సాంకేతిక సిబ్బంది కొరత. యీ సంవత్సరానికి ఉమ్మడి హైదరాబాదు రాష్ట్రానికి కేటా యించబడిన గ్రాంటు మొత్తం రు. 25.80 లక్షలలో, తెలం గాణావంతు రు. 12.53 లక్షలు ఉంటుంది. ఈ మొత్తంలో 1957 జనవరి చివరకు రు. 1.83 లక్షలు మాత్రమే ఖర్చు జరిగింది. ఇప్పుడు యీ కార్యక్రమాల నిమిత్తం తగినంత సాంకేతిక సిబ్బంది మంజూరు చేయబడుటయేకాక యీ ఆర్థిక సంవత్సరాంతంలోగా గ్రాంటు మొత్తం విని యోగ పరచగలిగే విధంగా కార్యక్రమాలను తీవ్రంగా. క్రమబద్ధమైన మార్గంలో నిర్వహించే ఏర్పాట్లు చేయవల సిందని కలెక్టర్లకు ఆదేశాలు పంపడంకూడా జరిగింది. అప్పుడే ప్రజలు యీ కార్యక్రమాలవల్ల కలిగే ప్రయోజ నాలను గ్రహించి వీటికి సుముఖులై ధన, వస్తు, శ్రమదాన రూపమైన సహాయ సహకార సంపదతో ముందుకు వస్తు న్నారు. స్థానిక అభివృద్ధి కార్యక్రమాలకు అన్ని జిల్లాల లోనూ ఎక్కువగా డిమాండువున్న కారణంచేత, యీఆర్థిక సంవత్సరానికి యింకా అదనంగా కొంత మొత్తం గ్రాంటు యివ్వవలసిందని మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించింది.

## ఆర్థిక అవకాశాల పరిశీలన

ఇంతవరకూ చెప్పినట్లు 1956 - 57 సంవత్సరానికి రు. 7.50 కోట్ల తరుగు ఏర్పడుతున్నది. ఈ లోటు క్రింద పేర్కొనబడిన ప్రధాన కారణాలవల్ల సంభవిస్తున్నది.

| | రు. కోట్లలో |
|---|---|
| 1. 1956-57 ఆంధ్ర రాష్ట్ర బడ్జెట్‌లో అంచనా వేయబడిన ముగింపు లోటు మొత్తం | —2.67 |
| 2. చిల్లర అభివృద్ధి పథకాలకుగాను ఆంధ్ర బడ్జెట్‌లో లెక్కలోకి తీసుకోబడిన కేంద్ర సహాయంలో కలిగిన తరుగు | —2.69 |
| 3. విద్యుచ్ఛక్తి పథకాలమీద జరిగిన అధిక వ్యయం. | —2.85 |
| 4. రివిన్యూఖాతాలోటులో తగ్గింపు .... | +1 52 |
| 5. ఇతర పెట్టుబడి లావాదేవీల వల్ల కలిగే నికరఫలితం .... .... .... | —0.81 |
| మొత్తం | —7.50 |

రాష్ట్ర ప్రభుత్వం తన ఆర్థిక పరిస్థితిని చక్కబరచుకొను టకై గడచిన రెండు సంవత్సరాల కాలంలో క్రొత్తపన్నులు విధించడం ద్వారా శాయశక్తులా ప్రయత్నించింది. క్రొత్త పన్నులవల్ల రివిన్యూ ఖాతాలోటు రు. 6.21 కోట్లనుండి 1956-57లో రు. 4.60 కోట్లవరకు తగ్గించబడింది. రివిన్యూ లోటులో రు. 1.52 కోట్లు తగ్గింపు సాధించడం సామాన్య మైన విషయంకాదు. రివిన్యూలోటు యింకా తగ్గించు కోవా లంటే, అభివృద్ధి పథకాలలో కొన్నిటిని మానుకుంటేనే గాని సాధ్యమయ్యే పనికాదు.

1957-58వ సంవత్సరపు అంచెనాల ప్రకారం ఆదాయం లోను పెట్టుబడి ఖాతాలోనూ కూడా లోటు వుండవచ్చును. క్రొత్తపన్నులు వేసి కొంత లోటు భర్తీ చేయవచ్చును. కాని ఇటువంటి ప్రయత్నం పూర్తి సంవత్సరపు బడ్జెటు శాసనసభలో ప్రవేశ పెట్టేదాకా ఆగవలసి వస్తుంది. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లో అమ్మకాల పన్నుచట్టాలు సమన్వయం చేయాలని ఆలోచన జరుగుతున్నది. ఇది జరిగినప్పుడు అదనంగా కొంత ఆదాయం రావచ్చును. ఈలోపుగా రాష్ట్ర ఆర్థిక పరిస్థితి పదే పదే సమీక్షించి తాత్కాలిక అనుగుణ్యమైన చర్యలు తీసుకొని ఆర్థిక పరిస్థితి క్షీణించకుండా చూసేందుకు ప్రయత్నాలు జరుగుతాయి.

## ప్రజలవద్ద ఋణం

1956 అక్టోబరులో యితర రాష్ట్రాలతోపాటు సేకరించిన 1968 సం. 4% ఆంధ్రరాష్ట్ర ఋణంవల్ల రు. 6.58 కోట్లు లభించింది. అదే సమయంలో పూర్వ హైద్రాబాదు రాష్ట్రంలో సేకరించబడిన ఋణం రు. 2.13 కోట్లలో తెలంగాణావంతు షుమారు రు. 1.30 కోట్లు. అందువల్ల మామూలుగా 1957-58 బడ్జెటు అంచనాలలో ప్రజలనుండి సేకరించగల ఋణం రు. 7.5 కోట్లు అని లెక్క వేసుకోవలసి వుంటుంది. కాని ఋటీవల రాష్ట్రాల ఋణాల ధరలలో కలుగుతున్న మార్పుల దృష్ట్యా, 1957-58 లో మార్కెటులో సేకరించే ఋణం రు. 5 కోట్లవరకే పరిమితం చేయాలని సంకల్పించబడింది.

## ఆర్థిక కమీషన్

ఆదాయపు పన్ను, యూనియన్ ఎక్సైజు సుంకాలు, ఎస్టేటు సుంకాలు మొదలైన కేంద్ర ప్రభుత్వ పన్నులలో రాష్ట్రాల వాటాలు నిర్ణయించుటకై అనుసరించవలసిన సూత్రాలు, రాజ్యాంగచట్టంలోని 275 సూత్రం క్రింద కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుతాలకు యివ్వవలసిన సహాయక గ్రాంటులు, రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్రం యిచ్చే ఋణాల నిబంధనలు మొదలైన వివరాలను పరిశీలించి సిఫార్సులు చేయుటకై 1956 జూన్‌లో రాష్ట్రపతిచేత నియమించబడిన ఆర్థిక కమిషన్‌వారు, యీ విషయాలపై రాష్ట్ర ప్రభుత్వ అభిప్రాయాలను సేకరించారు. 1957 ఫిబ్రవరిలో కమిషన్ వారు హైద్రాబాదుకు విచ్చేశారుకూడా. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు పరిచే సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక అవసరాలకూ, దానికిగల అవకాశాలకూ చాలా తేడా ఉన్నదనే విషయం ప్రభుత్వం తరపున కమిషన్ వారికి నివేదించబడింది. రాష్ట్రంలో పన్నులుకూడా చాలా హెచ్చుస్థాయిలోనే విధించబడుతున్న కారణంగా, యింకా అదనపు పన్నుల ద్వారా ఆదాయం సమకూర్చుకోగల అవకాశం అంతగా కనిపించడంలేదు. అందువల్ల తమ ఆదాయపు పన్నులు, ఎక్సైజు సుంకాలలోనుండి కేంద్ర ప్రభుత్వానికి యిప్పుడున్న ఏర్పాట్ల ప్రకారం యివ్వవలసిన దానికంటే ఎక్కువ భాగం యిచ్చే అవకాశం కలిగించవలసి ఉంటుందని కూడా స్పష్టపరచడం జరిగింది. అంతేకాక హరిజనులు, వెనుకబడిన వర్గాలు, వెనుకబడిన జాతుల ప్రజల సౌకర్యాల నిమిత్తం, పెరుగుతున్న అవసరాల దృష్ట్యా, కేంద్ర ప్రభుత్వ సుంకాలలో మామూలు వాటా మాత్రమే కాక ఆంధ్రప్రదేశ్‌కు అదనంగా గ్రాంట్ల రూపంలో కేంద్ర సహాయం అవసరమని కూడా వివరించబడింది. కేంద్ర ప్రభుత్వ ఋణాలను తిరిగి చెల్లించే సందర్భంలో ప్రస్తుతం అమల్లోగల నిబంధనలు, ముఖ్యంగా నీటి పారుదల, విద్యుచ్ఛక్తి పథకాలకు యివ్వబడిన ఋణాల విషయంలో రాష్ట్ర ప్రభుత్వాలకు చాలా యిబ్బందిగా పరిణమించినవనీ, కనీసం వడ్డీ చెల్లించుకో గలగడానికైనా ఆయాపథకాల మీద సరిపడే ఆదాయం రావడానికీ, అసలు అవి పూర్తిచేయబడి, అభివృద్ధి అయేవరకు పట్టగల కాలాన్ని నిబంధనలు లెక్కలోనికి తీసుకోవడంలేదని కూడా కమీషన్ వారికి నివేదించబడింది.

ఈ విషయాలనన్నిటినీ కమీషన్‌వారు సిఫార్సులు చేసేముందు క్షుణ్ణంగా పరిశీలిస్తారనీ, రాజ్యాంగ చట్టం 275 సూత్రంక్రింద కేంద్రప్రభుత్వం అదనంగా గ్రాంట్లు మంజూరు చేయడంవల్ల కేంద్ర పన్నులలో అధిక వాటాలు యివ్వడం, ఋణ నిబంధనలను సడలించడం మొదలైన వాటివల్ల రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక అవసరాలు తీరుతాయనీ ఆశిద్దాం.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్

ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలలో ఆర్థిక కార్పొరేషన్లను గురించి 1956 సం॥పు రాష్ట్రాలపునర్వ్యవస్థీకరణ చట్టంలో 102 సెక్షన్‌లో యీ క్రింది నిబంధనలు పేర్కొనబడినవి.

(1) నిర్ణీత తేదీనుండి ఆంధ్ర హైదరాబాదు రాష్ట్రాలలో రెండు ఆర్థిక కార్పొరేషన్లు సంలీనం కావాలి.

(2) నిర్ణీత తేదీకి ముందుగానే కేంద్ర ప్రభుత్వం, ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించి, రెండు కార్పొరేషన్లు సంలీనమైన ఫలితంగా ఏర్పడే ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక కార్పొరేషను డైరెక్టర్ల బోర్డును నియమిస్తూ, దానికి సంబంధించిన యితర విషయాలను పేర్కొంటూ వుత్తరువులు జారీచేయాలి.

(3) కేంద్ర ప్రభుత్వ ఉత్తరువుద్వారా నిర్ణయించబడిన మేరకు హైదరాబాదు రాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్ బాబతు చెల్లించబడిన షేరు ధనం విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, మైసూర్, బొంబాయి రాష్ట్రాలకు చెందవలసిన మొత్తాలను చెల్లించాలి.

ఈ విధంగా ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాల ఆర్థిక కార్పొరేషను యొక్క ప్రస్తుత ఆర్థిక స్తోమత రు. 150 లక్షలు. యిందులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి రు. 70 లక్షల విలువగల షేర్లు వున్నవి.

కేంద్ర ప్రభుత్వం క్రొత్త డైరెక్టర్ల బోర్డును నియమించింది. ఇందులో రాష్ట్రప్రభుత్వ ప్రతినిధులు ముగ్గురు, రిజర్వుబ్యాంకు ప్రతినిధి ఒకరు, భారత పారిశ్రామిక ఆర్థిక కార్పొరేషన్ ప్రతినిధి ఒకరు ఉన్నారు. అధ్యక్షుడు, మేనేజింగ్ డైరెక్టర్ల నియామకానికి సంబంధించిన అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి యివ్వబడింది. ఇందువల్ల రాష్ట్ర ప్రభుత్వానికి కార్పొరేషన్ కార్యక్రమాలమీద అజమాయిషీ అవకాశం ఏర్పడి, ఆయాసమయాలలో ప్రభుత్వం సిద్ధపరచే విధానాలకు అనుగుణంగా దాని కార్యక్రమాలు కొనసాగింప చేయడానికి వీలు కలుగుతుంది.

పరిశ్రమలకు కొద్ది ఋణాలు, మధ్యతరహా ఋణాలు మంజూరుచేసి ప్రోత్సహించడానికై రాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్లు ఉద్దేశించబడినవి. ఏ ఒక్క సంస్థకుగానీ, కార్పొరేషన్ యొక్క చెల్లించబడిన మూలధనంలో 10 శాతానికి మించి అడ్వాన్సు మంజూరు చేయడానికి వీలులేదు. రెండు కార్పొరేషన్ల సంలీనానికి పూర్వం ఆంధ్రరాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్ ఒక సంస్థకు రు. 5 లక్షల వరకూ అడ్వాన్సు మంజూరు చేయగలిగి ఉండేది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ కార్పొరేషన్ చట్టంలో నిబంధించబడిన గరిష్ఠ మొత్తం ప్రకారం రు. 10 లక్షల వరకూ అడ్వాన్సు మంజూరు చేయగలుగుతుంది.

వడ్డీరేటు నూటికి సంవత్సరానికి రు 6½. ఇందులో మార్పేమీ జరుగలేదు. వడ్డీ మొత్తాలు, వాయిదా మొత్తాలు సకాలంలో చెల్లించినందుకు నూటికి అర్థరూపాయి వరకు రిబేటు యివ్వబడుతుంది. అందువల్ల నికరమైన వడ్డీ రేటు నూటికి రు. 6 లు మాత్రమే. ఈ రేటు ఎక్కువగా వుందనే భావన కొందరిలో వుంది. కాని కార్పొరేషను పన్నులు వగైరా చెల్లింపులు పోను, కనీసం 3½ శాతం లాభాలను గ్యారెంటీగా పంచవలసివుంది. అంతేకాక ప్రస్తుతం మార్కెటులో డబ్బుకుగల గిరాకీనిబట్టికూడ యీవడ్డీ రేటు ఎక్కువని అనటానికి అవకాశంలేదు.

1957 ఫిబ్రవరి వరకూ 48 కంపెనీలకు రు. 81.46 లక్షలవరకూ కార్పొరేషన్ ఋణాలు మంజూరు చేయబడినవి. వీటిలో 10 నూనెమిల్లులు, 6 బియ్యం, నూనె, పిండి మరలు, 10 కొద్ది యింజినీరింగ్ సంస్థలు, 6 పొగాకు, సిగరేటు వ్యాక్టరీలు, 6 నూలు మిల్లులు, 11 యితర రకాల సంస్థలు ఉన్నవి.

1957 మార్చి 31వ తేదీతో అంతమయ్యే సంవత్సరంలో కార్పొరేషన్‌కు రు. 4.4 లక్షల నికర లాభం లభిస్తుందని అంచనా. ఇందులోనుండి చట్టరీత్యా ఏర్పరచ వలసిన రిజర్వునిధి, ఆదాయపు పన్ను, కార్పొరేషన్ పన్నులు వగైరా ఖర్చులుపోను మిగిలే మొత్తం గ్యారంటీ చేయబడిన కనీస డివిడెండ్ చెల్లించడానికి సరిపోయేటట్లులేదు. ఈ లోటును రాష్ట్రప్రభుత్వం భర్తీ చేయవలసి వుంటుంది.

వాటాదార్లకు చెల్లించ వలసిన గ్యారంటీ డివిడెండ్ చెల్లించే విషయాలలో ఏర్పడినలోటు భర్తీ చేసుకొనుటకై రాష్ట్రాల ఆర్థిక కార్పొరేషన్లు అన్నీ యింకా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలమీద ఆధారపడే వున్నవి. ఎందుకనగా ప్రారంభ సంవత్సరాలలో కార్పొరేషన్లు తమకుగల ఆర్థిక అవకాశాలలో కొంత భాగం మాత్రమే వినియోగించు కొనడానికి అవకాశం ఉండగా, గ్యారంటీ డివిడెండ్లు మాత్రం చెల్లించవలసి వస్తున్నది. ఈపరిస్థితే కార్పొరేషన్ల లోటుకు కారణభూత మవుతున్నది.

పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం అందించే బోర్డువారు తాము మంజూరుచేసిన అప్పులను చెల్లించే బాధ్యత ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక కార్పొరేషన్‌కు అప్పగించారు. ఇంతవరకు ఈ రూపంలో రు. 1.5 లక్షలు చెల్లించబడింది.

## ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలమధ్య ఉమ్మడి ఖర్చుల పంపిణీ

తెలంగాణ ప్రాంతానికి ప్రత్యేక రక్షణలు కల్పించిన సందర్భంలో ఆంధ్ర, తెలంగాణా ప్రతినిధుల మధ్య జరిగిన ఒప్పందంలో, యితర విషయాలతోపాటు, సాధారణ

పరిపాలన ఖర్చులు ఆయా ప్రాంతాల నిష్పత్తిలో ఉభయులు భరించు కోవాలనీ, తెలంగాణా ప్రాంతంనుండి లభించే ఆదాయంలో మిగిలిన భాగం తెలంగాణా ప్రాంతపు అభివృద్ధికే వినియోగించ బడటానికై కేటాయించాలనే నిబంధన అంగీకరించ బడింది. 1957-58 బడ్జెట్ అంచనాలు తయారు చేయుటలోనూ ముఖ్యంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద నిధులు కేటాయించుటలోనూ యీసూత్రము పాటించబడింది.

# 1957-58 ఆంధ్ర ప్రదేశ్ బడ్జెటు విశేషాలు

(రూ. లు లక్షలలో)

| పద్దులు | అక్కౌంట్లు 1955-56 | బడ్జెటు అంచెనా 1956-57 | సవరించబడిన అంచనా 1956-57 | బడ్జెటు అంచెనా 1957-58 |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| రెవిన్యూ ఆదాయం .... | 4,042.57 | 4,092.52 | 4,725.33 | 5,023.50 |
| రెవిన్యూ ఖర్చు ... | 4,741.87 | 4,713.45 | 5,193.73 | 5,552.99 |
| రెవిన్యూలోటు .... | (—)699.30 | (—)620.93 | (—)468.40 | (—)529.49 |
| పెట్టుబడి ఖర్చు .... | 1,984.61 | 2,438.57 | 2,416.45 | 2,362.60 |

## 1957—58 సం. లో రెండవ పంచవర్షప్రణాళికలో చేర్చబడిన పథకములకు కేటాయింపులు

(రూ. లు. కోట్లలో)

| | రెవిన్యూ | పెట్టుబడి | మొత్తం |
|---|---|---|---|
| ఆంధ్ర ... | 6.74 | 16.65 | 23.39 |
| తెలంగాణా .... | 3.19 | 7.57 | 10.76 |
| మొత్తం .... | 9.93 | 24.22 | 34.15 |

## 1957-58 సం. రానికి రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద ఖర్చులు

(రూ. లు లక్షలలో)

| పద్దులు | ఆంధ్ర | తెలంగాణ | మొత్తం |
|---|---|---|---|
| 1. వ్యవసాయోత్పత్తి .... .... | 82.09 | 35.19 | 117.28 |
| 2. మైనర్ ఇర్రిగేషన్ .... .... | 49.02 | 44.77 | 93.79 |
| 3. భూమి అభివృద్ధి .... .... | 5.00 | 5.00 | 10.00 |
| 4. పశుసంరక్షణ, పాలసరఫరా .... .... | 34.45 | 20.96 | 55.41 |
| 5. అడవులు .... .... | 10.64 | 6.73 | 17.37 |
| 6. భూసార పరిరక్షణ .... .... | 16.47 | 5.34 | 21.81 |
| 7. మత్స్య పరిశ్రమ ... .... | 10.33 | 8.06 | 18.39 |
| 8. సహకారం .... .... | 19.02 | 15.62 | 34.64 |
| 9. గిడ్డంగులు, క్రయవిక్రయ సౌకర్యాలు .... .... | 36.55 | 4.55 | 41.10 |
| 10. జాతీయవిస్తరణ కమ్యూనిటీ ప్రాజెక్టులు .... .... | 193.00 | 96.36 | 289.36 |
| 11. శిక్షణ కేంద్రాలు .... .... | 9.89 | 6.30 | 16.19 |
| 12. నాగార్జునసాగర్ ప్రాజెక్టు .... .... | 350.00 | 200.00 | 550.00 |
| 13. భారీ, మధ్యరకం ఇరిగేషన్ ప్రాజెక్టులు .... .... | 266.02 | 75.05 | 341.07 |
| 14. విద్యుచ్ఛక్తి .... .... | 513.27 | 173.05 | 686.32 |
| 15. పరిశ్రమలు .... .... | 177.86 | 73.01 | 250.87 |
| 16. రోడ్లు .... .... | 79.21 | 39.62 | 118.83 |
| 17. విద్య .... .... | 119.36 | 94.79 | 214.15 |
| 18. ఆరోగ్యం .... .... | 152.85 | 80.69 | 233.54 |
| 19. కార్మిక సంక్షేమం .... .... | 4.85 | 6.53 | 11.38 |
| 20. గృహవసతి ... .... | 38.89 | 69.37 | 108.26 |
| 21. వెనుకబడ్డ తరగతుల సంక్షేమం .... .... | 57.98 | 9.42 | 67.40 |
| 22. సంఘసంక్షేమం .... .... | 10.46 | 1.85 | 12.31 |
| 23. ఇతరములు .... .... | 101.50 | 3.78 | 105.28 |
| మొత్తం .... | 2,338.71 | 1,076.04 | 3,414.75 (అ) |

*గమనిక :* (అ) అనునది (అ) లో చేరియున్నది.

## 1957-58 సం. రానికి కేటాయించబడిన క్రొత్తఖర్చుల వివరాలు

(రూ. లు. లక్షలలో)

| పద్దులు | | | మొత్తం |
|---|---|---|---|
| 1. సాధారణ పరిపాలన | .... | .... | 2.67 |
| 2. విద్య | .... | .... | 72.08 |
| 3. వైద్యం, ఆరోగ్యం | .... | .... | 25.87 |
| 4. వ్యవసాయం | .... | .... | 37.21 |
| 5. పశువైద్యం | .... | .... | 13.38 |
| 6. సహకారం | .... | .... | 10.17 |
| 7. అడవులు | .... | .... | 0.23 |
| 8. పరిశ్రమలు | .... | .... | 47.80 |
| 9. సంఘసంక్షేమం, కార్మికసంక్షేమం | .... | .... | 47.35 |
| 10. సివిల్ పనులు | .... | .... | 10.77 |
| 11 స్టాటిస్టిక్సు, ప్రింటింగు | .... | .... | 0.17 |
| | మొత్తం | .... | 267.70 |
| | | | (అ) |

## 1957-58 సం. రానికి పెట్టుబడి ఖర్చులు (రెవిన్యూ అక్కౌంటులో లేనివి)

| పద్దులు | | | | మొత్తం |
|---|---|---|---|---|
| 65. | భూస్వాములకు మున్నగువారికి నష్టపరిహారం చెల్లింపు | | .... | 20.70 |
| 68. | ఇర్రిగేషను మున్నగు పనుల నిర్మాణం | .... | .... | 403.13 |
| 70. | ప్రజారోగ్యాభివృద్ధి | .... | .... | 93.57 |
| 71. | వ్యవసాయాభివృద్ధి పథకములు | .... | .... | (—)6.19 |
| 72. | పారిశ్రామికాభివృద్ధి | .... | .... | 38.46 |
| 80 (అ) | బహుళార్థసాధక నదీలోయ పథకములు | .... | .... | 683.75 |
| 81. | సివిల్ పనులు | .... | .... | 405.12 |
| 81. (అ) | విద్యుచ్ఛక్తి సరఫరా పథకములు | .... | .... | 624.82 |
| 82. | రెవిన్యూ పద్దులోలేని ఇతర ప్రభుత్వపు పన్నులు | .... | .... | 78.11 |
| 82. (అ) | రోడ్డు రవాణా పథకములు | .... | .... | 6.49 |
| 83. | పింఛనుల చెల్లింపు | .... | ... | 3.67 |
| 85. (అ) | ప్రభుత్వ వాణిజ్య పథకములు | .... | .... | 10.97 |
| | | మొత్తం | .... | 2,362.60 |

# ఆంధ్రప్రదేశ్‌లో ఆహారధాన్యాల ఉత్పత్తి

## సాలుకు 57 లక్షల టన్నుల నుంచి 73 లక్షల టన్నులకు పెరుగుదల

## 1960-61 సంవత్సరాంతానికి లక్ష్య పరిపూర్తికై తీసుకోబడుతున్న చర్యలు

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం దాదాపు 57లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తిఅవుతున్నవని అంచెనా వేయబడింది. 1960-61 సంవత్సరం ముగిసేనాటికల్లా ఈ ఉత్పత్తి 73 లక్షల టన్నులు కాగలదని ఆశింపబడుతున్నది. అంటే ఇప్పటి ఉత్పత్తిపై 28 శాతం పెరుగుదల అన్నమాట. ఆహారోత్పత్తి విషయంలో పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించడానికి ఏ యే చర్యలు గైకొనబడు తున్నవో ఈ వ్యాసంలో విశదీకరింపబడింది.

1955-56 సంవత్సరం ముగిసేనాటికి ఆంధ్రప్రదేశ్ ఆహారధాన్యాల మొత్తం ఉత్పత్తి 56.92 లక్షల టన్నులని అంచెనా వేయబడింది. 1960-61 సంవత్సరాంతానికి ఈ ఉత్పత్తిని 73.02 లక్షల టన్నులకు పెంచడానికి ప్రయత్నము లారంభింపబడినవి. అంటే ప్రస్తుత ఉత్పత్తిపై 28 శాతం పెరుగుదల అన్నమాట. ఈ అదనపు ఉత్పత్తి లక్ష్యాన్ని సాధించడానికై దిగువ పథకములు అమలుజరుప బడుతున్నవి.

1. భారీ నీటి వనరు ప్రాజెక్టులు
2. స్వల్ప నీటి వనరులు
3. ఎరువులు, రసాయనిక ఎరువులు
4. మేలురకం విత్తనాలు
5. సేద్యంకాని భూములను సాగుకు తెచ్చి అభివృద్ధి పరచుట
6. వ్యవసాయ పద్ధతుల మార్పు
7. సామాజికాభివృద్ధికేంద్రాలు జాతీయ వికాసకేంద్రాల క్రింద అభివృద్ధి కార్యక్రమాలు
8. గ్రామీణ పరపతికీ, మార్కెటింగుకూ ఇతోధిక సౌకర్యాలు.

1. *భారీ నీటివనరులు :* ఈకార్యక్రమంలో పెద్ద, మధ్య రకం నీటివనరు ప్రాజెక్టులు చేరివున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాజెక్టుల క్రింద 6.54 లక్షల ఎకరాలను సాగుకు తేవాలని తలపెట్టబడింది. దీనివల్ల అదనంగా 2.66 లక్షల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తి కాగలవు.

2. *స్వల్ప నీటివనరులు :* పెద్దరకం ప్రాజెక్టులకంటె వీటికి తక్కువ ఖర్చు అవుతుంది. అయితే ఫలితాలు సత్వరంగా కలుగుతవి. పైగా వీటి నిర్మాణాన్ని స్థానికంగా లభించేఆధారాలతోనే పూర్తి చేయవచ్చు. ఈ కార్యక్రమంలో పబ్లికువర్క్సు శాఖయొక్క చిన్న నీటివనరుల పథకాలు, లిఫ్టు ఇర్రిగేషనుకు వ్యవసాయశాఖ ఇచ్చే అప్పుల పథకాలు చేరివున్నవి. ఈ అప్పులు ఆయిల్ ఇంజనులు, ఎలెక్ట్రిక్ మోటార్లు, రాహతులు కొనుక్కోవడానికీ, ఫిల్టర్‌పాయింట్ గొట్టపుబావులు త్రవ్వుకోవడానికీ ఇవ్వబడుతవి. రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి మొత్తం రాష్ట్రంలో 3.82 లక్షల ఎకరాల భూమిని స్వల్ప నీటివనరుల క్రిందికి తేవడానికి తలపెట్టబడింది. దీనివల్ల అదనంగా 1.65 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తికాగలదని అంచెనా వేయబడింది.

ఆయిల్ ఇంజనులకు, ఎలెక్ట్రిక్ మోటార్లకు, రాహతులకు, ఫిల్టర్‌పాయింటు గొట్టపుబావులకు ఇవ్వబడేఅప్పులను వ్యవసాయశాఖ ఇస్తుంది. ఈ అప్పులను 5 మొదలు 7 సరిసమాన వాయిదాలలో చెల్లించవలసి వుంటుంది. వ్యవసాయ శాఖవారే తిరిగి అప్పులను రాబట్టుకుంటారు.

3. *ఎరువులు, రసాయనిక ఎరువులు :* నీటివల్ల సాగు అయ్యే భూములలో రసాయనిక ఎరువులు వేసినట్లయితే పంట బాగాపండుతుందన్నవిషయం అందరూ అంగీకరించినదే కనుక భారీ నీటివనరులు, స్వల్ప నీటివనరుల క్రింద సాగుఅయ్యే భూమి విస్తీర్ణాన్ని పెంచినట్లయితే రసాయనిక ఎరువుల వినియోగం కూడా హెచ్చుతుంది. అంతేగాక,

నమ్మకంగా వర్షాలుపడే ప్రాంతాలు కొన్నివున్నవి. అట్టి ప్రాంతాలు రసాయనిక ఎరువులు ఉపయోగించడానికి బాగా తగినవి. ఈ రాష్ట్రంలో సల్ఫేట్ ఆఫ్ అమోనియా అనే ఎరువు ఎక్కువగా ఉపయోగింప బడుతున్నది. 1955-56 సంవత్సరాంతానికి ఆంధ్రప్రదేశ్‌లో 0.83 లక్షల టన్నులు ఉపయోగింపబడింది. రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసే నాటికి 1.97 లక్షల టన్నులను పంపిణీ చేయవలెనని తల పెట్టబడింది. ఉరియా, అమోనియం సల్ఫేట్, నైట్రేట మొదలగు కొత్తరకం ఎరువుల వాడకాన్ని విస్తృతంగా వ్యాప్తిలోకి తేవడానికి కూడా నిర్ణయించబడింది.

ఉత్పత్తిని పెంచడానికి నత్రజని ఎరువులేగాక ఫాస్ఫేటిక్ ఎరువులుకూడా అవసరం. మనభూములలో ఫాస్ఫేట్ల కొరత వున్నదని చెప్పడానికి అనేక ఆధారాలున్నవి. కనుక ఫాస్ఫేటిక్ ఎరువులను ఉపయోగించి ఈ కొరతను తీర్చితే తప్ప లేకపోతే కాలం గడచినకొద్దీ భూములు నష్టపడు తాయి. ప్రస్తుతం మనం 30,000 టన్నుల ఫాస్ఫేటిక్ ఎరువులను మాత్రమే ఉపయోగిస్తున్నాము. 1961 సంవత్సరాంతం వరకల్లా మనం 49,000 టన్నుల ఎరువులను ఉపయోగిస్తూ వుండటానికి తలపెట్టబడింది.

ఆంధ్ర ప్రాంతంలో విస్తృతంగా ఎరువులను వాడకంలోకి తెచ్చే పథకంక్రింద రసాయనిక ఎరువుల కొనుగోలుకై వ్యవసాయశాఖ అప్పులిస్తుంది. తెలంగాణా ప్రాంతంలో ఎరువుల కొనుగోలు కొరకై రెవిన్యూశాఖ తక్కావీ అప్పులు మంజూరుచేస్తుంది.

రసాయనిక ఎరువుల పంపిణీయే గాక, స్థానికంగా తయారు చేసుకోవడానికి వీలయ్యే ఎరువుల వాడకానికి, ముఖ్యంగా పచ్చిఆకు ఎరువును తయారు చేసికొని దానిని సక్రమంగా ఉపయోగించుకొనే విషయానికి అధిక ప్రాముఖ్య మివ్వబడు తున్నది. పచ్చిఆకు ఎరువు విషయంలో సాగునీరు లభించే అవకాశా లున్నచోట్ల ఆయేటి కాయేడు పెద్దలక్ష్యాలు నిర్ణయింప బడుతున్నవి. గ్రామీణ కంపోస్టు తయారీకూడా ప్రోత్సహింప బడుతున్నది. ఇది అప్పుడే వ్యవసాయ దారులలో బాగా వ్యాప్తిజెందింది. సామూజకాభివృద్ధి బ్లాకులలో, జాతీయ వికాస కేంద్రాలలో ఈ పద్ధతిని సాధ్యమైనంత హెచ్చుగా ప్రోత్సహించడానికి కృషి సల్పబడుతున్నది. పట్టణ కంపోస్టు ఎరువును తయారుచేసే పథకం స్థానిక పరిపాలనాశాఖ ఇనస్పెక్టర్ జనరల్ అజమాయిషీక్రింద సిద్ధపరచ బడుతున్నది. అన్ని మునిసిపాలిటీలలో, మేజర్ పంచాయితీలలో కంపోస్టు ఎరువును తయారు చేయించడానికి ప్రోత్సాహమివ్వ బడుచున్నది. ప్లానింగ్ కమీషన్‌వారి సూచన ననుసరించి స్థానికంగా లభ్యమయ్యే ఎరువులను, ముఖ్యంగా మలమూత్రాదులను నిలువ చేయటానికై ఒక ప్రయోగాత్మక పథకం తయారు చేయబడుతున్నది. ఈ పథకం రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అమలు జరుపబడుతుంది. ఫలితంగా 17.11 లక్షల ఎకరాలకు ఎరువు లభించి, అదనంగా 3.75 లక్షల టన్నుల ధాన్యం పండగలదు.



మొక్కల సంరక్షణచర్యలు - వుత్పత్తిని హెచ్చించే సాధనాలలో ఇవి ముఖ్యమైనవి

4. **మేలురకం విత్తనాలు** : మేలురకం విత్తనాలను పండించి పంపిణీ చేయడానికి ప్రస్తుతమున్నట్టి ఏర్పాట్లు తగువిధంగా లేవు. వ్యవసాయకోత్పత్తి పెరగవలెనంటే ఒక నిర్ణీత గడువులోపల కాయధాన్యం పైరులు, పప్పుధాన్యం పైరులు వేయబడే మొత్తం భూమిలో మేలురకం విత్తనాలు వేయవలెను. ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని వడ్లు, జొన్నలు, పప్పుధాన్యాల మేలురకం విత్తనాలను పండించి పంపిణీ చేయడానికై భారత ప్రభుత్వం ఒక నమూనా పథకం తయారు చేసింది. ఈ పథకం రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అమలు జరుప బడుతుంది. ఈ పథకంలో 25 ఎకరాల విత్తనాల క్షేత్రాన్ని నెలకొల్పవలెననీ, రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి రాష్ట్రంలోని ప్రతి డెవలప్‌మెంటు బ్లాకులో ఒక విత్తనాల గిడ్డంగిని నిర్మింపవలెననీ తలపెట్టబడింది. ప్రణాళికకాలం ముగిసే నాటికి అదనంగా మరి 19.92 లక్షల ఎకరాలలో మేలురకం వడ్లు, జొన్నలు, పప్పుధాన్యాల విత్తనాలను పండించ

వలెనని కూడా తలపెట్టబడింది. దీనివల్ల అదనంగా 1.47 లక్షల టన్నుల ధాన్యం పండుతుంది.

5. *క్రొత్తభూముల సాగు, వాటి అభివృద్ధి :* గత పది సంవత్సరాలలో రైతులు యంత్రాలద్వారా సేద్యంచేసే పద్ధతిని కొంతవరకు అవలంబించారని చెప్పవచ్చును. క్రొత్త భూములను దున్ని సేద్యం చేయడానికై వ్యవసాయశాఖ తన బుల్‌డోజర్లను, ట్రాక్టర్లను వ్యవసాయదార్లకు అద్దెకిస్తున్నది. వీటికిప్పుడు మంచి గిరాకీకూడా వున్నది. వ్యవసాయశాఖ అద్దె-కొనుగోలు పద్ధతిక్రింద కూడా వ్యవసాయదార్లకు ట్రాక్టర్లు లభింప జేస్తున్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేవరకల్లా రాష్ట్రంలో వ్యవసాయదారుల సొంత కమతాలలో, తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో మొత్తం 9.08 లక్షల ఎకరాల భూమిని కాయకష్టం ద్వారా వ్యవసాయశాఖ బుల్‌డోజర్లద్వారా బాగుపరచి సాగుకు తేవలెనని తలపెట్టబడింది. ప్రణాళిక కాలంలో వ్యవసాయ శాఖద్వారా 47 కొత్త బుల్‌డోజర్లను కొనవలెననీ, వ్యవసాయ దారులకు అద్దె-కొనుగోలు పద్ధతిక్రింద 375 ట్రాక్టర్లను సరఫరా చేయడానికి తలపెట్టబడింది.

## మెట్ట వ్యవసాయం

అనేక పెద్ద, మధ్యరకం, స్వల్ప నీటివసరు ప్రాజెక్టుల ద్వారా సాగునీటి సౌకర్యాలు కల్పించ బడుతున్నప్పటికీ రాష్ట్రంలో పెద్దపెద్ద భూఖండాలు ఇంకా చాలాకాలంవరకు మెట్ట సేద్యం క్రిందనే వుండవలసి వస్తున్నది. కనుక అట్టి ప్రాంతాలలో ఉత్పత్తిని అధికం చేయడానికై ప్రణాళిక కాలంలో మెట్ట వ్యవసాయ పద్ధతులను విస్తృతీకరించే కార్యక్రమానికి ప్రాముఖ్యమివ్వబడింది. భూములు కోతబడిపోయి భూసారం తగ్గిపోకుండా నిరోధించడానికీ, మెట్ట భూముల అవసరాలను తీర్చడానికీ భూసారపరిరక్షణచర్యలు గైకొనవలెనని తలపెట్టబడింది. అరకులోయ, మాచ్‌ఖండ్ ప్రాంతాలలోకూడా ఇట్టిచర్యలు గైకొనబడగలవు. మొత్తం 1.19 లక్షల ఎకరాలలో ఈచర్యలుగైకొనబడును. ఇందువల్ల అదనంగా 1.63 లక్షల టన్నుల ధాన్యం పండుతుంది.

6. *వ్యవసాయ పద్ధతుల అభివృద్ధి :* జపాను పద్ధతి వరి సేద్యం వల్ల అధికోత్పత్తి జరిగి మంచి ఫలితాలు కలిగినవి. ఈ పద్ధతిలో మేలురకం విత్తనాల వాడకం, రసాయనిక ఎరువుల వాడకంతోపాటు అభివృద్ధికరమైన వ్యవసాయ పద్ధతులు కూడా అవలంబింప బడుతాయి. జపానుపద్ధతి సేద్యంక్రింద వున్న భూమిని ఇంకా హెచ్చించవలెనని తలపెట్టబడింది. ప్రణాళిక కాలం ముగిసేనాటికి 22.79 లక్షల ఎకరాల భూమి జపానుపద్ధతి సేద్యంక్రిందికి తేబడుతుంది.

అధికోత్పత్తి కలుగాలంటే అవలంబించవలసిన వ్యవసాయపద్ధతులు ఇవి : పైరులకు పడే తెగుళ్ళను, రోగములను అదుపులోకి తెచ్చుట. పంటల పోటీలు ఏర్పాటు చేయుట. సకాలంలో విత్తనాలువేయడం, సకాలంలో నాట్లు వేయడం. కలగలుపు పంటలు వేయడం మొదలగునవి. మొక్కల సంరక్షణచర్యలు ఇదివరకే రాష్ట్రంలో బాగా వ్యాప్తిలోకి వచ్చినవి. వ్యవసాయశాఖ డిపోలలో, ఇతర ప్రైవేటు సంస్థలలో వివిధ క్రిమి సంహారక ఔషధములు పెద్దమొత్తములలో అమ్ముడుపోతున్నవి. ప్రణాళికకాలంలో కూడా మొక్కల సంరక్షణ చర్యలను తీవ్రతరం చేయవలెనని తలపెట్టబడింది. రాష్ట్రం మొత్తంలో 62.79 లక్షల ఎకరాలలో మొక్కల సంరక్షణ చర్యల క్రింద అనేక అభివృద్ధి కార్యక్రమాలు తలపెట్టబడినవి. ఇవి అమలు



*బంజరు భూములను సాగుకు తేవడం*



*మామిడి చెట్లకు బూజు పట్టకుండా మందు చల్లడం*



*బంజరు భూములను యంత్రాలతో సాగుకు తేవడం*



*బావికి ఆయిల్ ఇంజన్ పెట్టడం - సాగునీటి పద్ధతులలో ఇది శ్రేష్ఠమైనది.*

జరిగినవంటే ప్రణాళిక కాలం ముగిసేనాటికి అదనంగా 5.31 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి కాగలదు.

7. *సామాజికాభివృద్ధి బ్లాకులు, జాతీయ వికాసకేంద్రాలలో హెచ్చుగా కార్యక్రమాలు :* అధికాహారోత్పత్తికై తలపెట్టబడిన వివిధకార్యక్రమాలు సమర్థవంతంగా అమలు జరుగవలెనంటే సామాజికాభివృద్ధి బ్లాకులలో, జాతీయ వికాస కేంద్రాలలో పనిచేసే ఉద్యోగులకూ రాష్ట్రంలో సాధారణ అభివృద్ధిశాఖలలోపనిచేసే ఉద్యోగులకూ సాన్నిహిత్యం, పరస్పర సహకారం వుండడం, అవసరం అన్న విషయం గమనించబడింది. అందుచేతనే ఈ ఉభయుల కార్యకలాపాలు సమన్వయం చేయబడుతున్నవి. వ్యక్తిగత భూకమతాలవరకు చేరవలెనన్న లక్ష్యంతో జాతీయ వికాస కేంద్రాలలో జరుగవలసిన అభివృద్ధిపనుల లక్ష్యాలు నిర్ణయింపబడ్డవి.

8. *గ్రామీణ పరపతికీ, మార్కెటింగుకూ అధిక సౌకర్యాలు :* వ్యవసాయోత్పత్తులు సర్వతోముఖంగా అభివృద్ధి జెందుతున్నప్పుడు ఆ ఉత్పత్తులకు విక్రయావకాశాలను అనగా మార్కెటింగు సౌకర్యాలను కలిగించడం అతి ముఖ్యమైన సమస్య అవుతుంది. కాబట్టి వాణిజ్యపంటల చట్టాన్ని మరికొన్ని ప్రాంతాలకూ, మరికొన్ని పంటలకూ వర్తింపజేసి, గిడ్డంగులను మార్కెటు ఆవరణలను నిర్మించడంలో మార్కెటు కమిటీలకు సహాయపడి తద్వారా సాధ్యమైన స్థలములలో ఆ కమిటీలు వేలములను జరుపడానికి తోడ్పడి, ఉత్పత్తిదారులు తాము పండించిన పంటలకు సమంజసమైన ధరలను పొందునట్లు చేయవలెనని తలపెట్టబడింది. అతి ముఖ్యమైన వాణిజ్య పంటల విషయంలో మార్కెటు సర్వీసును ఏర్పాటుచేసి, ఎగుమతి మార్కెట్లలో సరుకుకు మంచిపేరు రావడానికై సరుకు నాణ్యమును కాపాడే ఉద్దేశ్యంతో వ్యవసాయోత్పత్తుల గ్రేడింగ్‌ను జరిపించ వలెననికూడా తలపెట్టబడింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయశాఖ, సహకారశాఖ మంజూరుచేసే అప్పులను హెచ్చించవలెనని తలపెట్టబడింది. ఇందుకొరకై ప్రణాళికలోని వ్యవసాయ, సహకార రంగాలకు తగుమొత్తాలు కేటాయింప బడ్డవి. ఆంధ్రప్రదేశ్‌లో రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి సహకారశాఖ సహకార సంస్థలద్వారా రూ. 1831 లక్షల డబ్బు పంపిణీ చేయగలదని ఆశింపబడుతున్నది. ప్రస్తుతం ఏడాదికి రూ 530 లక్షలు మాత్రమే ఇవ్వబడుతున్నవి. 1955-56 సంవత్సరంలో విస్తృత ఎరువుల పథకంక్రింద రసాయనిక ఎరువులను కొనడానికై వ్యవసాయశాఖ రూ 97 లక్షలు మంజూరు చేసింది. ఆంధ్ర ప్రాంతంలో రైతులు విత్తనాలు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు కొనుక్కోవడానికై తక్కావీ ఋణాలక్రింద రూ 23లక్షలు మంజూరు చేయబడినవి. 1960-61 సంవత్సరంలో ఈ కార్యక్రమాలను వరుస వారీగా రూ 125 లక్షలు, రూ. 30 లక్షలకు హెచ్చించ వలెనని తలపెట్ట బడింది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో తలపెట్టబడిన సహకార పరపతి విస్తృతం కానున్న దృష్ట్యా ఈరెండు పద్దుల క్రింద ఎక్కువ మొత్తాలు కేటాయింప బడలేదు. తెలంగాణా ప్రాంతంలో 1955-56 సంవత్సరంలో తక్కావీ ఋణాలక్రింద వ్యవసాయశాఖచే రూ.8.5లక్షలు పంచిపెట్ట బడ్డవి. 1960-61 సంవత్సరంలో రూ.200లక్షలను పంపిణీ చేయవలెనని సంకల్పించ బడింది.



*జపానుపద్ధతి వరిసేద్యం ప్రకారం వరిమొక్కలు వరుసల ప్రకారం నాటబడుతున్నవి.*

## ఆంధ్రప్రదేశ్‌లో రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద అదనపు ఉత్పత్తి లక్ష్యముల వివరాలు

| వివరము | విస్తీర్ణం లక్షల ఎకరాలలో | అదనపు ఉత్పత్తి లక్షల టన్నులలో | వివరణలు |
|---|---|---|---|
| భారీ నీటివనరు ప్రాజెక్టులు | 6.54 | 2.66 | పెద్ద, మధ్యరకం ప్రాజెక్టులు |
| స్వల్ప నీటివనరులు | 3.82 | 1.65 | ఇందులో కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ వికాస కేంద్ర ప్రాంతాల విస్తీర్ణం చేరివున్నది. |
| ఎరువులు, రసాయనిక ఎరువులు | 17.11 | 3.75 | |
| మేలురకం విత్తనాలు | 19.92 | 1.47 | |
| భూమిని సాగుకుతెచ్చి అభివృద్ధిపరచుట | 10.27 | 1.63 | ఇందులోభూసంరక్షణకూడావున్నది |
| మేలురకం వ్యవసాయ పద్ధతులు | 62.79 | 5.31 | |
| మొత్తం | 120.45 | 16.47 | |
| ఆహారేతర పంటలకై మార్పు జరిగినందువల్ల కలిగే లోటు | —— | 0.37 | |
| నికరంగా అదనపు ఉత్పత్తి | | 16.10 | |

# స్త్రీజన సంక్షేమం

## పల్లె ప్రాంతాలలో ప్రయోజనకరమైన ఉత్తమ జీవితంపై ఆసక్తి కలిగించడానికి కృషి



ఆంధ్రప్రదేశ్‌లో ఒకకోటి ఏబదిఆరులక్షలమంది స్త్రీలున్నారు. వారిలో 10 లక్షలమంది మాత్రమే చదువుకున్నవారు. ఈ 10 లక్షలలోనూ రమారమి 5 లక్షల మంది తూర్పుగోదావరి, గుంటూరు, కృష్ణా, హైదరాబాదు జిల్లాల్లో వున్నారు. కనుక రాష్ట్రంలో స్త్రీజన సంక్షేమానికై చర్యలుతీసుకొనవలసిన అవసరం స్పష్టంగా కనబడుతున్నది.

### స్త్రీ సంక్షేమ శాఖ

ప్రజాస్వామ్య వ్యవస్థ మన పరమావధి. సాంఘిక పరివర్తన ఆ పరమావధిని చేరడానికి సాధనము. అట్టి సాంఘిక పరివర్తన సందర్భంలో స్త్రీ సంక్షేమానికి ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. ఈ ఆశయసిద్ధికై ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక స్త్రీ సంక్షేమ శాఖను నడుపుతున్నది. ఈ శాఖ కుటుంబసంక్షేమము, సామాజిక సేవ అనే రెండు విషయాలపై తన కృషిని కేంద్రీకరిస్తున్నది. 11 సర్కారు జిల్లాల్లోనూ, రాయలసీమలోనూ యీ శాఖకు వుపశాఖలున్నాయి.

కుటుంబసంక్షేమానికి యీశాఖ కార్యక్రమంలో ప్రథమస్థాన మివ్వబడింది. ఈశాఖకుచెందిన సుశిక్షితులయిన సిబ్బంది ఒక క్రమం ప్రకారం ప్రతియింటికీ



హైదరాబాదులో జరిగిన అఖిలభారత పారిశ్రామిక వస్తుప్రదర్శనంలో ఆంధ్రప్రదేశ్ స్త్రీ జనాభ్యుదయశాఖ యేర్పాటుచేసిన స్టాలు



స్త్రీ సంక్షేమ స్టాలులో ప్రదర్శితమైన వస్తువులను పరిశీలిస్తున్న ప్రేక్షకులు.

వెడతారు. వెళ్ళి ఆరోగ్యం, పారిశుద్ధ్యం ప్రసూతి, శిశుపోషణ మున్నగు విషయాలలోనూ, క్లిష్టమైన కుటుంబ సమస్యల విషయంలోనూ సలహాలు యిస్తారు. స్త్రీలకు తగిన వుద్యోగాలను చూపించడానికికూడా వారు ప్రయత్నిస్తారు. ఇందువల్ల స్త్రీలు తమ కుటుంబరాబడిని హెచ్చించుకోడానికి అవకాశం వుంటుంది. ఈ సిబ్బంది యిలా యిళ్ళకు వెళ్ళి స్త్రీలతో పరిచయం చేసుకోనడమూ, వారి విశ్వాసాన్ని సంపాదించడమూ యివే యీ శాఖయొక్క పనికి మూలకందము.

## సామాజిక సేవా కేంద్రాలు

స్త్రీలకు సాంఘిక విద్యనునేర్పి తద్వారా వారిని ఆదర్శ గృహిణులుగా తల్లులుగా, పౌరులుగా తయారు చేయడానికై సామాజిక సేవా కేంద్రాలు నడుపబడుతున్నాయి. ఈ కేంద్రాలు యీ శాఖ యొక్క ఆదర్శాలను వ్యాప్తి నొందిస్తాయి.

పౌరశిక్షణ, సాంఘిక ప్రవర్తన, వయోజన అక్షరాస్యత, వయోజనవిద్య యీ సేవా కేంద్రాల కార్యక్రమంలో ఒకభాగం. పండుగలు, జాతీయ ప్రాముఖ్యంగల రోజులలో వుత్సవాలు జరుపబడతాయి. చర్చలు, ప్రసంగాలు, పోటీలు, వినోదయాత్రలు యేర్పాటు చేయబడతాయి. గృహ ఆర్థిక విషయాలు, తోటపని, పౌష్టికాహారం, ఆహారవిధానం, వంటచేయడం, ప్రథమచికిత్స, ప్రసూతి శిశుసంరక్షణ, గృహవైద్యము మున్నగునవి వయోజన విద్యలో చేర్పబడినవి. విశ్రాంతి కాలంలో పనులు చేయడం ప్రోత్సహించ బడుతుంది. సభ్యులకు నూలు వడకడం, నేత, కుట్టుపని, పట్టెడనేత మున్నగునవి నేర్పబడతాయి. ఇందువల్ల వారు వేన్నీళ్ళకు చన్నీళ్లు అన్నట్లు కొంత డబ్బును సంపాదించి కుటుంబానికి తోడ్పడ్డానికి వీలుంటుంది. అనేకరకాల స్త్రీలు, అనేక తరగతులకు చెందినవారు యీ కేంద్రాలలో ఒకే ఆశయంకోసం సమావేశమై పరస్పర సహకారంతో పనిచేస్తారు దీనివల్ల వారిలో అరమరలు లేక అంతా ఒకటే అన్న భావం పెంపొందుతుంది.

## శిశు సంక్షేమం

3-7 సంవత్సరాల మధ్య వయస్కులకు, సాధ్యమైనంత వరకూ పాలు, చేపనూనె సప్లై చేయబడుతాయి. వారికి మంచి అలవాట్లు నేర్పబడతాయి. పల్లె ప్రాంతాలలో యీశాఖ ప్రీ - బేసిక్ తరగతుల్ని నడుపుతుంది. అక్కడ పసిపిల్లల చదువుకు యివే యేకైక సాధనం.

## ప్రసూతి సహాయం

ఈశాఖయొక్క వుపశాఖలకుచెందిన సుశిక్షితులైన మంత్రసానులు ప్రసూతివిషయంలో స్త్రీలకుతోడ్పడుతారు. వీరు ఆర్గనైజర్లతో సన్నిహిత సహకారంతో పనిచేస్తారు. ప్రీ-బేసిక్ తరగతులను నడపటం, చిన్న చిన్న బాధలకు మందులివ్వడం, చూలెంత, బాలెంతల విషయంలో శ్రద్ధతీసుకోనడం, ప్రసవం సందర్భాలలో వీరు ఆర్గనైజర్లకు తోడ్పడుతారు. మారుమూలల గ్రామాలలో వైద్య, ప్రసూతి సహాయాల సందర్భంలో యీశాఖ మంత్రసానులే శరణ్యం.

## వెనుకబడిన తరగతులు

ఆదివాసి స్త్రీలు అరణ్యా మధ్యానగల కొండలమీదనూ, గుహాలలోనూ నివసిస్తారు. అక్కడికి ఆధునిక నాగరికత వ్యాపించలేదు. అందుచేత అక్కడి స్త్రీల సహాయార్థం 7 వుపశాఖలు యేర్పాటు చేయబడినవి. ఏజన్సీ బ్రాంచీల ఆర్గనైజర్లు గ్రామాలలో తిరిగి ఆదివాసి స్త్రీలతో పరిచయ మేర్పరచుకుని వారికి ఆరోగ్యంగా, నాగరికంగా జీవించడం గురించి బోధచేస్తారు. ఈశాఖ సలిపిన కృషి ఫలితంగా ఆదివాసి స్త్రీలు పరిశుభ్రతను నేర్చుకున్నారు. వారు సాధారణంగా పగలల్లా పనిచేసుకుని సామాజిక సేవా కేంద్రాలకు రాత్రిళ్ళు వస్తారు. అక్కడ తెలుగు, హిందీ, కుట్టుపని, తదితరమైన చేతిపనులు నేర్పబడుతాయి. కేంద్రాలలో వివిధ విషయాలపై ప్రసంగాలు యేర్పాటు చేయబడతాయి. చికిత్స విషయంలోను ప్రసూతి విషయంలోనూ, యితర సమస్యల విషయంలోనూ వారు యీ శాఖ సిబ్బంది



స్టాలులో కొండజాతి ప్రజలు నివసించే ప్రాంతాలనుంచి వచ్చిన వస్తువులగురించి వివరించబడుతున్నది.

చెప్పిన విధానాలను యిష్టపూర్వకంగా అనుసరిస్తున్నారు, ఆదివాసి స్త్రీలు వున్న చోటు విడిచి యెక్కడికీ వెళ్ళరు. అటువంటి వారినికూడా పట్టణానికి వినోదయాత్రలకి వెళ్ళడానికి రప్పించడం జరుగుతున్నది. గ్రామ నాయకుల శిక్షణశిబిరాలకి పురుషులతోపాటు వారుకూడా వెడతారు. వారిలో కొందరు తాము నేర్చుకున్న విషయాలను యింటివద్ద తమ తోటివారికి చెప్పగలుగుతున్నారు. వారు ఇచ్ఛికంగా ముందుకువచ్చి సంక్షేమ సిబ్బందికి అనేక విధాల తోడ్పడుతున్నారు.

పూర్వం నేరస్థ జాతులనే పేరుతో కళంకితులైన యానాదులను, సుగాలీలను, యితర తరగతుల వారిని బాగుచేయడానికై సాంఘిక సంక్షేమశాఖ కృషి చేస్తున్నది. విముక్తజాతి స్త్రీల సంక్షేమం నిమిత్తం స్త్రీ సంక్షేమశాఖ అయిదు ప్రత్యేక బ్రాంచీలను నడుపుతున్నది.

అన్ని బ్రాంచీలలోనూ హరిజన సంక్షేమం విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకొనబడుతుంది.

## అనాధుల ఉద్ధరణ

దిక్కులేని వితంతువులు, భర్తలు తదితరులచే వంచింపబడిన స్త్రీలకు రక్షణ యివ్వబడుతుంది. అట్టివారు జీవనోపాధిలేక జీవితాన్ని నాశనం చేసుకోడానికీ, ఆత్మహత్యకూ పూనుకొనే సందర్భాలు కనిపెట్టి, వారికి రక్షణ యివ్వబడుతుంది.

జీవితాలు పాడైపోకుండా నిరోధించడానికి సంబంధించిన పనిని సర్వీస్‌హోమ్ చేస్తుంది. ఇది తూర్పుగోదావరిజిల్లా సీతానగరంలో వుంది. దీనిని కస్తూర్బా గాంధీ నేషనల్ మెమోరియల్ ట్రస్టు నిర్వహిస్తున్నది. ఈహోమ్‌లోని వారికి 3 సంవత్సరాలపాటు మామూలు చదువు నేర్పబడుతుంది. వృత్తి విద్యా శిక్షణకూడా యివ్వబడుతుంది. ప్రభుత్వం ఒక్కొక్కరికి నెలకి రూ. 35 స్టయిపెండు యిస్తుంది. ఇక్కడివారు ఇ. ఎస్. ఎల్. సి, మెట్రిక్యులేషను, హిందీ పరీక్షలకు హాజరుకావడానికి వీలుగా చదువు చెప్పబడుతుంది. కుట్టుపని, రంగుదారాల కుట్టుపని, నేత, పుస్తకాల బైండింగు, నూలువడకడం, లేసు అల్లిక మున్నగు చేతి పనులలోకూడా వారికి శిక్షణ యివ్వబడుతుంది. శిక్షణ పూర్తి అయిన తరువాత జీవితంలో వారిని స్థిరపర్చడానికి కృషి జరపబడుతుంది.

## "సౌభాగ్య"

ఈ శాఖ "సౌభాగ్య" అనే తెలుగు మాసపత్రికను ప్రచురిస్తున్నది. ఇది సాంఘిక సంక్షేమ సాధనలో ఒక అంగం. కుటుంబం, శిశుసంక్షేమాలు, సాంఘికవిద్య, సేవలకు సంబంధించిన కథలు, వ్యాసాలు యిందులో ప్రచురించబడతాయి. దేశంలో జరిగే అభివృద్ధి కార్యకలాపాలుకూడా యిందులో వివరించబడుతాయి. దీని వార్షికచందా రెండు రూపాయలు మాత్రమే.

ప్రస్తుతం యీశాఖకి 36 మామూలు బ్రాంచీలు వున్నాయి. ఇవికాక 8 స్త్రీ, శిశువుల కేంద్రాలున్నాయి. ఇవి పూర్వం రాయలసీమలో కరువు నివారణ కేంద్రాలుగా పనిచేసేవి. కొండజాతి వారికి 7 ఏజన్సీ బ్రాంచీలు, విముక్తజాతి స్త్రీలకి 5 బ్రాంచీలు వున్నాయి.

ద్వితీయ పంచవర్షప్రణాళికక్రింద దిగువ ప్రణాళికలు తలపెట్టబడినవి.

1. మూడు సర్వీసుహోమ్‌లు - ఒక్కొక్కదానిలో 150 మంది స్త్రీలకు, 60 మంది పిల్లలకు వసతి వుంటుంది.

2. శాస్త్రీయ విధానాలలో సాంఘిక సేవ చేయడంలో ఆర్గనైజర్లకి శిక్షణ యివ్వడం.

3. నిరుద్యోగులైన స్త్రీలు, పూర్తి పని లేని స్త్రీల నిమిత్తం సాంకేతిక శిక్షణ కేంద్రాల స్థాపన.

4. ఏజన్సీ ప్రాంతాలలో మరి 12 బ్రాంచీల స్థాపన.

5. వ్యాధిగ్రస్తులకు, దుర్బలులకు సాంఘిక సహాయం.

తెలంగాణా ప్రాంతంలో స్త్రీ శిశువుల అవసరాలవిషయంలో సంక్షేమ విస్తీర్ణ ప్రాజెక్టు కేంద్రాలు ఆదుకొంటున్నవి. ఇవి ఆరు జిల్లాల్లో మాత్రమే పని చేస్తున్నాయి. జాతీయ వికాస సేవా కేంద్రాలు, సమాజాభివృద్ధి కేంద్రాలలోకూడా స్త్రీల కార్యక్రమం జరిపించబడుతున్నది.

★



# ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు

## వరంగల్లు దేవాలయాలు

*కాకతీయ మహాసామ్రాజ్య రాజధాని నగరమైన వరంగల్లు పట్టణము చారిత్రక ప్రసిద్ధి వల్లనే కాక, కళాఖండాల ప్రాముఖ్యతనుబట్టి కూడా ఒక యాత్రాస్థలముగా పరిగణింపబడు తున్నది. వరంగల్లు, హనుమకొండ అనే పురాతన నగరాలలోని శిల్పులు యిక్కడ దేవాలయాల మీద చెక్కిన చెక్కడాలు, ఇచటి రమణీయ శిల్పకళాసంపద అనేకమంది విదేశీ యాత్రికుల మన్ననలను పొందినవి. ఇక్కడి చెక్కడాలు అతి సున్నితమైనవి, విలిష్టమైనవి.*

### వేయిస్తంభాల దేవాలయం

వరంగల్లు సమీపంలో, కాజీపేట రైలుస్టేషనుకు షుమారు 4 మైళ్ళ దూరంలోగల హనుమకొండ దేవాలయం, కాకతీయరాజుల కాలంలో వెల్లివిరిసిన శిల్పకళా సంపదకు చిహ్నముగా ఉన్నది.

గణపతి దేవుడు నిర్మించిన యీ దేవాలయ ప్రశంస ప్రతాపచరిత్రలో పేర్కొనబడింది. పూర్వ చాళుక్య దేవాలయాలన్నిటివలె, యీ దేవాలయం కూడా నక్షత్రాకారములో మూడు గర్భగుడులు కలిగియున్నది. శివుడు, విష్ణువు, సూర్య దేవులకు యీ గర్భగుడులు ఉద్దేశించబడినవి.

గర్భగుళ్ళలో విగ్రహాలు లేవు. పీఠముల మీద నల్లరాతి లింగములు అమర్చబడి యున్నవి. కాని గర్భగుడుల ద్వారములపై చెక్కబడిన రాతి చెక్కడ

ములమీద మాత్రము ముగ్గురు దేవుళ్ళ విగ్రహములు వున్నవి.

ఈ దేవాలయములో ముఖ్యంగా గమనింపవగిన విశేషములు, చక్కగా చెక్కబడిన స్తంభములు, ద్వారబంధములు మొదలైనవి. దేవాలయము ముందుగల నల్లరాతి నంది విగ్రహము అత్యద్భుతమైన శిల్పము.

తూర్పు ద్వారమువద్ద నల్లరాతి శాసనములో కన్నడ, తెలుగు లిపులలోని విశేషముద్వారా, యీ దేవాలయ నిర్మాణమునకు సంబంధించిన విషయము, తేదీ క్రీ శ. 1164 సంవత్సరమని తెలియుచున్నది. ఈ శాసనముద్వారా, దేవాలయ నిర్మాత గణపతి దేవుని వంశాను క్రమణిక, అతని కాలమునకు సంబంధించిన విశేషములు తెలియు చుండుటచేత యిది చాలా ముఖ్యమైన శాసనము.

## కోటలోని దేవాలయాలు

వరంగల్లుకోట క్రీ. శ. 1199 లో గణపతి దేవునిచే ప్రారంభింపబడి, 1261 లో రాణీ రుద్రమదేవి కాలంలో పూర్తి చేయబడినది. కోట మధ్యలో యిటీవలనే ఒక దేవాలయము బైట పడినది. నాలుగు పెద్ద గేట్లతో యీ దేవాలయమునకు ఆవరణము నిర్మింపబడినది. ఈగేట్లు, ప్రసిద్ధమైన సాంచీ గేట్లను పోలియుండి, చూచుటకు గంభీరముగా నున్నవి.

నరశింహస్వామి, పద్మాక్షి, గోవిందరాజులు స్వాములవార్లకు సంబంధించిన దేవాలయములు



రామప్ప దేవాలయం, ములుగ్ - వరంగల్లు



వెయ్యిస్తంభాల దేవాలయంలో రాష్ట్ర గవర్నరు శ్రీ సి. ఎమ్. త్రివేది

వరంగల్లులోని వెయ్యిస్తంభాల దేవాలయం



రామప్ప దేవాలయం - మరొక దృశ్యం

యింకా చాల వున్నవి. ఇందులో చివరిది వరంగల్లు రైలుస్టేషనుకు సమీపంలోగల కొండపై గలదు. ఇక్కడినుండి పట్టణము, పరిసరప్రాంతాలు బాగా కనిపిస్తవి.

క్రొత్త శివుడిగుడిలోని తెల్ల పాలరాతి విగ్రహాలు, గోడలపైగల రంగుల చిత్రాలు చూపరులకు ఆనందమును కలుగ జేయుచున్నవి.

వరంగల్లులోని ఖిలోనిలో 12-13 శతాబ్దాల మధ్య కాలంలోగల కాకతీయ సామ్రాజ్యానికి చెందిన దేవాలయమొకటి గలదు. దీని ప్రాకారము రెండు ప్రాకారము లంత మందముగ నుండి, కాకతీయుల కాలమునాటి నిర్మాణముల ప్రత్యేక శైలిలో నిర్మింపబడియున్నది. ప్రాకారమునకు మూడు ద్వారములు కలవు. వరంగల్లు కోటలోని మధ్యభాగంలోకల గేట్ల వలె యీ ద్వారములుకూడా నిర్మింపబడినవి.

## రామప్ప దేవాలయం

వరంగల్లుకు 40 మైళ్ళ దూరంలో ములుగు తాలూకాకు చెందిన పాలంపేటలోని రామప్ప సరస్సుతీరంలో అనేక దేవాలయ శిథిలాలు ఉన్నవి.

దక్కన్‌లో మధ్య యుగాలలో నిర్మించబడిన దేవాలయాలలో యివి మకుటాయమానమైనవని తలంచబడుతున్నది.

యిక్కడి ప్రధాన దేవాలయానికి రాళ్ళతో కట్టిన పెద్ద ప్రాకారమున్నది. దీనికి దక్షిణ, ఉత్తరపుకొనలలో మరిరెండు గుళ్ళు నిర్మింపబడి యున్నవి. ఈ దేవాలయముకూడా, నిర్మాణములో వేయిస్తంభాల దేవాలయాన్ని పోలియున్నది. కాని యిక్కడ ఎక్కువ శిల్పపు పనితనము చూపించబడినది. దేవాలయ శిఖరము ఏమాత్రము బరువులేని పెద్ద యిటుకలతో కట్టబడినది. యీయిటుకలు నీటిలో తేలుతవి.

దేవాలయస్తంభాలు, పైకప్పులపై శిల్పములు చక్కగా చెక్కబడినవి. ఎక్కడచూసినా రామాయణ, మహాభారతములోని సన్నివేశములు చిత్రించబడినవి. గోడల వెలుపలిభాగముమీద అనేక దేవతలు, వీరులు దొమ్మరులు, సంగీతవేత్తలు, నృత్యకన్యల విగ్రహాలు వేయబడినవి. అంతేకాక బ్రాకెట్లలో జతలుజతలుగా రమణీయమైన వివిధ భంగిమలలో నల్లరాతితో, సజీవమైన స్త్రీ విగ్రహాలు కూడా అమర్చబడినవి. ఇవి నృత్యభంగిమలతో, ద్వారపాలకులుగా వ్యవహరిస్తున్న యక్ష కాంతలు అని చెప్పవచ్చు.

ఆవరణలోగల తెలుగు — కన్నడ శాసనమునుబట్టి యీ దేవాలయం క్రీ. శ. 1204 లో నిర్మించబడినదని తెలియుచున్నది.

ఖాజీపేటవద్దగల కొన్ని కొండలలో, ఒకదానిపై రెండు కొమ్ములవంటి గండశైలములు రైలులో పోయేవారికి కనిపిస్తూ వుంటవి. ఈ కొండల శిఖరం మధ్యగల మూడు పురాతన దేవాలయాలు, హిందువుల పురాతన శిల్పాలకు సంబంధించిన నమూనాలను కలిగియున్నవి.

కాజీపేట స్టేషనుకు ఒకమైలు దక్షిణంగా గల కొండపై కొన్ని పురాతన దేవాలయములు ఉన్నవి. యిందులో ఒకటి శివునిగుడి, రెండవది వైష్ణవదేవాలయము. ఎత్తయిన శిఖరాలతో యీ రెండు దేవాలయములు ద్రావిడ శైలిలో నిర్మితములైనవి. ఈ కొండక్రిందగల గ్రామములో మరికొన్ని చిన్న చిన్న దేవాలయములుకూడా ఉన్నవి. ఇందులో ఒక మంచిదేవాలయమును శైవమతస్థులు ఉపయోగించుకుంటున్నారు.

ఈవిధముగా వరంగల్లులోని దేవాలయములలోగల రాతిచెక్కడములు, శిల్పకళాసంపద, యాత్రీకులకు నయనానంద కరంగావుండి పురాతన కాకతీయ వైభవాన్ని వేనోళ్ళ చాటుతున్నవి.

# ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పారిశ్రామికంగా సగర్వంగా, చెప్పుకోదగిన అభివృద్ధిని ఇంకా పొందలేదు. ఐతే ఇక్కడగల వ్యవసాయ, అటవీ, ఖనిజ సంపదలు, థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి గల ఆధారాలు ఈ రాష్ట్రం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందడానికి ఉజ్జ్వల మైన అవకాశాలను కల్పిస్తున్నవి.

ఈ రాష్ట్రంలో పొగాకు, చెరకు, వేరుసెనగ, ఆముదాలు, ప్రత్తి, జనుము విశేషంగా పండుతున్నవి. సింగరేణి, కొత్త గూడెం, బెల్లంపల్లి మున్నగుచోట్ల బొగ్గు లభిస్తున్నది. గోదావరి లోయలో బొగ్గును త్రవ్వి తీయడానికి అన్వేషణ జరుపబడుతున్నది. కృష్ణా గోదావరి డెల్టా ప్రాంతాలలో లిగ్నైట్ వున్నట్లు కనుగొనబడింది. ఇల్మెనైట్ మోనజైట్ ఇసుక అపారంగా లభించవచ్చు. నెల్లూరు జిల్లాలో యురే నియం వున్నది. ఆదిలాబాదు, వరంగలు, కరీంనగర్, ఖమ్మం, కృష్ణా, కర్నూలు జిల్లాలలో పెద్దమొత్తాలలో నాసి రకం ముడి ఇనుము, మేలురకం ముడి ఇనుము లభిస్తుంది. ఈ ముడి ఇనుము విదేశాలకు, ముఖ్యంగా జపాను దేశానికి ఎగుమతి చేయబడుతున్నది. శ్రీకాకుళం జిల్లాలో మెంగనీస్ విశేషంగా లభించగలదు. నెల్లూరు జిల్లాలో మైకా గను లున్నవి. గానిలో రాగి లభిస్తుంది. అనేక ప్రాంతాలలో నాణ్యమైన సున్నపురాయి విశేషంగా లభిస్తుంది. కడపలో అస్బెస్టాస్ వుంది. రాయలసీమలో వివిధములైన ఖనిజ ములు, కొద్దిమొత్తాలలో బంగారం, వజ్రాలు లభిస్తాయి. సూళ్ళూరుపేట వద్ద జిప్సం లభిస్తుంది. బ్లాక్ గ్లాసును తయారుచేసే నాణ్యమైన ఇసుకకూడా అక్కడ లభిస్తుంది.

అడవులలో కాగితపు పరిశ్రమ, కొయ్య పరిశ్రమలు, అగ్గిపెట్టెలు, ప్లైవుడ్ పరిశ్రమలకు అవసరమైన ముడి సామగ్రి లభిస్తుంది.

## జలము, విద్యుచ్ఛక్తి

ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి అభివృద్ధికి చాలా అవ కాశా లున్నవి, ఈరాష్ట్రంలో నాలుగు పెద్దనదులు, 32చిన్న నదులు ప్రవహిస్తున్నవి. కనుక నీటి సరఫరాకేమీ కొదువ లేదు. అపారమైన ఈ జలంతో ఉత్పత్తి చేయబడు విద్యు చ్ఛక్తితో వ్యవసాయక, అటవీ, ఖనిజ సంపదను పరిశ్రమ లకు వినియోగించ వచ్చును, నిజాంసాగర్ జలవిద్యుచ్ఛక్తి కేంద్రం, రామగుండం థర్మల్ పవర్‌స్టేషన్, మాచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి కేంద్రం — ఇవి కావలసినంత విద్యు చ్ఛక్తిని ఉత్పత్తి చేస్తాయి. సీలేరు, నాగార్జునసాగర్ ప్రాజె క్టుల నిర్మాణం పూర్తికావడంతో పరిశ్రమల వినియోగానికి మరింతగా విద్యుచ్ఛక్తి లభించ గలదు. గోదావరి లోయ నీరు, విద్యుచ్ఛక్తి, ఖనిజసంపద, వాణిజ్య పంటల రీత్యా సుసంపన్న మైనది. ఈ లోయలో తలపెట్టబడిన ఇచ్ఛం పల్లి జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టువల్ల పెద్దమొత్తంలో విద్యు చ్ఛక్తి లభిస్తుంది గనుక పారిశ్రామికంగా ఈరాష్ట్రం ఎంతో ముందంజ వేయడానికి అవకాశాలు కలవు.

## వస్త్ర పరిశ్రమ

ఆంధ్ర ప్రదేశ్‌లో 12 వస్త్రముల మిల్లులున్నవి. వీనిలో మూడు మిల్లులు తెలంగాణాలో వున్నవి. ఈ మొత్తం మిల్లుల కదుళ్ళసంఖ్య 1,20,892. మగ్గముల సంఖ్య 1,793 మరి అయిదు వస్త్రముల మిల్లులకు లైసన్సులు ఇవ్వబడి నవి. కొంతకాలం క్రితం మూసివేయబడిన హైద్రాబాదు స్పిన్నింగ్ అండ్ వీవింగుమిల్లు మళ్లీ త్వరలోనే సహకార మిల్లుగా వస్త్రోత్పత్తిని ప్రారంభిస్తుంది. ఇది రాష్ట్రంలోని రెండవ సహకార మిల్లు. మొదటి మిల్లు గుంతకల్లులో వున్నది.

## కాగితం పరిశ్రమ

ఆంధ్ర ప్రదేశ్‌లో రెండు కాగితపు మిల్లులున్నవి. ఈ రెంటింటిలో సిర్పూరు పేపరుమిల్లు పెద్దది. సిర్పూరు పేపరు మిల్లు వారు రు. 2.5 కోట్ల ఖర్చుతో తమఉత్పత్తిని రోజుకు 45 టన్నులనుంచి 100 టన్నుల వరకు హెచ్చించడానికి లైసన్సు ఇవ్వవలసిందిగా దరఖాస్తు పెట్టుకున్నారు. ఇటీవల

సిర్పూరు పేపరుమిల్లులో ఆర్టుపేపరు కూడా తయారు చేయబడింది. ఈ మిల్లులో ప్రతిరోజు 1,600 మంది కార్మికులు పనిచేస్తున్నారు. 1955 సంవత్సరంలో దీని ఉత్పత్తి 2,68,000 హండ్రడ్ వెయిట్లు. రాజమండ్రిలోని ఆంధ్రా పేపరుమిల్లు ప్రభుత్వ సంస్థ. ఈ మిల్లును ప్రభుత్వం 1948 లో 25 లక్షల రూపాయలకు కొని దానిని 17-5-48 తేదీన స్వాధీనపరచుకొన్నది. ప్రస్తుతం ఇందులో క్రాఫ్ట్ అన్‌బ్లీచ్డ్, బ్లూమ్యాచ్ పేపరు తయారవుతున్నది. ఇందులో ఉత్పత్తియగు కాగితపు నాణ్యమును హెచ్చించి, బ్లీచింగు చేయబడిన వివిధరకముల కాగితమును తయారుచేయుటకు ప్రభుత్వం రు. 15.3 లక్షలు మంజూరుచేసింది. రెండవ పంచవర్షప్రణాళికలో ఈ మిల్లును మొత్తం రూ. 175 లక్షల ఖర్చుతో విస్తృతంచేసి దీని ఉత్పత్తి రోజుకు 25 టన్నులు అగునట్లుగా అభివృద్ధి పరచవలెనని తలపెట్టబడింది. ప్రస్తుతం యీ మిల్లులో రోజుకు 10 టన్నులు మాత్రమే ఉత్పత్తి అవుతున్నది. ఈ మిల్లులో కార్డుబోర్డు సెక్షన్ కూడా కలదు. ఈ మిల్లులో స్టేషనరీ సామగ్రి, ఫైలు బోర్డులు కూడా తయారుచేయబడి స్టేషనరీ డిపోకు సప్లయి చేయబడుతున్నవి. ఇందులోపనిచేయు కార్మికులసంఖ్య 500.

చక్కెర పరిశ్రమలో లభించే చెరకు పిప్పితో కాగితమును తయారుచేయుటకై రూ. 5 కోట్ల ఖర్చుతో ఏడాదికి 15,000 టన్నుల కాగితాన్ని తయారుచేసేఫ్యాక్టరీ నొకదానిని స్థాపించే విషయమును ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నది.

## చక్కెర పరిశ్రమ

బోధన్‌లోని నిజాం సుగర్ ఫ్యాక్టరీ ఆసియా ఖండంలోని పెద్ద ఫ్యాక్టరీలలో ఒకటి. ఈ ఫ్యాక్టరీలో రోజుకు 3,750 టన్నుల చెరకుగడ గానుగ వేయబడుతుంది. ఇందులో ఏడాదికి 30,000 టన్నుల చక్కెర ఉత్పత్తి అవుతుంది. ఫ్యాక్టరీలో 2400 మంది కార్మికులు, చెరకు పొలాలలో 15.000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఆంధ్ర జిల్లాలలో 9 చక్కెర ఫ్యాక్టరీలున్నవి. ఆంధ్ర జిల్లాలలో ప్రయివేటు రంగంలో మరి అయిదు చక్కెర ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి ప్రభుత్వం లైసన్సులు ఇచ్చింది. బోధన్ ప్రాంతంలో ఒక సహకార చక్కెర ఫ్యాక్టరీ నెలకొల్పబడగలదు.

## మద్యసారము (ఆల్కహాల్)

సారాయమును తయారు చేయుటకు రెండు ప్రభుత్వ డిస్టిలరీలు వున్నవి. ఇవిగాక షకర్ నగర్‌లోని గవర్నమెంటు ఆల్కహాలు ఫ్యాక్టరీ నిజాం సుగర్ ఫ్యాక్టరీలోని బెల్లపు నీరును వినియోగించి ప్రతి సంవత్సరం దాదాపు 11 లక్షల గ్యాలనుల పవర్ ఆల్కహాలు తయారు చేస్తున్నది. ఇందులో 80 మంది కార్మికులుపనిచేస్తున్నారు.

## సిగరెట్లు

హైద్రాబాదులో 4 సిగరెట్టు ఫ్యాక్టరీలు వున్నవి. వీటిలో ఏడాదికి 4,800 మిలియనుల చవుకరకం సిగరెట్లు తయారవు తున్నవి. ఈ ఫ్యాక్టరీలలో దాదాపు 2,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు ఆంధ్ర ప్రదేశ్‌లో పొగాకు విశేషంగా పండింపబడుతున్నది కాబట్టి సిగరెట్ల పరిశ్రమ వృద్ధి చెందడానికి మంచి అవకాశాలున్నవి.

## యంత్రపరికరాలు

ప్రాగాటూల్సు కార్పొరేషన్ లిమిటెడ్. అను సంస్థలో ఆధునిక యంత్రములు గల పెద్ద మెకానికల్ వర్కుషాపు వున్నది. ఈ కార్పొరేషనువారు వెర్నియల్ క్యాలిపర్స్, వీబ్లాక్సు, ట్రైస్క్వేర్సు, మాస్టర్ స్క్వేర్సు, సర్ఫేసు ప్లేటు గ్రౌండు మొదలగు కొలిచే పరికరాలను, గుర్తులువేసే పరికరాలనుతయారుచేస్తున్నారు. ఇందులో మిల్లింగ్‌మెషిన్, లేత్స్, డ్రిల్లింగ్ మెషీనుల పూర్తి యూనిట్లు తయారుచేయబడుతున్నవి. స్క్రూకప్లింగ్సు, రైల్వే డూప్లికేట్లు, ఆటో డీజెల్ ఇంజన్ కంపోనెంట్సు, వాల్వులు, క్రాంక్‌షాఫ్టులు కనెక్టింగ్ రాడ్లు కూడా తయారు చేయబడుతున్నవి. ఈ సంస్థను విస్తృతపరచే కార్యక్రమానికి రూ. 75 లక్షలు కేటాయింపబడినవి. ఆ కార్యక్రమంలో ఆధునికమైన ఒక ఫౌండ్రీ, ఒక భారీ ఫోర్జ్ షాపు స్థాపన కూడా చేరివున్నవి.

## పింగాణి

రాష్ట్రప్రభుత్వ యాజమాన్యాన నిర్వహించబడుతున్న ఒక పింగాణీ ఫ్యాక్టరీ గూడూరులో వుంది. ఇక్కడ ఉత్పత్తి అయిన సరకులకు గిరాకీ వుండడమే కాకుండా ఫ్యాక్టరీ లాభంపై కూడా నడుస్తున్నది. ప్రయివేటు ఉత్పత్తిదారులు అనేకులు ఇక్కడ ద్రావకంపోసే జాడీలు తయారు చేస్తూంటారు. ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీని విస్తృతపరచడానికై రాష్ట్రప్రభుత్వం అదనంగా రూ. 60,000 లు మంజూరుచేసింది. పింగాణీ ఫ్యాక్టరీని విస్తృతపరచడానికి అవసరమైన ఒక భవనం కూడా నిర్మాణంలో వుంది. ఒక పింగాణీ సంస్థ కూడా దీనికి అనుబంధముగా 1954 జూలై నెలనుంచి పనిచేస్తున్నది.

## ఆల్విన్ మెటల్ వర్క్స్

రాష్ట్రంలో హైద్రాబాదు ఆల్విన్ మెటల్ వర్క్స్ ఒక ప్రఖ్యాతమైన సంస్థ. బస్సుల బాడీలను నిర్మించుటకు ఈ సంస్థకు ఒక పెద్ద వర్కుషాపు వుంది. ఇందులో 1,100 మంది కార్మికులు పనిచేస్తున్నారు. దీన్ని విస్తృతపరచి రెఫ్రిజిరేటర్లు, రైల్వే వాగన్లు కూడా నిర్మాణం చేయుటకు ఒక కార్యక్రమం వేయబడింది.

## సిమెంటు, సిమెంటు సరుకులు

సిమెంటు ఉత్పత్తికి ఆంధ్ర ప్రదేశ్‌లో సున్నపురాయి ఎక్కువగా లభించే అవకాశాలున్నాయి. ఆంధ్ర సిమెంటు, కృష్ణా సిమెంటు అనబడే రెండు సిమెంటు ఫ్యాక్టరీలు బెజవాడలో పనిచేస్తున్నాయి. ఇవి సాలీనా 1.89 లక్షల టన్నుల సిమెంటును తయారుచేస్తున్నవి ప్రస్తుతం ఉత్పత్తి పరిమాణాన్ని ఈ రెండు ఫ్యాక్టరీలు హెచ్చించుచున్నాయి. ఇంకా నాలుగు సిమెంటు ఫ్యాక్టరీలకు లైసెన్సులు ఇవ్వ బడినవి. అవి నిర్మాణదశలో ఉన్నవి. అవి మంచిర్యాల, మాచెర్ల, పాణ్యం, యెఱ్ఱగుంట్లలలో ఉన్నవి.

## ఎస్‌బెస్టాస్ సిమెంటు రేకులు

హైద్రాబాదు ఎస్‌బెస్టాస్ సిమెంటు ప్రాడక్ట్సు లిమిటెడ్ అను సంస్థ తన ఉత్పత్తి కార్యక్రమాన్ని పునః ప్రారంభించింది. ఇది సనత్‌నగర్‌లో వుంది. ఇందులో ప్రతి రోజూ దాదాపు 70 టన్నుల ఎస్‌బెస్టాస్ సిమెంటు రేకులు, ఇతర సిమెంటు ఫిట్టింగు సామగ్రి తయారుచేయ బడుతున్నది. సిమెంటు ఎక్కువగా లభిస్తే సరుకుల ఉత్పత్తి కూడా ఎక్కువ అవుతుంది. ఇందులో 450 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

అజమాబాద్ ఇండియన్ హ్యూమ్ పైపు కంపెనీ లిమిటెడ్ - దీనికి రాష్ట్రంలో ఆరు బ్రాంచీలు వున్నాయి. ఇందులో కాంక్రీటు పైపులు (సామాన్యమైనవి, ఉక్కు కడ్డీలతో తయారుకావింపబడినవి.) ఉత్పత్తిఅవుతాయి. ఇందులో సాలీనా రూ. 12 లక్షల విలువగల సరుకులు తయారవు తాయి. 450 మంది కార్మికులు ఇందులో పనిచేస్తున్నారు.

## పొరల రేకులు

సనత్ నగర్‌లోని హైద్రాబాద్ లామినేటెడ్ ప్రొడక్ట్సు లిమిటెడ్ అను సంస్థ లండన్‌లోని బేక్‌లైట్ లిమిటెడ్ అనే సంస్థతో కలసి పనిచేస్తున్నది. ఇది ఏటా రూ. 3 లక్షల విలువగల పొరల రేకులను తయారుచేస్తున్నది. భారత దేశంలో ఇటువంటి సంస్థ మరెక్కడా లేదు.

## కృత్రిమ సిల్కు

సిర్పూర్ - కాగజ్ నగర్‌లో నున్న సిర్‌సిల్కు లిమిటెడ్ అను సంస్థకు ప్రతిరోజూ 5 టన్నుల రేయాన్ నూలును దానినుంచి 50,000 గజాల రెయాన్ వస్త్రాలను తయారు చేసే సామర్థ్యం వున్నది.

సెల్యూలోజ్ ఎసెటేట్ పద్ధతిద్వారా కృత్రిమ సిల్కునూలు తయారు చేయబడుతుంది. భారతదేశంలో ఇట్టి పరిశ్రమలకు ఈ పరిశ్రమ మార్గదర్శకమైనది. ఈ సంస్థకు 350 మగ్గా లున్నాయి. 700 మగ్గాలు అనతికాలంలో పెట్టబడనున్నవి.

## బొగ్గు

సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్‌లో 2 మిలియన్ల టన్నుల బొగ్గు సాలీనా ఉత్పత్తి అవుతుంది. 9000 మంది భూగర్భంలో పనిచేసే కార్మికులనూ, 6,400 మంది భూమి పైన పనిచేసే కార్మికులను యీ కంపెనీ వారు నియ మించారు. ఆవిరిని ఉత్పత్తిచేసే ఇంజన్‌కు యీ బొగ్గు ఉపయోగపడుతుంది. ఈ కంపెనీని విస్తృత పరచడానికై తలపెట్టబడిన కార్యక్రమంలో 30 లక్షల టన్నుల బొగ్గును ఉత్పత్తిచేయవలెనని సంకల్పించబడింది.

## రసాయన, ఔషధ పరిశ్రమలు

బెల్లంపల్లిలోని హైద్రాబాద్ కెమికల్ అండ్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్ అను కంపెనీ సల్ఫ్యూరిక్ యాసిడ్, హైడ్రోక్లోరిక్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్, పటిక, సూపర్‌ఫాస్ఫేట్, మిశ్రమ ఫెర్టిలైజర్లు, ఎప్సమ్‌సాల్టు మొదలగునవి ఉత్పత్తి చేస్తున్నది. రు. 40 లక్షల విలువగల సరుకు ఇందులో సాలీనా ఉత్పత్తి అవుతున్నది. 200 మంది కార్మికులు ఇందులో పనిచేస్తున్నారు.

## హైద్రాబాదు కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్స్ లిమిటెడ్

ఇందులో మందులు అంటే టించర్లు, సిరప్పులు, స్పిరిట్లు, పౌడర్లు, మలాములు, బిళ్లలు, ఏంప్యూల్సు మొదలగునవి తయారవుతాయి. దీనిలో 100 మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఈథర్ ఉత్పత్తిలో ఈ సంస్థ చాలా నిపుణత గడించింది. దాదాపు రు. 10 లక్షల విలువగల సరుకు ఇక్కడ సాలీనా ఉత్పత్తి అవుతున్నది.

## బయోకెమికల్ - సింథెటిక్ ప్రోడక్ట్స్ లిమిటెడ్

లివర్ ఎక్స్‌ట్రాక్ట్, నాణ్యమైన సింథిటిక్ కెమికల్స్, బయోలాజికల్ మందులు తయారు చేయుటకు యీ కంపెనీ స్థాపించబడింది. ఆధునికమైన అమెరికన్ యంత్రాలు యీ కంపెనీలో అమర్చబడ్డాయి. ప్రస్తుతం యీ సంస్థ ఇంజక్షన్ మందులు, సల్ఫేట్ మందులు తయారుచేస్తున్నది.

## నూనె గింజలు

ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే 169 నూనె మిల్లులు ఉన్నవి. వీటిలో 6 మిల్లులలో 8 కంటె ఎక్కువ ఎక్స్ పెల్లర్లు ఉన్నవి. ఇవి సంవత్సరానికి 2.5 లక్షల టన్నుల నూనెగింజలనుండి నూనె తయారుచేస్తున్నవి.

## నూనె శుద్ధి కర్మాగారము

విశాఖపట్నంలోని నూనె శుద్ధి కర్మాగార నిర్మాణం దాదాపు పూర్తికావచ్చింది. 1957 సంవత్సరారంభంలో ఇక్కడ ఉత్పత్తి ప్రారంభమవుతుంది.

## నౌకా నిర్మాణ పరిశ్రమ

విశాఖపట్నంలోని నౌకానిర్మాణ పరిశ్రమ చాలా ప్రధానమైంది. ఈ పరిశ్రమను నేరుగా కేంద్రప్రభుత్వమే నిర్వహిస్తున్నది.

## స్టీల్ ప్రోసెసింగ్

ఒక్క తెలంగాణా ప్రాతంలోనే సుమారు 40 వరకు స్టీల్ ప్రోసెసింగ్ పరిశ్రమలు నెలకొల్పబడినవి. వీటిలో చాలా భాగం హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలో ఉన్నవి. ఈ పరిశ్రమలలో తయారవుతున్న వస్తువులు :

జి. ఐ. బకెట్లు, ఇనుపగేట్లు, కొక్కెములు, డ్రమ్ములు, ట్రేలు, రాహట్లు, నాగళ్లు, గమాలాలు, బాయిలర్ గొట్టాలు, నీళ్లటాంకులు, బాయిలర్లు, ఉక్కు ఫర్నీచర్, వ్యవసాయ పరికరాలు, చెరకు గానుగిలు వగైరా.

## కుట్టు మిషన్లు, సైకిళ్లు, పంకాలు వగైరా

కుట్టు మిషన్లు (సంవత్సరానికి 2,400) సైకిళ్లు, సైకిల్ భాగాలు, విద్యుచ్ఛక్తి పంకాలు, శాస్త్రీయ సర్వే సామగ్రి, స్టోరేజి బ్యాటరీలు వగైరా వస్తువుల ఉత్పత్తిలో ప్రైవేటు పారిశ్రామికులను ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. తెలుగు, హిందీ, ఇంగ్లీషు టైపు యంత్రాల ఉత్పత్తి విషయమై ఒక ప్రతిపాదన పరిశ్రమలశాఖ ఆలోచనలో ఉన్నది.

## అల్లిక దారాలు

స్వస్తిక్ అల్లిక దారాల ఫ్యాక్టరీ సుమారు 30 రకాల అల్లిక దారాలను ఉత్పత్తి చేస్తున్నది. ఈ దారాలు సింహళానికికూడా ఎగుమతి చేయబడుతున్నవి.

## రేకు వస్తువులు

హైదరాబాదు టిన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ సంస్థవారు పరిశ్రమలలోనూ, గృహాలలోనూ ఉపయోగపడే అనేకరకాల రేకు వస్తువులను ఉత్పత్తి చేస్తున్నారు.

## గంజి

హైదరాబాదు స్టార్చ్ ప్రొడక్ట్సు లిమిటెడ్ సంస్థవారు ధాన్యాలనుంచి గంజి ఉత్పత్తి చేస్తున్నారు. గంజి ఉత్పత్తిలో చింతగింజలను కూడా ఉపయోగించాలని ఈసంస్థ ఉద్దేశిస్తున్నది.

## తోళ్ళతో తయారయ్యే వస్తువులు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తోళ్ళ పరిశ్రమ ఎక్కువగా ఉంది. వరంగలు, ఏలూరు, విజయవాడ పట్టణాలలోనూ ఇంకా ఇతర ప్రాంతాలలోనూ అనేకంగా తోళ్ళను ఊనకం చేసే కార్ఖానాలు పనిచేస్తున్నవి. మేలిరకం పాదరక్షలు, తోళ్ళతో తయారయ్యే ఇతర వస్తువులు ఎక్కువగా ఉత్పత్తి చేయబడుతున్నవి. తోళ్ళను సునుపుచేసి వస్తువులు తయారుచేసే కేంద్రములను ప్రారంభించడానికి చర్యలు తీసుకోబడినవి.

## అగ్గిపెట్టెల పరిశ్రమ

మాజీ సైనికులు, మాజీ మన్సబ్‌దారులు, స్వల్పఆదాయం గల ఇతర తరగతులకు చెందిన కుటుంబాలవారికి సహాయపడే ఉద్దేశంతో రూ. 2.8 లక్షల ఖర్చుతో మూడు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలు స్థాపించబడినవి. అగ్గిపుల్లల ఉత్పత్తిలో 12 వందల మంది స్త్రీలకు శిక్షణ ఇవ్వబడింది. 750 మంది స్త్రీలకు యీ పరిశ్రమలో ఎల్లప్పుడు పని లభిస్తున్నది. ఇంతవరకు రూ. 1,60,000 ల విలువగల అగ్గిపెట్టెల ఉత్పత్తి జరిగింది. రూ. 1,40,000 ల విలువగల అగ్గిపెట్టెలు అమ్ముడుపోయినవి.

త్వరలోనే విజయవాడలో ఒక అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ ఆరంభించబడుతుంది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

అనేక లఘుపరిశ్రమ కేంద్రాలకు షెడ్డులు, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా, రవాణా, మురుగుపారుదలసౌకర్యాలు, రైల్వే సైడింగ్‌సౌకర్యాలు కావలసియున్నవి. అందువల్ల హైదరాబాదు, విశాఖపట్నం, విజయవాడ కేంద్రాలలో మూడు పారిశ్రామిక ఎస్టేట్లు నిర్మించాలని సంకల్పించబడింది. వరంగలు, సామర్లకోట పట్టణాలలో రెండు చిన్న తరహా ఎస్టేట్ల నిర్మాణం కూడా ఆలోచనలో ఉన్నది.

వడ్రంగం, కమ్మరం, కత్తులు వగైరా తయారుచేయుట, గాజులు, ఇండ్లలో పనికివచ్చే ఎలక్ట్రిక్ సామగ్రి, కాచు ఉత్పత్తి, చెక్కపని, బ్రష్‌ల తయారీ, పరికరాలు వగైరా లఘు పరిశ్రమలలో మరికొన్ని ముఖ్యమైనవి.

## చేనేత పరిశ్రమ

ఆంధ్ర రాష్ట్రంలో సుమారు 4 లక్షలకు పైగా చేమగ్గాలు పనిచేస్తున్నవి. చేనేత పారిశ్రామికులలో తెలంగాణాలో 100 కి 90 మంది, ఆంధ్రలో 33 మంది సహకారోద్యమ పరిధిలో పనిచేస్తున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో తయారయ్యే చేనేత వస్త్రాలు చాలా ప్రసిద్ధిజెందినవి. రాష్ట్రంలో అనేక కేంద్రాలలోనూ, మద్రాసు, బొంబాయి, ఢిల్లీ మొదలైన రాష్ట్రేతర కేంద్రాలలోనూ చేనేత వస్త్రాల విక్రయశాలలు నెలకొల్పబడినవి. కలకత్తాలో ఒక విక్రయశాల తెరువాలని తలపెట్టబడింది.

ఆంధ్ర ప్రదేశ్‌లో 14 వేల ఉన్నిమగ్గాలు పనిచేస్తున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో భారతదేశం మొత్తంమీద అదికసంఖ్యలో ఉన్ని, ప్రత్తి మగ్గాలు పనిచేస్తున్నవి. దూది, ఉన్ని, సిల్కు, చేనేత వస్త్రాల అభివృద్ధికి చాలా అవకాశమున్నది.

## పట్టు పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్‌లో పట్టు పరిశ్రమ అభివృద్ధి చేయబడుతున్నది. ఆంధ్రలో మడకసిర, హిందూపురం, పలమనేరు తాలూకాలు, తెలంగాణా ప్రాంతంలోని నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలు పట్టుపరిశ్రమకు బాగా తగివున్నాయి. మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలలో కూడా ఈ పరిశ్రమకు మంచి అవకాశాలున్నవి. ములుగ్, మంథని, మహదేవపురాల అరణ్యప్రాంతాలలో టస్సరీ పరిశ్రమ వుంది.

## కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలో గ్రామీణ కళలు చేతివృత్తులు, పరిశ్రమల కేంద్రాలు

ఆంధ్ర ప్రదేశ్‌లో 41 సామాజికాభివృద్ధి, 65 జాతీయ వికాస సేవా కేంద్రాలు వున్నాయి. గ్రామీణ కళలు, చేతివృత్తుల కేంద్రాలను స్థాపించి, కుటీర పరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన వివిధ ప్రణాళికలను ప్రవేశపెట్టడం ద్వారా యీ ప్రాంతాలలో చిన్న పరిశ్రమలు, కుటీర పరిశ్రమల అభివృద్ధికి గట్టికృషి జరుపబడుతున్నది. ములుగ్, సామర్లకోటలలో రెండు పైలట్ స్కీములు అమలు జరుగుతున్నాయి. ములుగ్ కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతంలో టస్సార్ సిల్కు పరిశ్రమాభివృద్ధికి చక్కని అవకాశాలున్నాయి.

## రెండవ పంచవర్ష ప్రణాళిక

ఆంధ్ర ప్రదేశ్‌లో పరిశ్రమాభివృద్ధికి చాలా అవకాశమున్నందున, పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వం సమగ్రమైన ఒక పథకాన్ని తయారుచేసింది. దీనిలో పబ్లిక్, ప్రైవేటు రంగాలకు, భారీ, లఘు పరిశ్రమలకూ కూడా స్థానమున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలకు చేయబడిన కేటాయింపుల వివరాలు దిగువ యివ్వబడినవి:-

### ఆంధ్ర ప్రాంతం

| | |
|---|---|
| భారీ, మధ్యరకం పరిశ్రమలు | రూ. 2,12,95,000 |
| చిన్న పరిశ్రమలు - శేషించిన పనిని కొనసాగించే పథకం | 63,23,000 |
| చిన్న పరిశ్రమలు - క్రొత్త ప్రణాళికలు | 70,63,000 |
| కుటీర, గ్రామ పరిశ్రమలు | 85,10,000 |
| పట్టు పరిశ్రమ | 10,50,000 |
| మిగిలిపోయిన ప్రణాళికలు (కేటాయింపులు తొలి సంవత్సరానికి మాత్రమే) | 1,83,000 |
| సహకార చక్కెర ఫ్యాక్టరీ | 60,77,000 |
| సహకార నూలు మిల్లులు తాడిపత్రి, గుంతకల్లు | 25,00,000 |
| చేనేత అభివృద్ధి పథకములు | 2,92,42,000 |
| పారిశ్రామిక సహకార సంఘాలు | 15,94,000 |
| తాటిబెల్లం అభివృద్ధి | 12,43,000 |
| మొత్తం | 9,50,80,000 |

### తెలంగాణా

*1. (ఎ) చేనేత పరిశ్రమ :*

| | రూ. లక్షలలో |
|---|---|
| 1. శేషించిన పనిని కొనసాగించే పథకం | 2.00 |
| 2. క్రొత్త పథకాలు | 101.80 |

(బి) ఉన్ని :

| | |
|---|---|
| 1. శేషించిన పనిని కొనసాగించే పథకం | 0.20 |
| 2. క్రొత్త పథకాలు | 19.71 |

(సి) పట్టు :

| | |
|---|---|
| కొత్త పథకాలు | 8.09 |

**2.** చిన్నపరిశ్రమలు :

| | |
|---|---|
| 1. శేషించిన పనిని కొనసాగించే పథకం | 54.93 |
| 2. క్రొత్త పథకాలు | 77.23 |
| **3.** గ్రామ పరిశ్రమలు : | 84.98 |

**4.** చేతి పనులు :

| | |
|---|---|
| 1. శేషించిన పనిని కొనసాగించే పథకం | 1.23 |
| 2. క్రొత్త పథకాలు | 20.43 |
| **5.** పట్టు పరిశ్రమ పథకాలు | 8.88 |
| **6.** ఇతర పథకాలు, శిక్షణ మున్నగునవి | 5.53 |
| రూ. | 385.10 |

## కేంద్ర ప్రభుత్వపు కేటాయింపుక్రింది పథకాలు

| | |
|---|---|
| 1. సింగరేణి బొగ్గుగనుల విస్తరణ | 9 కోట్లు |
| 2. ప్రాగాటూల్సు (పనిముట్లు) కార్పొరేషన్ విస్తరణ | 75 లక్షలు |
| 3. సహకార చక్కెరమిల్లు | 20 ,, |
| 4. సహకార నూలుమిల్లు (చేనేత సెస్సు నిధి నుంచి ఖర్చు పెట్టబడుతుంది) | 20 ,, |
| 5. చర్మకార పరిశ్రమ | 10 ,, |
| రూ. | 10.25 కోట్లు |

పైన సూచించబడిన కేటాయింపులనుంచి ఆంధ్ర ప్రదేశ్‌లో పారిశ్రామిక కార్యక్రమాలకు మొత్తం రూ. 23.60 కోట్లు దిగువవిధంగా లభించ గలవు :

| | |
|---|---|
| 1. ఆంధ్ర ప్రాంతానికి మొత్తం కేటాయింపు | 9. 5 కోట్లు |
| 2. గ్రామీణ చిన్న పరిశ్రమలు (తెలంగాణ) | 3.85 ,, |
| 3. కేంద్ర ప్రభుత్వ కేటాయింపుల క్రింది ప్రణాళికలు (తెలంగాణా) | 10.25 ,, |
| మొత్తం | 23.60 కోట్లు |

పై కేటాయింపులలో విశాఖపట్నంలోని హిందూస్థాన్ నౌకా నిర్మాణ కేంద్రం అభివృద్ధి కార్యక్రమం లేదు. ఇది దేశంలో నౌకా నిర్మాణానికిగల ఏకైక కేంద్రం, ద్వితీయ ప్రణాళికలో దీనికి చేయబడిన మొత్తం కేటాయింపు వివరాలు దిగువ యివ్వబడినవి :

| | రూ. లక్షలలో |
|---|---|
| 1. తొలి ప్రణాళికలో మిగిలిన ఖర్చు | 55.0 |
| 2. 1956-57 లో సింధియా కంపెనీ వారికి చెల్లించవలసిన ఆఖరి వాయిదా | 33.8 |
| 3. నౌకా నిర్మాణ కేంద్రంలో నిర్మించబడిన నౌకల నిర్మాణపు సబ్సిడీ | 500.0 |
| 4. 8 మొదలు 12 నౌకల నిర్మాణాని కనువుగా నౌకా నిర్మాణ కేంద్రాన్ని మరి కొంత విస్తృత పరచడం - | 100.0 |
| 5. డ్రైడాక్ నిర్మాణం | 214.0 |
| రూ. | 902.8 |



### ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

**తెలుసుకోవలసిన విషయాలు**

1. ఆంధ్రప్రదేశ్‌లో చాలా హెచ్చు జనాభా గల నాలుగు జిల్లా లేవి ?
2. ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు పెద్ద జిల్లాలేవి ?
3. ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని గ్రామా లున్నవి ?
4. ఆంధ్రప్రదేశ్‌లో పట్టణాలు, నగరాలు ఎన్ని ఉన్నవి ?
5. ఆంధ్రప్రదేశ్ గ్రామీణ జనాభా ఎంత ?
6. ఆంధ్రప్రదేశ్ పట్టణాల జనాభా ఎంత ?

**జవాబులు 76 వ పేజీలో**

# తెలంగాణాలో నీటిపారుదల



తెలంగాణా ప్రాంతంలో మొత్తం సుమారు 105 లక్షల యెకరాలు సాగుక్రింద వున్నాయి. తొలి పంచవర్ష ప్రణాళిక ఆరంభం నాటికి దీనిలో 14.50 లక్షల యెకరాలకు నీటిపారుదల సౌకర్యంవుంది. ఇప్పుడు చేపట్టబడిన ప్రణాళికలు పూర్తిఅయిన తరువాత అదనంగా మరి 32 లక్షల యెకరాలకి యీ సౌకర్యం లభిస్తుంది. దానితో మొత్తం 46.50 లక్షల యెకరాలకి నీటిపారుదల సౌకర్యం వుంటుంది.

తెలంగాణా ప్రాంతంలో మొత్తం 33,000 చెరువులు, 17 భారీ, మధ్యరకం సాగునీటి ప్రాజెక్టులు వున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన నాగార్జునసాగర్ ప్రాజెక్టు తెలంగాణాలో 8 లక్షల యెకరాలకు సాగునీటిని అందిస్తుంది. ఇది కాక ప్రణాళికలో 11 మధ్యరకం ప్రాజెక్టులు చేర్చబడినవి. ఇవి 54,660 యెకరాలకి సాగునీటిని అందిస్తాయి. ద్వితీయ పంచర్ష ప్రణాళిక కాలంలో, గండ్లుపడిపోయిన 1,200 చెరువుల మరమ్మతు చేపట్టబడగలదు. వాటిక్రిందగల మొత్తం ఆయకట్టు 75,000 యెకరాలు.

అయితే యిప్పుడు అందరి దృష్టి బహుళార్థ ప్రయోజనకారియైన గోదావరి ప్రాజెక్టుపై వుంది. దీనిక్రింద యించుమించు 17 లక్షల యెకరాలకి సాగునీరు లభించడమే కాక విద్యుచ్ఛక్తికూడా ఉత్పత్తి కాగలదు. మరొక 30 ప్రాజెక్టులు పరిశీలనలో వున్నాయి. వీటి ఖర్చు 10 కోట్ల రూపాయలు. ఇవి 2.67 లక్షల యెకరాలకి సాగునీటిని అందించవచ్చును.

తెలంగాణా భూమి నల్లరాతి ప్రదేశం. అది క్షార లక్షణం కలది. కొండలలో యేమీ పెరగవు. కాని మైదానాలలో అన్నిరకాల పొదలు, చిన్నచెట్లు పెరుగుతాయి. ఎర్రమన్ను, యిసుక కలసిననేల నీటిని పీల్చుకునే స్వభావం కలది. అందుచేత యిది తీవ్రసాగుకి మిక్కిలి అనువైన ప్రదేశం.

ఋతు పవనాలవల్ల కురిసే వర్షం సంవత్సరం పొడుగునా కురిసే వర్షంలో 90 శాతం వుంటుంది. ఇది జూనునుంచి అక్టోబరు వరకూ కురుస్తుంది. అయితే యిది అన్ని ప్రాంతాలలోనూ సమానంగా వుండదు. దట్టమైన అరణ్యాలున్న ప్రాంతాలలో వర్షపాతం 35-45 అంగుళాలుంటుంది. మిగిలిన ప్రదేశాలలో సాలీనా సరాసరిని 25-35 అంగుళాలు వుంటుంది.

గోదావరి, కృష్ణా నదులు పశ్చిమాన్నుండి తూర్పుకి ప్రవహిస్తున్నాయి. ఈ మహానదుల వుపనదులు పెద్దవి చిన్నవీ కూడా మొత్తం యీ ప్రదేశాన్నంతటినీచుట్టి ప్రవహిస్తున్నాయి. అనేకమైన నదులు, వాగులలో ప్రవహిస్తున్న నీటిని నిలువచేసి సాగు ప్రయోజనాలకు వుపయోగించాలన్న ముఖ్య విషయం చాల కాలం క్రిందటనే గుర్తించబడినట్టు కనబడుతుంది. తత్ఫలితంగానే యీ ప్రాంతంలో యెక్కడ చూసినా చిన్న చిన్న చెరువులు, మానవ నిర్మితమైన సరస్సులు కనబడుతాయి. ఇవి ప్రజల ప్రధానాహారమైన వరిని పండించడానికితోడ్పడతాయి. చెరువులు చిన్నా, పెద్దాకలుపుకుని మొత్తం 33,000 కి తక్కువకాకుండా వున్నాయి. మానవ నిర్మితమైన పెద్ద సరస్సులు కొన్ని వున్నాయి. పాఖాల, రామప్ప, లక్నవరం, షానగరం, ఘనపూర్ సరస్సులు వాటిలో యెన్నదగినవి. ఇవి క్రీస్తుశకం 13 వ శతాబ్దంలో కాకతీయ రాజులచే నిర్మించ బడినవని చెబుతారు. కాని కాలక్రమేణా వీటిలో చాలభాగం మరమ్మతులు లేక పాడైపోయాయి. ఈ విధంగా వీటికి విస్తృతమైన మరమ్మతు అవసరమైనది. కొన్ని సందర్భాలలో పూర్తి పునరుద్ధరణ అవసరమైనది. ఈ పనిని అజమాయిషీ చేయవలసిన అవసరం కూడా యేర్పడింది. 1896 లో ఒక నీటిపారుదలశాఖ ఏర్పాటు

చేయబడింది. దానిముఖ్యకార్యాలయం హైద్రాబాదులో వుండేది. అదిఒక ఛీఫ్ఇంజనీరు ఆధిపత్యంలోవుండేది. అతడు పాత సాగునీటి వనరుల మరమ్మతు, పునరుద్ధరణ పనులను చూసేవాడు. అంతేకాక కొత్తగా జలాశయాలను కట్టించడం, పాత, కొత్త నీటివనరుల నిర్వహణ బాధ్యతనుకూడా అతడు వహించేవాడు.

ఈ సందర్భంలో తొలిచర్యగా లక్నవరం, పాఖాల, రామప్ప వగైరా ప్రాచీన సరస్సులను పునరుద్ధరించడం జరిగింది. వీటిక్రింద మొత్తం 29,673 యెకరాలు సాగులోనికి వచ్చాయి. అదే సమయంలో వేలాది చిన్నచిన్న చెరువులు మరమ్మతు చేయబడి, నూనుగాలు స్థాయిగ కొనిరాబడినవి.

మొత్తం 33,000 చెరువులలోనూ యించుమించు 12,438 చెరువులకి ఒక్కొక్క దానిక్రింద సాగయే భూమి 10 యెకరాలకులోపు వుంటుంది. 19,589 చెరువుల విషయంలో అది 10-200 యెకరాల మధ్య వుంటుంది. మిగిలిన చెరువులు యించుమించు 11,000 విషయంలోను అది 200 యెకరాలకి పైన వుంటుంది. 10 యెకరాలలోపు ఆయకట్టుగల చెరువుల నిర్వహణకు సంబంధించిన పనిని రెవిన్యూశాఖ తోడ్పాటుతో స్వయంగా రైతులే చూసుకుంటారు. 10 యెకరాలకు మించిన ఆయకట్టుగల చెరువుల మరమ్మతులు వగైరా విషయాలను నీటి పారుదలశాఖ చూస్తుంది. అయితే అది 50 యెకరాలకి మించిన ఆయకట్టుగల చెరువులనే క్రమం తప్పకుండా నిర్వహిస్తుంది. ఈచెరువులు చిన్నవికావడంవల్ల తరుచుగా వచ్చేవరదలకు తట్టుకోలేక గండిపడుతూ వుంటాయి. అందుచేతవీటి మరమ్మతులు యెప్పుడూ అవసరమవుతూనేవుంటాయి.

నీటిపారుదలశాఖ పాతవనరుల్ని బాగుచేయించడంతోపాటు పెద్దప్రవాహాలకి జలాశయాల్నికూడా నిర్మిస్తున్నది. ఈ విధంగా పెక్కు భారీ, మధ్యరకం జలాశయాలు నిర్మించ బడినవి. నిజాంసాగర్, పోచారం, పాలేరు, వైరా, పెండ్లిపాకాల, మానేరు, దిండి, సింగభూపాలం, బేతిపల్లి వగైరా జలాశయాలు వాటిలో ప్రధానమైనవి. నిజామాబాదు జిల్లాలోని మంజీరానదిపై నిర్మించిన నిజాంసాగర్ప్రాజెక్టు వీటన్నిటిలోనూ మిక్కిలి పెద్దది.

మూసీనది హైదరాబాదు నగరంగుండా ప్రవహిస్తున్నది. 1908 లో దానికి అసాధారణమైన వరద వచ్చింది. ఆసందర్భంలో ప్రాణధనాలకు అపారమైన నష్టం కలిగింది. ముందుముందు అట్టి వరదలవల్ల ప్రజలకి నష్టం కలుగకుండా నివారించడానికై ఆనది ప్రధాన శాఖలు రెండిటిపై రెండు జలాశయాలు - వుస్మాన్ సాగర్, హిమాయత్సాగర్ నిర్మించబడ్డాయి. ఈ జలాశయాలలో నీటిని ప్రజల నీటిసప్లయికి వినియోగించాలని మొదట వుద్దేశించబడింది. కాని జనాభా శీఘ్రగతిని అభివృద్ధి చెందడంవల్ల యిప్పుడవి ప్రధానంగా హైద్రాబాధు, సికిందరాబాదు నగరాలకి నీటి సప్లయి నిమిత్తమే వుపయోగింపబడుతున్నాయి.

## తొలి పంచవర్షప్రణాళిక

ఇంత చేసినప్పటికీ తెలంగాణా ప్రాంతంలో నీటి పారుదల సౌకర్యంగల భూమి చాల తక్కువగావుంది. ఈ శతాబ్దం పూర్వార్థం పూర్తయేసరికి సాగయ్యే మొత్తం భూమిలో 13.7 శాతానికి మాత్రమే నీటిపారుదల లభిస్తున్నది. ఇంతవరకూ నీటిపారుదల అభివృద్ధికై చిన్న చిన్న వాగులు నదులు మాత్రమే వుపయోగించుకొన బడుతున్నాయి. పెద్దనదులైన కృష్ణా గోదావరుల జలాలు యించుమించు వృధాగా పోతున్నాయి. అందుచేత యిప్పుడు దృష్టి వాటివైపు మళ్ళించబడింది.

తుంగభద్రానది మొట్టమొదట వుపయోగంలోనికి తేబడింది. రాజోలిబండ గ్రామం సమీపానగల ఆనకట్టనుంచి త్రవ్వబడగల 65 మైళ్ళ పొడవుగల కాలువ క్రింద అలంపురం, గద్వాల తాలూకాలలో రమారమి 99,000 యెకరాలు సాగుకాగలవు. రాజోలిబండ మళ్ళింపు స్కీము అనే యీ ప్రాజెక్టు 1948 లో ఆరంభింపబడింది. కాలువపని చాలాభాగం పూర్తయింది. 1957 నుంచి నీటిపారుదల ఆరంభం కావచ్చునని భావించబడుతున్నది.

ఆదిలాబాదు జిల్లాలోని కుష్టపురం గ్రామానికి సమీపంలో గోదావరిపై పెద్ద జలాశయం నిర్మించాలని సంకల్పించబడింది. ఈ జలాశయం నార్తుబ్యాంకు కెనాలును బాలన్సింగు రిజర్వాయరుద్వారా కదం ప్రవాహంమీదుగా తీసుకుని వెళ్ళడానికి సంకల్పించబడింది. కదం గోదావరి వుపనది. ఈ ప్రణాళిక అమలులో తొలిచర్యగా, కదంపైన బాలన్సింగు రిజర్వాయరు, దానికి అవతల ప్రధానకాలువా నిర్మించబడు

తున్నాయి. ఈ కాలువ 48 మైళ్ళ పొడుగున మాత్రమే నిర్మించబడుతుంది. కదం ప్రవాహం నీటితో మాత్రమే 50,000 యెకరాలకు నీటిపారుదల లభింపచేయడానికి అవకాశముంటుంది. కదం ఆనకట్ట, కాలువ నిర్మాణం పూర్తికావస్తున్నది. 1000 యెకరాలపరకూ గల భూమికి సాగునీరుకూడా లభించింది.

పైన చెప్పిన పెద్ద ప్రాజెక్టులు రెండూకాక చిన్న ప్రవాహాలపై కొన్ని మధ్యరకం ప్రాజెక్టులుకూడా చేపట్టబడినవి. అటువంటి ప్రాజెక్టులు 5 రాష్ట్ర తొలి పంచవర్షప్రణాళికలో చేర్చబడినవి. వాటి మొత్తం ఖర్చు రూ. 246.64 లక్షలు. వాటిక్రింద సాగుకాగల భూమి 63,660 యెకరాలు. అవియివి: కోయిల్‌సాగర్, సరళాసాగర్, భీమనిపల్లి, మూసీ, సీరాల. వీటిలో కోయిల్‌సాగర్, భీమనిపల్లి పూర్తి అయినవి. మిగిలిన మూడింటిపని జరుగుతున్నది.

చెరువుల విషయంలో, తొలి పంచవర్ష ప్రణాళిక ఆరంభంనాటికి మొత్తం 2.30 లక్షల యెకరాల ఆయకట్టుగల 3,700 చెరువులు గండిపడి వున్నాయి. వీటిలో 1,927 చెరువులు మరమ్మతు చేయబడుతున్నాయి. వీటి మొత్తం ఆయకట్టు 1.55 లక్షల యెకరాలు. వీటి మరమ్మతుకయే ఖర్చు రూ 147.78 లక్షలు. ఈ పనులు యిప్పుడు జరుగుతున్నాయి.

ఈప్రాంతంలోసమాజాభివృద్ధి, జాతీయవికాస సేవా కేంద్రాలలో కూడా క్రమేణా చక్కని కృషి జరుగుతున్నది. ఈ కేంద్రాలలో జరిగే కృషిలో చిన్న చెరువుల పునరుద్ధరణ, చిన్న ఆనకట్టల నిర్మాణంవంటి పనులు కూడా కొనసాగు తున్నాయి.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

సమీప భవిష్యత్తులో యింకా యెక్కువ నీటి పారుదల పనులను చిన్నవీ, పెద్దవీకూడా చేపట్టాలని సంకల్పించబడింది. వీటిలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు, 11 మధ్యరకం, 6 చిన్నరకం ప్రాజెక్టులువున్నాయి. ఇవి తెలంగాణాలో వేర్వేరు ప్రాంతాలలో వున్నాయి. ఇవి ఆమోదింపబడిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడ్డాయి.

నల్గొండ జిల్లాలోని నందికొండ సమీపంలో కృష్ణానదిపై నిర్మించబడే నాగార్జునసాగర్ ఆనకట్ట క్రింద మొత్తంమీద 28.58 లక్షలయెకరాలు సాగుకాగలవని భావించబడుతున్నది. ఈ ఆనకట్ట కిరువైపులా రెండు పెద్దకాలువలుంటాయి. వీటితో తెలంగాణాప్రాంతంలో 7.95 లక్షల యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

మిగిలిన ప్రాజెక్టుల సందర్భంలో, 11 మధ్యరకం, 6 చిన్నరకం ప్రాజెక్టుల నిర్మాణానికై ఒక సమగ్ర పథకం తలపెట్ట బడింది. వీటి మొత్తం ఖర్చు రూ 233.15 లక్షలు. మొత్తం ఆయకట్టు 54 660 యెకరాలు. ఇది ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద తలపెట్ట బడింది.

ఇవిగాక 1247 గండిపడిన చెరువుల మరమ్మతు కూడా రూ 106.13 లక్షల ఖర్చుపై ద్వితీయ ప్రణాళికలో చేర్చబడింది. వీటి ఆయకట్టు 75,065 యెకరాలు.

## భావి కార్యక్రమం

భవిష్యత్తులో తలపెట్టబడిన భారీ ప్రాజెక్టులలో బహుళార్థ సాధకమైన గోదావరి ప్రాజెక్టు పేర్కొనదగినది. ఆదిలాబాదు, కరీంనగరం జిల్లాల సరిహద్దులో గోదావరిపై నిర్మించబడగల యీ ప్రాజెక్టు విషయంలో పరిశీలనలు చాలాభాగం పూర్తి అయాయి. దీనిని తృతీయ ప్రణాళికలో చేర్చాలని సంకల్పించబడింది. దీని అంచనా ఖర్చు రూ 67.35 కోట్లు. దీని వల్ల 16.70 లక్షల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది. అంతేగాక ముందుముందు యీ భారీ ప్రాజెక్టులతోపాటు 25 మధ్యరకం, 6 చిన్నరకం ప్రాజెక్టులను చేపట్టడానికి అవకాశాలున్నాయి. వీటిలో కొన్నిటి విషయంలో అప్పుడే పరిశీలనలు, అంచనాలు పూర్తి అయాయి. మిగలినవి పరిశీలింప బడుతున్నాయి. వీటి అంచనా ఖర్చు యించుమించు 10.46 కోట్లు. వీటిక్రింద 2.67 లక్షల యెకరాలు సాగు కాగలవు.

తెలంగాణాలో మొత్తం 105.06 లక్షల యెకరాల భూమి సాగుక్రిందవుంది. అందులో 14.50 యెకరాలకి నీటి పారుదల వుంది. ఇది మొత్తం సాగయే భూమిలో 13.7 శాతము. ఇప్పుడు అమలు జరుగుతున్న ప్రణాళికలు పూర్తి అయిన తరువాత అదనంగా మరి 31.92 లక్షల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది.

ఇంతటితో తెలంగాణాలోని సాగునీటి వనరులన్నీ ఆఖరు కాలేదు. ఈ ప్రదేశంలో యింకా యెన్నో నదులు ప్రవహిస్తున్నాయి. ముందుముందు వాటిని వుపయోగించుకోడానికి తగినంత అవకాశం వుంది. ★

# బాల నేరముల నివారణ

—○—

— శ్రీ సింగులూరి మోహనరావు

బాల్యంలో నేరాలు చేసేవాళ్ళపట్ల ఎటువంటి వైఖరి అవలంబించాలి, వాళ్ళనేరాలని ఎల్లా అరికట్టాలి? ఎల్లా నివారించాలి....? దోషాలకి పాల్పడే బాలకుల విద్ధూరమైన చిత్తవృత్తిని సరిదిద్ది సక్రమమైన మార్గాలలో నడిపించడానికి మనం ఎటువంటి పద్ధతులలో పని చెయ్యాలి. ఈ విషయాలని గురించి సభ్య ప్రపంచం నేడు తీవ్రంగా ఆలోచిస్తున్నది. అనాదినుంచీ యుక్త వయస్కులైన నేరస్తులను సంస్కరించే మార్గాలను గురించి ఆలోచనా, అన్వేషణా కొనసాగుతూనేయున్నవి. క్రమబద్ధమైన ఆర్థిక వ్యవస్థా నిర్మాణమూ, అభ్యుదయ పథకములూ సమాజములో సర్వతోముఖమైన అభివృద్ధికి తప్పక దోహదము చేయగలవు. కాని తన భద్రతకోసం తన నిలకడకోసం సమాజం నిర్మించిన శాసనాలను, సృష్టించిన సాంప్రదాయాలనుఉల్లంఘించే మనస్తత్వం కల మనుష్యులు ఎప్పుడూ వుంటూనే వుంటారు. శాసనధిక్కారం కొందరికి జన్మతోవచ్చే సహజ లక్షణం. ఈ విశృంఖలమైన మానసిక వైఖరి అనాగరిక సమాజాలలోనూ అపరి పక్వమైన బాల్య హృదయాలలోనూ ప్రతేక్యంగా కనబడుతుంది. ఇటువంటి వాళ్ళు సమాజానికి ప్రమాదహేతువులుగా పరిణ మిస్తారు.

శాసనాలను అతిక్రమించడం లోకంలో మొదటి నుంచీ వుండనే వుంది. ఈ ప్రవృత్తి లోకంతోపాటే పుట్టింది. కాని శాసనాలను అతిక్రమించిన దోషులను శిక్షించి సంస్కరించే విధానాలు కాలక్రమేణా పరిణామం పొందుతూ వస్తున్నయ్. తరచు జరిగే నేరాలనుబట్టి, అప్పటి సభ్యతాస్థాయినిబట్టి సమాజం దోషులపట్ల వహించే వైఖరి నిర్ణయం అవుతుంది. సమాజం శాసనభంజకుల యెడ చూపుతున్న దృక్పథం మానవ నాగరికతతో పాటుగా విశాలమవుతూ వున్నది. శాసన ధిక్కారాన్ని అరికట్టడానికి జరుగుతున్న ప్రయత్నాలుకూడ విపులమైన ప్రణాళికల ఆధారంతో కొత్తదారులు త్రొక్కుతున్నవి. ఇందులో బాల్యంలో నేరాలు చేసినవాళ్ళని సన్మార్గంలోకి ఆకర్షించటానికి జరుగుతున్న యత్నాలు ఎన్నదగినవి.

కవీశ్వరులు తమ కావ్యాల్లో శిశువుల అమాయకత్వాన్ని పవిత్రతనీ స్వచ్ఛతనీ ముక్తకంఠాలతో ప్రస్తుతించటం వింటూవుంటాం. వాస్తవ ప్రపంచంలో అనుకూల వాతావరణానికి దూరమైన శిశువుల చిత్తవృత్తులలో కవులు పేర్కొనే దివ్యాంశలు మనకి కనిపించవు. తల్లిదండ్రులు లేక ఆరోగ్యప్రదమైన ఆనందమయమైన కుటుంబ వాతావరణం లేక గాలికి పెరిగే దిక్కులేని నిర్భాగ్యులగు శిశువులు ఎన్నో దుష్కార్యాలకి పూనుకోవటం నిత్యమూ చూస్తున్నాం. తల్లి దండ్రుల భయము, ఇతరులు దండిస్తారనే భీతి లేకుండా విచ్చల విడిగా పెరిగే పిల్లలు ఇతరులతో గిల్లి కజ్జాలు పెట్టుకోటం, గిల్లటం, కొరకటం, ఇంకొంచెం పెద్దవాళ్ళయాక దొంగతనాలు, మోసాలు, చేయటం మనం నిత్య జీవితంలో చూస్తున్నాం. దీనికి కారణం లేకపోలేదు. ఆలనా, పాలనా లేని అనాథ బాలుడు ఆత్మరక్షణకోసం ప్రయత్నం చేస్తాడు. క్రమంగా ఈ ప్రయ్నతం ఇతరులమీద చేసే జబర్దస్తీ విధానంగా తుంటరి తనంగా వెర్రితలలు వేస్తుంది. ఇటువంటి దిక్కులేని పిల్లల నడవడికొన్ని హద్దుల మధ్య శాసనాలతో గిరిగీసి అట్టేపెట్టకపోతే వాళ్ళు సమాజానికి ఉపద్రవ కారకులుగా తయారవుతారు.

పిల్లలు చేసిననేరాలు, పోనీ పాపం....చిన్నవాళ్ళు. అభమూ, శుభమూ తెలియనివాళ్ళు అనే జాలితో చాల మంది ఉపేక్ష చేస్తారు. నేరస్తుల లేత వయస్సుని

చూచి జాలిపడి దండించకుండా విడిచి పెట్టటం సహజమే. అవే దోషాలు పెద్దవాళ్ళుచేస్తే వూరుకోం. నేరస్థుల్ని మన్నించి వదిలివెయ్యం. వాళ్ళ నేరాలను నివారించే ఉపాయాలు, శిక్షించే శాసనాలు ఎన్నో వున్నాయి. నాగరికతతోపాటు మానవహృదయం విశాలమవుతున్నకొద్దీ.... అతని శిక్షాస్మృతులలోనూ, అతని దండనా విధానాలలోనూ మార్పువచ్చి కాఠిన్యానికి బదులు కారుణ్యం మార్దవం ప్రముఖస్థానాన్ని సంపాదించినయ్. పూర్వకాలంలో దొంగతనం చేసిన వాడి చెయ్యి నరికివెయ్యమని శాసనం గొంతెత్తి చెప్పేది. కొన్ని నేరాలకి తల నరికివెయ్యటం పరిపాటుగా వుండేది. కాలం మారింది. దృక్పథం మారింది. పద్ధతులు మారుతున్నాయి. మానసిక శాస్త్రపరిశోధనవల్ల ఎన్నో సత్యాలు కనుగొన్నాం. ఆ సత్యాల సాయంతో నేరస్థుడి బుద్ధిలోని వంకరలు సరిచెయ్యటానికి చిక్కుముడిని విడదీయడానికి యీనాటి శాసనాలు హృదయ పూర్వకమైన ప్రయత్నం చేస్తున్నవి. దోషిని సంస్కరించడానికి దోషాలని నిరోధించటానికి యీనాడు అన్నిదేశాల్లోనూ శాస్త్రీయమైన కరుణాప్రేరితమైన కృషి సాగుతున్నది.

బాలనేరస్థుల చిత్తవృత్తులను సక్రమమార్గంలో నడిపించుటకు, చెడుదారులలో పడకుండచేయుటకుఆధునిక మనస్తత్వ శాస్త్రము ఎనలేని సాయము చేయుచున్నది. నేరములు చేయు బాలకుల సహజమనస్తత్వముతో పాటు వారి గృహవాతావరణము, విపరీత పరిస్థితులు, ఆకర్షణలేని విద్యాప్రణాళికలు, భావనాశక్తి లేని ఉపాధ్యాయవర్గము, సానుభూతిలేని సహాధ్యాయుల బృందము, వ్యర్థముచేయు తీరికసమయము, బాలకులను నేరములకు పురికొలుపునను విషయము ఈనాడు బాగుగ గుర్తించుచున్నాము. అందరి శిశువులకు ఒకే విద్యావిధానము సహాయకారి కాజాలదు. పిల్లల రకరకాల మనస్తత్వాలను పరిశీలించి వారి చిత్తవృత్తుల లోని విపరీత ధోరణులను గుర్తించి ఎవరికి కావలసిన విద్య వారికి అందించి అవకాశము ఇచ్చినచో నేటి విద్యావిధానము సఫలము కాగలదు. అందువల్ల నేరము పట్ల మొగ్గుచూపెడి చిత్తవృత్తిగల శిశువులకు అనుకూలమైన అవసరమైన విద్యను సాధారణ విధానము అందించుటకు సమర్థము కాదు. పిల్లల స్వభావము లోని ప్రత్యేకతను బోధకులు గుర్తించి తగినట్లు బోధనా విధానమును మార్చుటకు అవకాశము లేదు. అన్ని రోగములకు ఒకే ఔషధము గుణము యివ్వ లేదు. అందరి పిల్లలకు ఉమ్మడిగా ఒకే రకమైన అభిరుచులకు ప్రోత్సాహము లభించుట లేదు. అందు చేత చదువు మీద పిల్లలకు ఏవగింపు కలుగును. తమ సహజమైన అభిరుచులను తృప్తిపరచు పద్ధతులను పిల్లలు అన్వేషిస్తారు. ఈ అన్వేషణ నిర్దిష్టమైన మార్గాలలో కొనసాగకపోతే ఈ అన్వేషణకు సరియైన లక్ష్యం లేకపోతే పిల్లలు యిష్టం వచ్చిన, మనస్సుకు నచ్చిన దారులు తొక్కి చివరికి నేరస్థులుగా తయారవుతారు. ఒక ఉదాహరణ చూపిస్తాను. ఒక బాలుడికి లెక్కలుఅంటే ఇష్టంవుండదు. ఈ వైముఖ్యాన్ని పోగొట్టటానికి ఉపాధ్యాయులు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుని ఆ కుర్రవాడికి లెక్కలలో ఆసక్తికలిగించాలి. లేకపోతే ఆ కుర్రాడు తను కష్టపడకుండా పక్కవాళ్ళ పుస్తకాల్లో కాపీచేసి లెక్కకి జవాబు వేసేస్తాడు. ఇంకొక ఉదాహరణ తీసుకుందాం. ఒక కుర్రాడికి బొమ్మలు వేయటమంటే చాల ఇష్టం. కాని వాడికి పెన్సిలుకాని, రంగుల పెట్టెకాని పెద్దవాళ్లు కొని యివ్వకపోతే తోటివాళ్ళ పెన్సిళ్లు, రంగులు దొంగిలించి తన అభిరుచిని తృప్తి పరచుకొనే తేలికమార్గాన్ని అన్వేషిస్తాడు.

సహజమైన అభిరుచులను తృప్తి పరచుకొనే అవకాశము లేకపోతే పిల్లల మనస్సుల్లో నిరుత్సాహము పెంపొందుతుంది. వాళ్ళ అభివృద్ధికి అవసరమైన అవకాశాలు అందకపోతే పిల్లల మనస్సులు నిరాశతో నిస్పృహతో బాధపడి ఇటువంటి ప్రతికూల వాతావరణంలోకి మగ్గిపోయి చివరికి నేరస్థులుగా తయారవటము జరుగుతుంది. కనుక పిల్లల సర్వతోముఖ వికాసానికి అవసరమైన వాతావరణాన్ని కల్పించగల్గినప్పుడే వాళ్ళ మనస్సులను నేరాలవైపుకు మొగ్గకుండా అరికట్ట గలము. నేర ప్రవృత్తికి దోహదం చేసే పరిస్థితులను నిర్మూలించినప్పుడే బాల హృదయాలు ఆరోగ్యకరమైన ఆనంద మయమైన వాతావరణంలో వికాసాన్ని పొందగలవు.

బాల నేరస్థులను సంస్కరించే యత్నంలో పోలీసు శాఖ, వైద్యశాఖ, పిల్లల కుటుంబంలోనిసభ్యులు కలిసి కట్టుగా పనిచేయవలసిన అవసరం చాల వున్నది. పిల్లలకు ఆహ్లాదాన్ని కల్గించే చక్కని వినోద ప్రదర్శనాలు

(తరువాయి 76 వ పేజీలో)

ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు :

# భద్రాచలం



## భక్తవిజయానికి చిహ్నంగా విలసిల్లే పుణ్యక్షేత్రం

భద్రాచలంలో ఏప్రిల్ 9 వ తేదీన శ్రీరామనవమినాడు సీతాకల్యాణ మహోత్సవాన్ని చూచుటకు దేశం నలుమూలలనుంచి యాత్రికులు వస్తారు. పవిత్రమయిన శ్రీ సీతారామస్వామి దేవాలయము గోదావరీ నదీతీరమున వెలసియున్నది. దీనిని రామభక్తుడైన కంచర్ల గోపన్న అను తహశీల్దారుడు నిర్మించినాడు. ఈ పుణ్యక్షేత్రపు పుట్టుపూర్వోత్తరాలు ఈ వ్యాసంలో పేర్కొనబడినవి.

భద్రాచలం భారతదేశపు పుణ్యక్షేత్రాలలో ఒకటి. ఇది గోదావరినది ఒడ్డున వుంది. ఈనది హిందువులకు పవిత్రమైన అనేక స్థలాలగుండా ప్రవహిస్తున్నది. భద్రాచలం (దీనిని భద్రుని కొండ అని కూడా అంటారు.) తూర్పు కనుమలలోని కొండల అడుగున వుంది. ఇది తూర్పు గోదావరి జిల్లాలో ఒక చిన్నగ్రామం. నేటి వరకు కూడా ఇక్కడికి రహదారి సౌకర్యాలు చాలినన్ని లేవు.



భద్రాచలం శ్రీరామాలయంలో మూలవిరాట్టు విగ్రహం

భద్రునికథ శ్రీరామచంద్రుని కాలము నాటిది. శ్రీరామచంద్రుడు సతీసమేతంగా 14 సంవత్సరములు అరణ్యవాసంలో వున్నప్పుడు భద్రాచలానికి సమీపంలో సుమారు పన్నెండేండ్లు పర్ణశాలలో నివసించాడు. వీరు దండకారణ్యంలో తిరుగుతూప్పుడు ఈ కొండపైన కూర్చుని కొంతసేపు విశ్రమించారు. ఈ కొండ తమకు సౌఖ్యాన్నీ, ఆనందాన్నీ కల్పించినందుకు వారు దానిని ఆశీర్వదించారు. ఈ కొండ పేరే భద్రునికొండ. అందువల్లనే ఇది భద్రాచలమని పేరుగాంచినది. భద్రుడు మేరువునివల్ల దేవేంద్రుని సభలోని అప్సరసమైన మేనకకు జన్మించాడు. భద్రుడు



సీతారాముల కల్యాణ మహోత్సవం

శ్రీరామునిగూర్చి ఘోర తపస్సు చేసినందుకుగాను శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణుల యుక్తంగా రాతి విగ్రహాలరూపంలో భద్రునికొండపై స్థిరపడిపోయాడు.

యుగాలు గడిచిపోయినాయి. ఈ కొండపై వున్న విగ్రహాలను ఎవ్వరూ చూడలేదు. దీని దిగువనఉన్న ఒక కుగ్రామంలో తమ్మల దమ్మక్క యను ఒక వృద్ధ వనిత నివసిస్తూ వుండేది. ఒక రోజు ఆమె ఈ విగ్రహాలను కనుగొని వాటికి భక్తితో పూజలు చేయ నారంభించింది. కొంతకాలం తరువాత ఆ గ్రామాధి కారియైన భద్రారెడ్డి సహాయంతో కొండపైన విగ్రహా లకు ఒక చిన్న మంటపం నిర్మించింది. ఈ లోపల గోలకొండ నవాబు తానీషా నేలకొండపల్లి నివాసియైన కంచెర్ల గోపన్నను ఆ ప్రాంతానికి తహశీల్దారుగా నియమించాడు. (నేలకొండపల్లి గ్రామం ఖమ్మం మెట్టుకు 14 మైళ్ల దూరంలో వుంది. నేడు ఇది బాగా అభివృద్ధిపొందిన గ్రామం.) ఇది క్రీ. శ. 1650 సం. నాటి మాట. గోలకొండ రాజ్యపు ప్రధానమంత్రి అక్కన్న, సేనానాయకుడు మాదన్న గోపన్నకు దగ్గరి బంధువులని ప్రతీతి. గోపన్న నియామకానికి ఎంతో ప్రాముఖ్యం వుంది. ఎందుకంటే శంకరగిరి పట్టి, పాల్వంచ, భద్రాచలం తాలూకాలతో కూడిన హస్నాబాదు పరగణాలలో భూమిశిస్తు బకాయాలను రాబట్టుకోవడం ఆయనపనియై వుండేది. ఔరంగజేబు చక్రవర్తి దక్కన్‌లో తన సార్వభౌమాధికారం నిల బెట్టుకొనుటకై దండయాత్రలు కొనసాగిస్తూ వుండిన ఫలితంగా ఈ ప్రాంతంలో శాంతిభద్రతలకు భంగం కలిగింది. ప్రజలు ప్రభుత్వానికి సక్రమంగా భూమి శిస్తులు చెల్లించడం మానివేశారు. ఈ బకాయాలను రాబట్టుకోవడంలో గోపన్న సఫలీకృతుడైనాడు. అయితే ప్రజలను శాంతికాములుగా చేయుటకు, వారిని ఒక నిర్మాణాత్మక కృషిలో పాల్గొనేటట్లు చేయాల్సి వచ్చింది. భద్రాచలంలో శ్రీ రామస్వామి దేవాల యాన్ని నిర్మించుటకు గోపన్న రైతుల సమావేశాన్ని ఏర్పాటుచేశాడని వినికిడి. ఈ ప్రాంతంలో కరువు వచ్చి నందువల్ల, ప్రజలకు వృత్తి కల్పించుటకై గోపన్న దేవాలయ నిర్మాణానికి పూనుకున్నాడని చెప్పుటకు కొన్ని ఆధారాలున్నాయి. ఏది ఏమైనా, ప్రజల సహ కారంతో నిర్మాణపు పని ఆరంభమైంది. గోపన్న

వారికి డబ్బులు చెల్లించవలసి వచ్చింది. అందుకై ప్రభుత్వ ఖజానాలోని ధనాన్ని దేవాలయ నిర్మాణానికి వినియోగించాడని ఒక కథ వుంది. ఈ నేరానికిగాను తానీషా గోపన్నను కారాగారంలో ఉంచాడు. గోలకొండ నవాబు గొప్ప విద్వాంసుడనీ, సత్పరిపాలకుడనీ చెప్పుటకు అనేక చారిత్రక ఆధారాలున్నాయి. గోపన్న జైలులో బాధపడుతూ రామనామ స్మరణ చేస్తూండగా శ్రీరామ లక్ష్మణులు తానీషాకు కలలో కనపడి ఆయనకు దేవాలయ నిర్మాణానికి గోపన్న ఖర్చు పెట్టిన ధనమంతా ముట్టజెప్పారని ఒకకథ ప్రచారంలో వుంది. గోపన్న విడుదలయిన తరువాత తన పూర్వపు పదవిలో నియమించబడినాడు. ఆయన దేవాలయాన్ని బాగా అభివృద్ధిపరచి విగ్రహాలకు అనేక ఆభరణాలు చేయించాడు. భద్రాచలం యాత్రికులకు పుణ్యక్షేత్రమైంది. గోపన్న పేరుప్రఖ్యాతులు భారతదేశమంతటా వ్యాపించినవి. కంచెర్ల గోపన్న రామదాసు అయినాడు. రామదాసు కబీరు శిష్యుడని ప్రతీతి. రామదాసు రామకీర్తనలు వ్రాశాడు. ఈయన వ్రాసిన 'దాశరథి శతకం' తెలుగు శతక గ్రంథములలో అత్యుత్తమమైనవాటిలో ఒకటని చెప్పవచ్చును. ఈ శతకం ప్రజల్లో బాగా ప్రచారంలోవుంది. రామదాసు గొప్ప గాయకుడు కూడా. ఈయన అనంతరం, దక్షిణభారతంలో గాయక శిఖామణి యని ప్రశస్తిగాంచిన త్యాగరాజు భద్రాచలాన్ని దర్శించాడని చెబుతారు. త్యాగరాజు స్వయంగా కీర్తనలు వ్రాయుటకుపూర్వం రామదాసు కీర్తనలను బాగా అవగాహన చేసుకొన్నాడని చెప్పుటకు ఆధారముంది. శ్రీరాములవారు రామదాసువద్దకు పుష్పక విమానాన్ని పంపినాడనీ, రామదాసు అందులో కూర్చొని బొందితో స్వర్గానికి వెళ్లినాడని పురాణగాథ ఒకటి వుంది.

ఈ పురాణగాథ నిజమైనా, అబద్ధమైనా నేడు భద్రాచలంలోని సీతారామస్వామి దేవాలయం హిందువులకు పవిత్రమైన యాత్రా స్థలమయింది. శ్రీరామ నవమి, ముక్కోటి ఏకాదశి రోజులలో ఇక్కడికి అనేకమంది యాత్రికులు వస్తుంటారు. శ్రీరాముడు అయోధ్యలో సరయూనది తీరమున నవమినాడు జన్మించినాడు. ఇక్కడ శ్రీరామనవమి పండుగ



భద్రాచలం దేవాలయం - ఒక దృశ్యం



గోదావరి నది గట్టునుంచి చూస్తే కన్పించే భద్రాచలం దృశ్యం.

ఎంతో కోలాహలంతో, వేడుకతో జరుగుతుందో భద్రాచలంలోకూడా అంత వేడుకతో జరుగుతుంది.

భద్రాచలానికి చేరుకోవాలంటే రెండు మార్గాలున్నాయి. రాజమండ్రినుంచి తూర్పుదిశగా గోదావరిలో లాంచి లేక పడవద్వారాగానీ లేక దక్షిణంనుంచి కొత్తగూడెం రైల్వే స్టేషనునుంచి పోవచ్చును. ఈ రైల్వేస్టేషను భద్రాచలంరోడ్డుఅనికూడా అందురు.

తెలంగాణా ఆంధ్రలో లీనమయ్యేవరకు, తానీషా కాలంనుంచి హైద్రాబాదు ప్రభుత్వం సంప్రదాయకంగా ఈ దేవాలయ నిర్వహణఖర్చులను భరిస్తూవచ్చింది.



రామదాసు జన్మస్థలమైన నేలకొండపల్లి గ్రామంలోని ఒక వీధి

# కృష్ణాజిల్లాలో సాగునీటి సౌకర్యాలు

## కృష్ణానది

కృష్ణానది పవిత్రమైనది. పుష్కలమైన ప్రవాహం కలది. ఈ నదినిబట్టే కృష్ణాజిల్లాకు ఆ పేరు వచ్చినది. ఈ నది యీ జిల్లా గ్రామీణ ఆర్థికవ్యవస్థకి వెన్నెముక వంటిది. కృష్ణవేణి అని ప్రసిద్ధికెక్కిన యీ నది బొంబాయి రాష్ట్రంలోపుట్టి, పశ్చిమంనుంచి తూర్పుకి రమారమి 800 మైళ్ళు ప్రవహించి బంగాళా ఖాతంలో కలుస్తుంది. ఇది యీ జిల్లా ముఖ్యపట్టణ మైన మచిలీపట్నానికి దక్షిణాన రెండు పాయలుగా చీలి సముద్రంలో కలుస్తుంది. సౌభాగ్య కరమైన యీనదిలో కొట్టుకొనివచ్చే వండుమట్టి అతి విస్తార మైనది. వరద సమయంలో యీనది యిలా ప్రతి రోజూ కొట్టుకునివచ్చే వండుమన్నుతో 5 చదరపు మైళ్ళు విస్తీర్ణంగల భూమిని ఒక అడుగు మందాన్ని కప్పవచ్చునని అంచనా వేయబడింది. చిరకాలంగా యీనదిలో కొట్టుకొనివస్తున్న వండుమట్టితో విస్తార మైన డెల్టా యేర్పడింది. ఇది సముద్రములోనికి చాలా దూరం చొచ్చుకొని పోయినది.

## ఆనకట్ట

ఈ నదికి విజయవాడవద్ద ఆనకట్ట నిర్మించబడింది. అంత యెత్తులేని జెనిస్సిక్ కొండలమధ్య 1,300 గజాల వెడల్పుగల ప్రదేశంలో యిది నిర్మించబడింది. ఆ విధంగా దానినీరు సాగునీటి కాలువలకి మళ్ళింప బడింది. ఇవి డెల్టా ప్రదేశమం దంతటా వున్నాయి. విజయవాడ ఆనకట్టకి యెగువన కృష్ణానదికి మునియేరు అనే వుపనది వుంది. ఇది నందిగామ తాలూకాలో వుత్తరంనుంచి దక్షిణానికి ప్రవహిస్తుంది. దీనికి



ఇప్పుడు నిర్మాణంలోవున్న కృష్ణా బ్యారేజీ దృశ్యం.



కృష్ణా బ్యారేజీకి శంకుస్థాపన చేసిన సందర్భంలో ప్రసంగిస్తున్న అప్పటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు

పోలంపల్లివద్ద ఒక ఆనకట్ట వుంది. దీనివల్ల 28,800 యెకరాలకు సాగునీరు లభిస్తుంది.

కృష్ణానదియొక్క పాయ యైన పులిగడ్డపై 1935 లో కాంక్రీటుతో ఒక అక్విడక్టు నిర్మించ బడింది. దీనివల్ల 7,7000 ఎకరాలకు సాగునీరు లభిస్తున్నది. ఈ ఆనకట్టకు రూ. 58,00,000 లు వ్యయం అయింది. ఈ వ్యయానికిగాను ప్రభుత్వానికి నూటి 7.76 వంతుల చొ. ఆదాయం లభిస్తున్నది.

ఈ మహానదిలో కొట్టుకొనివచ్చి దిగబడేయిసుక, వండుమన్నుల ద్వారా దీనిలో లంకలు యేర్పడ తాయి. వాటిలో ముఖ్యంగా పొగాకు, జొన్న పండించబడతాయి. ఈ లంకలు నిరంతరం మారుతూ వుంటాయి. కొన్ని సంవత్సరాలు వండుమన్ను చేరిక వల్ల యివి సారవంతంగా వుంటాయి. మరొకప్పుడు యివి పూర్తిగా కొట్టుకొని పోతాయి లేదా యిసుకతో కప్పబడి పోతాయి.

## కృష్ణానది ఆయకట్టు

గోదావరి సాగునీటి సిస్టం తరువాత కృష్ణానది సాగునీటి సిస్టం పెద్దది. ఇది యీ జిల్లాలో సుమారు 10 లక్షల యెకరాలకి సాగునీటిని లభింపజేస్తుంది. ఈ విధంగా యీజిల్లా కరువుబాధ నుంచి శాశ్వతంగా విముక్తమైనది. ఆంధ్రప్రదేశ్ లో ఆహారోత్పత్తికి మిక్కిలి ప్రధానమైన గోదావరి డెల్టా తరువాత స్థానాన్ని యిది ఆక్రమిస్తుంది.

## చిన్న నదులు

ఇదికాక మరికొన్ని కొండవాగులు కూడా వున్నాయి. వీటిలో పలూరు, నూజివీడు తాలుకాల మధ్యనుంచి ప్రవహించే తమ్మిలేరు, బెజవాడ తాలూకాలో ప్రవహించే బుడమేరు మిక్కిలి ముఖ్యమైనవి. ఇవి చాల తాలూకాలలోని సాగునీటి చెరువుల్ని నింపుతాయి. నేరుగా వీటినుంచికూడా వ్యవసాయానికి నీరు తీసుకో బడుతుంది.

బుడమేరు యెక్కువ పెద్దదికాదు. కాని దీనికి అప్పుడప్పుడు విపరీతమైన వరదలు వస్తూవుంటాయి. ఇందువల్ల రవాణా, రాకపోకలకు భంగం కలుగుతుంది. వేలాది యెకరాల పంటభూములకి నష్టం కలుగుంది. అందుచేత రైతులు దీనిని చూసి చాలా భయపడుతూ వుంటారు. దీనిపై జలాశయం నిర్మించడానికి తెలుకేరు, చెంద్రాజుగూడెం, నందిగామ, వెల్లటూరువంటి స్థలాలు పరిశోధింపబడ్డాయి. తుదకి మైలవరానికి సమీపాన గల నందిగామ స్థలం నిర్ణయించబడింది. 1,500 మె. ఘ. అ. నీరు పట్టగల జలాశయాన్ని నిర్మించి, తద్వారా కొల్లేటి ముంపును కొంత తగ్గించడానికి నిశ్చయించబడింది. ఈ జలాశయానికి 3 మైళ్ళ పొడవున మట్టిగోడ నిర్మించబడుతుంది. ఈ జలాశయంనుంచి త్రవ్వబడగల్ల కాలువలు విజయవాడ తాలూకాలో 13,000 యెకరాలకు సాగునీటిని అందిస్తాయి. కుడివైపున 1033′ – 0″ పొడవుగల సర్‌ప్లస్ వెయిర్ యేర్పాటు చేయబడుతుంది. ఇది ఆరగాణి (కాచ్ మెంటు) ప్రాంతపు వరదనీటిని సాధ్యమైనంతగా అరికడుతుంది.

బుడమేరు ప్రణాళిక ప్రస్తుతానికి వరదనివారణ పథకంగా మంజూరు చేయబడింది. కాని చివరికి యిది ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడే మధ్యరకం సాగునీటి ప్రణాళికగా రూపొందించబడుతుంది. దీని క్రింద ప్రస్తుతపు ఆయకట్టు 4,000 యెకరాలతోసహా మొత్తం 13,000 యెకరాలకు సాగునీరు లభిస్తుంది.

వరదల భీభత్సానికి కారణమైన మరొక వనరు కొల్లేరు సరస్సు. ఇది విశాలంగా మెరకగావుంటుంది. గోదావరీ, కృష్ణానదులు చేర్చే వండుమన్నువల్ల రెండువైపులా భూమి క్రమేణా యెత్తుకావడంవల్ల యిది యేర్పడింది. దీని వైశాల్యంలో చాలా యెక్కువగా మార్పు వస్తూవుంటుంది. వేసవిలో యించుమించు యెండిపోతుంది. వర్షాకాలంలో దాని వైశాల్యం రమారమి 150 చదరపు మైళ్ళు వుంటుంది. కొల్లేరుసరస్సు నీరు సముద్రంలోనికి పోవడానికి వుప్పుటేరు ఒక్కటే మార్గం. ఈ వుప్పుటేరు పొడవు 27 మైళ్ళు.

ఈ జిల్లాలోని చిన్ననదులు :

| వరుస సంఖ్య | నదిపేరు | పొడవుమైళ్ళలో |
|---|---|---|
| 1 | ఉప్పుటేరు | 30 |
| 2 | తమ్మిలేరు | 68 |
| 3 | బుడమేరు | 35 |
| 4 | నెక్కవాగు | 52 |
| 5 | వేగారువాగు | 65 |

## చెరువులు, బావులు

నదుల తరువాత యీ జిల్లాలోని సాగునీటి వనరులు బావులు, చెరువులు. ఆధునికమైన కాలువల సిస్టం అమలులోనికి రాకముందు చిరకాలంనుంచి చెరువులే వ్యవసాయానికి ముఖ్యమైన ఆధారంగా వుంటున్నాయి. ఈనాటికీఅవి వాటి ప్రాముఖ్యాన్ని కోల్పోలేదు. బావుల సంఖ్య 3261. వీటిలో 2540 యిటుక సున్నాలతో నిర్మించబడినవి. మిగిలినవి తదితరమైనవి.

100 యెకరాలు అంతకు మించిన ఆయకట్టుగల చెరువుల సంఖ్య 361. నూరు యెకరాలకిలోపు ఆయకట్టుగల చెరువుల సంఖ్య 197.

3261 గొట్టపు బావులున్నాయి.

## కృష్ణా బారేజ్

ఇప్పుడు నిర్మాణంలోనున్న కృష్ణానది బారేజ్ ప్రాజక్టు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం మంజూరుచేసిన తొలిప్రాజెక్టు. ఇది తొలి పంచవర్ష ప్రణాళికలో సర్దుబాటుల క్రింద చేర్చబడింది. దీనిక్రింద విజయవాడవద్ద కృష్ణానదిపై ప్రస్తుతపు పటర్లలైన్‌కి 59 అడుగుల పైన ఒక అడ్డకట్ట నిర్మించబడుతుంది. రెగ్యులేటర్ నుంచి నీరు పోవడానికి ఒక్కొక్కటి 40 అడుగులు గల నిర్గమన మార్గాలు 72 వుంటాయి. ఇది ఒక రోడ్డు వంతెనతో కలుపబడింది. ఆ వంతెన వెడల్పు 24 అడుగులు. దాని కిరుప్రక్కలా 5 అ. త్రోవలుంటాయి. రెగ్యులేటరు కవసరమైన షట్టర్లు విజయవాడలోని వర్కుషాపులో తయారు చేయబడుతున్నాయి. ఈప్రాజెక్టువల్ల కృష్ణాజిల్లాలో 46,000 యెకరాలకి, గుంటూరుజిల్లాలో 71,000 యెకరాలకి సాగునీరు లభిస్తుంది.

ఈ ప్రాజెక్టు అంచనా ఖర్చు రూ 284 లక్షలు, దీనిలో సాగునీటి సౌకర్యాలకి సంబంధించిన పనికి రూ 230 లక్షలు ఖర్చవుతుంది. మిగిలినది వంతెనకి సంబంధించిన పనికి ఖర్చవుతుంది.

## సాగునీటి సౌకర్యంగల భూమి

కృష్ణాజిల్లాలో మొత్తం 14.50 లక్షల యెకరాలలో పంటలు పండించబడతాయి. వీటిలో 6.70 లక్షల యెకరాలకి సాగునీటి సౌకర్యంవుంది. వేర్వేరు రకాల వనరులు, వాటిక్రింద సాగయే భూమి వివరాలు దిగువ యివ్వబడినవి.

| సాగునీటి వనరు | లాభంపొందే భూమి లక్షల యెకరాలు |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు | 6.10 |
| 2. చెరువులు | 0.40 |
| 3. బావులు | 0.05 |
| 4. ఇతరనదులు | 0.14 |
| మొత్తం | 6.69 |

ఈ జిల్లాలో తలకి 424 పౌనులబియ్యం పండుతాయి. ఈ విషయంలో యిది పశ్చిమగోదావరి జిల్లా తరువాత వస్తుంది. మొత్తంమీద ఆంధ్రరాష్ట్రం సగటు 204 పౌ. మాత్రమే.

ఈ జిల్లాలో కాలువలు జిల్లాలోపలి రవాణాకు కూడా వుపకరిస్తాయి.

ఆంధ్రప్రదేశ్ లో పశ్చిమగోదావరిజిల్లా తరువాత యెక్కువ ప్రదేశానికి సాగునీటి సౌకర్యం కృష్ణా జిల్లాలోనేవుంది.

## నాగార్జునసాగర్

భారతదేశానికి నదుల దేశమనే పేరువుంది. ఈ పేరు కొత్తరాష్ట్రానికికూడా తగివుంది. పల్లెప్రజల సంపద యీ పురాణభూమిలో ప్రవహించే మహా నదులలో యిమిడి వుంది. ఋషులు నదులను దేవతలుగా పూజించడంలో ఆశ్చర్యం లేదు. అత్యంత వుత్కృష్టము, వున్నతము అయిన విషయాలు ఋషులకి స్ఫురించినదీ మహానదుల సుందర తీరాలనే గదా? పూర్వకాలంలో వలెనే ఆధునిక యుగంలో కూడా మానవుని పురోగమనాన్ని, సౌభాగ్యాన్ని తీర్చిదిద్దడంలో నదులు ప్రధానపాత్ర వహిస్తాయి. దేశమంతటా తలపెట్టబడిన నదీలోయ ప్రాజెక్టులు పూర్తి అయిననాడు దేశంలో ఆహారం పుష్కలంగా వుంటుంది. ఈ ప్రాజెక్టులక్రింద విద్యుచ్ఛక్తికూడా యెక్కువగా వుత్పత్తికాగలదు. కాబట్టి ప్రజలకు దీపాలవిషయంలోకూడా యితోధికమైన సౌకర్యం లభిస్తుంది. కృష్ణానదిపై తలపెట్టిన నాగార్జునసాగర్ ప్రాజెక్టు అటువంటిదే. దాని సంపద చాలా గ్రామాలకు విస్తరించగలదు. ఈ ప్రాజెక్టు క్రింద కృష్ణాజిల్లాలో ప్రథమపంటక్రింది భూమి 1.5 లక్షల యెకరాలకి, రెండవ పంట క్రింది భూమి 4.5 లక్షల ఎకరాలకి సాగునీరు లభిస్తుంది.

# వార్తా చిత్రాలు



బడ్జెటు ప్రసంగం చేయడానికై రాష్ట్ర శాసనసభకు విచ్చేస్తున్న ఆర్థిక మంత్రి శ్రీ కళా వెంకట్రావు



ఫతే మైదాన్‌లో పెరేడ్ దృశ్యం



వివిధ రాష్ట్రాల శాసన సభల కార్యదర్శులకు విందు చేయబడిన సందర్భంలో ఎడమనుండి కుడిప్రక్కకు
శ్రీ వి. కె. రావు, ఐ. సి. యస్. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పబ్లిక వర్క్సు శాఖాకార్యదర్శి; శ్రీ డా. వి. యస్. కృష్ణ,
ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు; శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, ఆంధ్రశాసన సభ అధ్యక్షులు



నిజామాబాదు జిల్లా కామారెడ్డిలో 13-2-1957 తేదీన శ్రీమతి కుసుం త్రివేది ప్రసూతి వార్డును ప్రారంభోత్సవం చేస్తున్నారు



లేక్ వ్యూ ప్రభుత్వ అతిథి గృహంలో 14-2-1957 తేదీన భారత ప్రభుత్వం నియమించిన ఆర్థిక విచారణ సంఘంవారు పత్రికా విలేఖరులతో గోష్ఠి జరిపారు



హైదరాబాదులో 1957 మార్చి 23 వ తేదీన జరిగిన ఆంధ్రప్రదేశ్ సహకార, కేంద్ర బ్యాంకుల ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తున్న రాష్ట్రసహకార శాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య



ఆంధ్రప్రదేశ్ గవర్నరు 19-2-1957 తేదీన హైదరాబాదులోని ప్రాంతీయ విజ్ఞానశాస్త్ర పరిశోధనాలయాన్ని సందర్శించారు. ఈ చిత్రంలో వారివెంట పరిశోధనాలయ డైరెక్టరు డా. హెచ్. జహీద్ వున్నారు



హైదరాబాదులో జరిగిన ఉద్యాన కృషి ప్రదర్శనంలో రాష్ట్ర గవర్నరు, వారి సతీమణి శ్రీమతి కుసుం త్రివేది
చిత్రంలో ఎడమవైపున తెల్లకోటుతో వున్నవారు వ్యవసాయశాఖ డైరెక్టరు శ్రీ ఐ. జె. నాయుడు



13-2-1957 తేదీన హైదరాబాదులోని కేంద్ర సచివాలయములో ఆంధ్రప్రాంతపు జిల్లా సహకార మార్కెటింగు సొసైటీలు, కో-ఆపరేటివ్ హోల్‌సేల్ స్టోర్సు సెలక్టు మార్కెటింగు సొసైటీలు మరియు తెలంగాణాప్రాంతంలోని 'టాకా' ల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రసంగిస్తున్నారు.



రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి 13-2-1957 తేదీన కర్షక యువజనసంఘానికి ప్రారంభోత్సవం చేశారు



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి విశాఖపట్నంజిల్లా లోని కోటఉరట్ల బ్లాకు మేలాను సందర్శించినప్పుడు సర్కారు జిల్లాలలో ఎకరాకు హెచ్చు వరిపంట పండించిన రైతుకు ట్రోఫీ బహూకరిస్తున్నారు

నయాపైసాలకోసం లోహం కరగడం.



నయాపైసాలపై ముద్రలు వేయడం.

# హైదరాబాదు టంకసాల

భారతదేశంలో 1957 ఏప్రిల్ 1వ తేదీనుంచి అమలులోకివచ్చే కొత్త నాణెములను ముద్రించడంలో నిమగ్నమైవున్న మూడు టంకసాలల్లో హైదరాబాదు టంకసాల ఒకటి.

ఈ టంకసాల మొదటి సర్ సాలార్జంగ్ హైద్రాబాదు రాష్ట్ర ప్రధానమంత్రిగా వున్నప్పుడు స్థాపించబడింది. అప్పటినుంచి ఇది హైద్రాబాదు రాష్ట్ర నాణెములను ముద్రించడానికి ఉపయోగింపబడుతున్నది. హైద్రాబాదు రాష్ట్ర నాణెములు రద్దు చేయబడు నంతవరకు అవి ఈ టంకసాలలోనే ముద్రింపబడుతూ ఉండేవి.

నాణెములు ముద్రించడానికై 1895 లో మొదట యంత్రాలు నెలకొల్పబడ్డవి. మొదట 'చర్ఖీ' అనే నాణెం (చక్రం ఆకారంలో వుండే నాణెం) ముద్రించబడింది. ఆ తరువాత 1903 లో యూరపుఖండ దేశాల టంకసాలల పద్ధతులప్రకారం ఈ టంకసాలలో నాణెములను ముద్రించే పద్ధతులు సంస్కరింపబడ్డవి. టంకసాల సైఫాబాదుకు మార్చబడింది. ఇప్పటికీ అది అక్కడే వున్నది. ఇందులో ఆధునిక యంత్రాలు అమర్చబడ్డవి. యంత్రాలు మొదలగువాటితో సహా రు 7,57,530 లు ఖర్చు అయింది. అప్పటినుంచి మరికొన్ని యంత్రాలుకూడా ఇందులో చేర్చబడ్డవి.

ఈనాడు ఇందులో దాదాపు 360 మంది కార్మికులు పనిచేస్తున్నారు. రోజుకు 4.5 లక్షలు మొదలు 5 లక్షల నాణెములు ఇందులో తయారవుతున్నవి. ప్రస్తుతం ఒక నయాపైసా నాణెమే ముద్రింపబడుతున్నది.

## ప్రస్తుతం జరుగుతున్న పని

ఇప్పుడు క్రొత్తరకం దశాంశ నాణెములు ఈ టంకసాలలో తయారవుతున్నవి. నాణెములు తయారుచేయుటకు వివిధ దశలలో ఏయే పనులు జరిగేదీ ఈ దిగువ వివరించబడింది: నాణెముల తయారీకి అవసరమైన సక్రమ మిశ్రమలోహాన్ని తయారుచేయడానికి ఏయే లోహములు కావాలో వాటిని బులియన్ సెక్షన్ మెల్టింగ్ సెక్షన్‌కు అందజేస్తుంది. మెల్టింగ్ సెక్షన్‌లో ఆ లోహములను మూసలలో కరిగి కడ్డీలుగా పోతపోస్తారు. ఆ కడ్డీలను రోలర్లతో త్రిప్పి ఎంత మందం చెక్కలు కావాలో అంతమందం చెక్కలుగా చేస్తారు. ఈ చెక్కలను పంచ్ చేసి గుండ్రని బిళ్ళలుగా కోస్తారు. ఆ బిళ్ళలను వేడిచేసి నునుపుచేసి తళతళలాడేట్టు చేస్తారు. ఈ పనిని "అన్నియలింగ్" అంటారు.

ఆ బిళ్ళలపై ముద్రలు వేసి నాణెములుగా చేస్తారు. ఈ నాణెములు మళ్ళీ బులియన్ సెక్షన్‌కు పంపుతారు. అక్కడ వాటిని చివరిసారిగా పరీక్షచేసి తరువాత ఇండెంట్ల ప్రకారం ఇండియా రిజర్వు బ్యాంకు శాఖలకు పంపుతారు.

ఇప్పుడు హైద్రాబాదు టంకసాలలో తయారవుతున్న ఒక నయాపైసా నాణెములు కంచుతో చేయబడుతున్నవి. రాగి, తగరం, తుత్తునాగం ఈ మూడు లోహములను మిశ్రమంచేసి ఆ కంచును తయారుచేస్తారు.

# ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తి వివరాలు

—-○—

1955-56 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ జాతీయాదాయం 823.10 కోట్లు. ఆదాయ వివరాలు ఇవి :

| | (రూ. కోట్లలో 1955-56) |
|---|---|
| 1. వ్యవసాయం, పశుసంపద | 474.4 |
| 2. గనులు, వస్తూత్పత్తి, చేతివృత్తులు | 111.75 |
| (అ) గనులు | 5.68 |
| (ఆ) వస్తూత్పత్తి | 23.47 |
| (ఇ) చిన్నపాటి వాణిజ్యములు | 82.60 |
| 3. వ్యాపారం రవాణా, వార్తాసౌకర్యాలు | 129.33 |
| 4. ఇతర సర్వీసులు | 107.58 |
| (అ) వృత్తులు, తదితరకళలు | 33.53 |
| (ఆ) ప్రభుత్వ సర్వీసులు (పరిపాలనా సంబంధమైనవి) | 24.05 |
| (ఇ) గృహ సర్వీసులు | 4.97 |
| (ఈ) ఇండ్ల ఆస్తి | 45.03 |
| మొత్తం ఆదాయం | 823.10 |

| | |
|---|---|
| జనాభా | 331 లక్షలు. |
| తలసరి ఆదాయం | 249 రూ. |

ఆంధ్ర ప్రదేశ్, వ్యవసాయ ప్రధానమైన ఆర్థిక వ్యవస్థగలరాష్ట్రం. మొత్తం జనాభాలో 211 లక్షలమంది లేదా నూటికి 67.4 వంతులమంది వ్యవసాయంపై జీవిస్తున్నారు. వీరిలో దాదాపు 122 లక్షలమందికి స్వంతభూములున్నవి. 24 లక్షల మందికి స్వంతభూములు లేవు. వారు ఇతరుల భూమిపై సేద్యం చేసుకుంటున్నారు. 58 లక్షల మంది వ్యవసాయకూలీలు. 6 లక్షలమంది వ్యవసాయ కౌలుపై జీవిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో 42,42,655 భూకమతాలున్నవి. వీటివిస్తీర్ణం 3,41,91,769 ఎకరాలు. ఒక్కొక్క కమతం సగటు ప్రమాణం 8.1 ఎకరాలు. వీనిలో 39.87 లక్షల కమతాలు పూర్తిగా లేక కొంతభాగంగా యజమానుల స్వంత సేద్యం క్రింద వున్నవి. మిగిలిన 2.56 లక్షల కమతాలు కౌలు కివ్వబడుతున్నవి. కౌలు కివ్వబడే భూమి విస్తీర్ణం స్వంత కమతాల ప్రమాణానికి నూటికి 11.5 వంతులు ఉంటుంది.

## ఆహారధాన్యాల ఉత్పత్తి

ఆంధ్రప్రదేశ్‌కు కావలసిన బియ్యం 27.6 లక్షల టన్నులు. 1955-56 సంవత్సరంలో ఉత్పత్తి 30.6 టన్నులు. అంటే 3 లక్షల టన్నుల మిగులు వుందన్నమాట. కావలసిన జొన్నలు, 20 లక్షల టన్నులు. కాని జొన్నల ఉత్పత్తి 19.8 లక్షల టన్నులు మాత్రమే. అంటే 0.2 లక్షల టన్నుల కొరత అన్నమాట. ఒకవేళ బియ్యం, జొన్నలు ఈ రెండింటినీ కలిపి లెక్కవేస్తే 2.7 లక్షల టన్నుల మిగులు వుంటుంది.

## 1955-56 సంవత్సరంలో ఖనిజముల ఉత్పత్తి

| | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ. లక్షలలో |
|---|---|---|
| 1. బొగ్గు | 16,82,000 | 370 |
| 2. మాంగనీస్ | 1,01,000 | 156 |
| 3. మైకా | 4,150 | 115 |
| 4. ముడి ఇనుము | 6,63,000 | 49 |
| 5. సున్నపురాయి | 2,44,000 | 36 |
| 6. అస్బెస్టాస్ | 321 | 3 |
| 7. బెరెటిస్ | 4,342 | 0.8 |

## 1955-56 లో పారిశ్రామికోత్పత్తి

| | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ. లక్షలలో |
|---|---|---|
| 1. చక్కెర | 118 | 741 |
| 2. కాగితం | 15.2 | 181 |
| 3. సిమెంటు | 204 | 166.5 |
| 4. సిగరెట్లు (కోట్లలో) | 446 | 349 |
| 5. ప్రత్తినూలు (లక్షల పౌనుల్లో) | 233 | 368 |
| 6. నూలువస్త్రాలు (లక్షల గజాలలో) | 424 | — |
| 7. విద్యుచ్ఛక్తి (మిలియన్ కిలోవాట్లలో) | 285 | — |

# ఆంధ్రప్రదేశ్ పశుసంపద

## సంక్షేమాభివృద్ధికి కృషి

ఆంధ్రప్రదేశ్‌లో 115 లక్షల ఆవులు, ఎద్లు, 60 లక్షల బర్రెజాతి పశువులు ఉన్నాయి. ఇంకా 80 లక్షల గొర్రెలు, 40 లక్షల మేకలు, 150 లక్షల కోళ్లు వున్నాయి. గుర్రాలతో సహా 7,29,000 యితర జంతువులు వున్నాయి. వీని సంక్షేమాభివృద్ధి బాధ్యతను పశుపోషణ శాఖ వహిస్తున్నది.

ప్రస్తుతం సాలీనా 15,50,000 టన్నుల పాలు, పాల పదార్థాలు వుత్పత్తి అవుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణము, జనసంఖ్యల దృష్ట్యా యివి సరిపోవని భావించబడుతున్నది.

మూడు సంవత్సరాలు పైబడిన యెద్లు, ఆవులు 86 లక్షలు, బర్రెజాతి పశువులు యించుమించు 40 లక్షలు వుంటాయని అంచనా వేయబడింది. ఆంధ్ర ప్రదేశ్‌లో 300 లక్షల యెకరాలలో పంటలు పండించబడుతున్నాయి. 30 లక్షల నాగళ్లు, 12 లక్షల బళ్లు పనిచేస్తున్నాయి. వీటి దృష్ట్యా అందుబాటులోవున్న వ్యవసాయ పశువుల సంఖ్య చాలదు. అవి అంత శ్రేష్ఠమైన పశువులుకూడా కాదు.

ఈ సందర్భంలో పశుపోషణ శాఖకు ఒక ప్రాముఖ్య మేర్పడింది. దాని కార్యక్రమాలను విస్తరింప చేయడానికి వీలుగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దానికి రమారమి రు. 418 లక్షలు కేటాయించ బడినవి. ఆవిధంగా దానికేర్పడిన ప్రాముఖ్యం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రతిఫలిస్తున్నది.

హైదరాబాదు, బాపట్లలలో గల రెండు పశువైద్య కళాశాలలు ప్రతి సంవత్సరము పట్టభద్రుల్ని తయారు చేస్తున్నాయి. వీరు మన పశుగణానికి సేవచేస్తారు. వైజాగ్, హైదరాబాదులలో యెమర్జెన్సీ కోర్సులుకూడా ఆరంభింపబడ్డాయి. ఇందువల్ల రాష్ట్రంలోని సమాజాభివృద్ధి, జాతీయ వికాస సేవాకేంద్రాలకు సుశిక్షితమైన సిబ్బంది సమకూరుతుంది.

క్లినికల్, పరిశోధన లేబొరేటరీలు స్థాపించ బడినవి. వీటివల్ల రోగలక్షణాన్ని సరిగా కనిపెట్టి చికిత్స చేయడానికి వీలుంటుంది. హైదరాబాదులో ఒకసేరం ఇనిస్టిట్యూట్ వుంది.

ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తం 36 పశువైద్య ఆస్పత్రులు, 210 ఔషధశాలలు, 27 సంచార బిల్లెట్లు, చెప్పదగినన్ని ప్రథమ చికిత్స కేంద్రాలు వున్నాయి. నిజామాబాదులో లివర్‌ఫ్లూ వ్యాధి నివారణ పథకమూ, 8 యితర జిల్లాలలో రిండర్‌పెస్టు వ్యాధి నిర్మూలన పథకమూ అమలులో వున్నాయి.

ఆబోతుల పెంపకం - పాడి క్షేత్రాలు తొమ్మిదివున్నాయి. 5 కీలక గ్రామ కేంద్రాలున్నాయి. ఇవి అనువైన ఆయా ప్రదేశాలలో నెలకొల్పబడ్డాయి. స్థానికంగా మేలిరకం పశువుల్ని పెంపొందించడానికై ఆయా ప్రదేశాలకి ఆబోతులు సప్లయి చేయబడతాయి. అదే ప్రయోజనార్థం ప్రభుత్వ సంస్థలలోకూడా ఆబోతులు పోషింపబడతాయి. ఒంగోలులో ఒక కాటిల్‌బ్రీడర్సు అసోసియేషన్‌కూడా వుంది.

"పశుగణ సంక్షేమాభివృద్ధులకై చేసే ప్రతి ప్రయత్నము సాధారణ మానవుని ఆర్థిక పరిస్థితిని అభివృద్ధిచేయడానికి చేసే కృషిలో ఒక భాగము" అని పశుపోషణ శాఖ విశ్వాసము.

ఈ శాఖ కార్యక్రమం స్థూలంగా రెండు రకాలని చెప్పవచ్చు. ఒకటి పశు చికిత్స కార్యకలాపాలు, రెండవది పశుగణాభివృద్ధి కార్యక్రమము.

పశువులకు అంటువ్యాధులు సోకకుండా నిరోధించడానికీ, వాటికి సంభవించిన అన్నిరకాల వ్యాధులకు చికిత్స చేయడానికీ ప్రభుత్వం దిగువ సంస్థలను నెలకొల్పినది :

1. పశువైద్య ఆస్పత్రులు : ఇవి జిల్లా ముఖ్యపట్టణాలలో యేర్పాటు చేయబడినవి. జిల్లాలో కొన్ని ముఖ్య ప్రదేశాలలోకూడా- ప్రతిదినమూ చికిత్సపొందే పశువుల సరాసరి సంఖ్య 40 వున్న సందర్భాలలో- యివి యేర్పాటు చేయ

బడినవి. పశువులను ఆస్పత్రిలోవుంచి చికిత్సచేసే సదుపాయం కూడా వుంది. ఈ సంస్థలలో గుర్తించబడిన మేలి జాతి ఆబోతులు వుంచబడతాయి. ఇందువల్ల స్థానికంగా మేలిరకం పశువుల పెంపుదలకు అవకాశం వుంటుంది. రాష్ట్రంలో యిటువంటి ఆస్పత్రులు 36 వున్నాయి.

2. *పశువైద్య ఔషధశాలలు :* ఇవి సాధారణంగా తాలూకా ముఖ్యపట్టణాలలో యేర్పాటుచేయబడతాయి. ప్రతి దినమూ చికిత్సపొందే పశువుల సరాసరి సంఖ్య 20 వున్న ప్రదేశాలలో కూడా యివి నెలకొల్పబడతాయి. వీటిలో పశువులను వుంచి చికిత్సచేసే సదుపాయం కూడా వుంది. రాష్ట్రంలో 45 ఔషధశాలలున్నాయి.

3. *చిన్నచిన్న ఔషధశాలలు :* ఇవి సాధారణంగా పశువులు యెక్కువగా వుండి, పశువైద్య సదుపాయాలు అత్యవసరమైనప్రదేశాలలో యేర్పాటుచేయబడతాయి. అసిస్టెంటు సర్జన్ నెలలో 20 రోజులు యిక్కడ పనిచేసి, మిగిలిన పదిరోజులు ఆయాప్రాంతాలలోని అంటువ్యాధులు మున్నగు వాటి నివారణకై పర్యటన సలుపుతారు. మొత్తం ఆంధ్ర ప్రదేశ్‌లో చిన్నచిన్న ఔషధశాలలు 165 వున్నాయి.

4. *సంచార బిల్లెట్లు :* ఇవి ముఖ్యమైన గ్రామాలలో నెలకొల్పబడతాయి. అసిస్టెంటు సర్జన్ సాధారణంగా 20 రోజులు పర్యటనలో వుండి, 10 రోజులు గ్రామంలోని ప్రధానకార్యాలయంలోపనిచేస్తారు. రాష్ట్రంలో 27 టూరింగు బిల్లెట్లు వున్నాయి.

5. *ప్రథమ చికిత్సా కేంద్రాలు :* ఇవి ముఖ్యమైన గ్రామాలలో యేర్పాటు చేయబడతాయి. అయితే అక్కడి ప్రజలకు పశుచికిత్స అవసరమైవుంది, మందులు మున్నగు వాటి కొనుగోలు నిమిత్తం సాలీనా రూ. 250 యివ్వడానికి వారు సంసిద్ధులై వుండాలి. కేంద్రాన్ని నడపడానికి అద్దె లేకుండా ఒక గదిని, కుర్చీలు మున్నగువాటిని కూడా సమకూర్చాలి. టూరింగు బిల్లెట్టు లేక చిన్న పశువైద్య ఔషధశాల బాధ్యతను వహిస్తున్న అసిస్టెంటు సర్జను వారాని కొక రోజున యీ కేంద్రంలో పనిచేస్తూవుంటారు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మరి 13 ఆస్పత్రులను, 28 పశువైద్య ఔషధశాలలను, 129 చిన్న ఔషధశాలలను, 21 సంచార బిల్లెట్లను, కొన్ని పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రాలను నెలకొల్పాలని సంకల్పించబడింది. ప్రతి తాలూకాలోనూ పై రకాలలో అధమపక్షం ఒకరకం సంస్థ అయినా వుంది.

ప్రతి ఆస్పత్రిలోను ఒక సూక్ష్మదర్శిని, రెఫ్రిజిరేటర్లు వున్నవి. సూక్ష్మదర్శిని సహాయంతో పరీక్షించి రోగ లక్షణాన్ని నిర్ధరిస్తారు. రెఫ్రిజిరేటర్లలో మందులు నిల్వచేస్తారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యింకా యెక్కువగా క్లినికల్ లేబొరేటరీలను స్థాపించాలని సంకల్పించబడింది.

విశదం కాని కొన్నిపశువుల వ్యాధులను పరిశీలించడానికై పరిశోధన లేబొరేటరీలు స్థాపించబడినవి. వీటి బాధ్యత వహిస్తున్న ఆఫీసర్లు పరిశోధనలు జరుపుతారు. చికిత్స విషయంలో ఫీల్డు సిబ్బందికి తోడ్పడతారు.

సుశిక్షితమైన సిబ్బంది కొరతవల్ల గ్రామీణులకు తగినంతగా పశుచికిత్సా సౌకర్యాలు లభించడంలేదని భావించబడింది. ఈ కొరతను తీర్చడానికై వైజాగ్, హైదరాబాదులలో పశుచికిత్స, పశుపోషణలలో యెమర్జెన్సీ కోర్సులు ప్రారంభింపబడినవి. 1955 లో వైజాగ స్కూలులో 150 మంది (120 ఆంధ్ర, 30 ఒరిస్సా) విద్యార్థులు చేర్చుకోబడ్డారు. 1956 లో రెండవ జట్టులో 100 మంది చేర్చుకోబడ్డారు. హైద్రాబాదు స్కూలు 1955 డిసెంబరులో ఆరంభించబడింది. అప్పుడు దీని విద్యార్థుల సంఖ్య 100 (75 సమష్టి హైదరాబాదురాష్ట్రం, 25 ఒరిస్సా.)

ఇవిగాక ఆంధ్ర ప్రదేశ్‌లో- హైదరాబాదు, బాపట్లలలో- రెండు పశువైద్య కళాశాలలున్నాయి.

## లివర్ ఫ్లూ నివారణ పథకం

నిజాంసాగర్ ప్రాంతంలో లివర్ ఫ్లూ నివారణ పథకం అమలులో వుంది. ఈ పథకం పరిష్కరించేసమస్య చాలా పెద్దది. దీనికి ఆర్థికంగా యెంతో ప్రాముఖ్యముంది. ఇది అమలుజరిగే ప్రాంతం విస్తారమైనది. దీని క్రింద బహుళ సంఖ్యాకమైన పశువులు చికిత్సపొందుతాయి. అందుచేత యీ పథకం భారతదేశంలో అమలుజరిగే యీ రకం పథకాలలో మిక్కిలి పెద్దది అని చెప్పవచ్చును. అలాగే యిది ప్రపంచంలో అమలుజరిగే యీ రకం పెద్ద పథకాలలో ఒకటి. ఇది 1942 లో ప్రారంభించబడింది. దీనిని పశుపోషణశాఖ నిర్వహిస్తున్నది. నిజాంసాగర్ అభివృద్ధి ప్రాంతంలో లివర్ ఫ్లూ మున్నగువ్యాధులను నివారించడము, తగిన ప్రదేశాలలో ఆబోతులను నిలిపి తద్వారా స్థానికంగా శ్రేష్ఠమైన పశువుల్ని పెంపొందించడము దీని ఆశయము. నిజామాబాదులో రమారమి 70 ఆబోతులు వున్నాయి. లివర్ ఫ్లూ వ్యాధిని నిరోధించే విధానాన్ని కనిపెట్టడానికి బాన్స్‌వాడలో ఒక ఎక్స్పెరిమెంటల్ కేంద్రం వుంది.

ఈ కార్యక్రమంలో దిగువ అంశాలున్నాయి :

1. లివర్‌ఫ్లూ వ్యాధి రాకుండా మొత్తం పశువులన్నిటికి తగిన మందులు వెయ్యడం.
2. పశువులకు యీ వ్యాధిని వ్యాపింపచేసే నత్తలను నిర్మూలించడం.
3. ఈ వ్యాధి లక్షణాలు, వ్యాధిని నివారించే విధానము మున్నగు విషయాలను పశువులు కలవారికి తెలియ చెప్పడం. ఈ [illegible] ఫలితంగా [illegible] 60 శాతంగా వున్న [illegible] వ్యాధి సంభవాలు 23·8 శాతానికి తగ్గిపోయినవి. ఇందువల్ల పశువుల ఆయుశ్బలాలు బాగా వృద్ధి పొందినవి.

## రిండర్ పెస్టువ్యాధి నిర్మూలన

రాష్ట్రంలోని గోజాతి ప్రతి సంవత్సరము రిండర్‌పెస్టు వ్యాధికి గురిఅవుతున్నది. ఈ వ్యాధివల్ల పెక్కు పశువులు మరణించడమేకాక దానినుంచి తేరుకున్నవి బలహీనమై పోతున్నాయి. ఈ వ్యాధివల్ల మొత్తం దేశంలో 60 శాతం వరకూ గోజాతి పశువులు మరణిస్తున్నాయి. ఇందువల్ల ఆర్థికంగా యెంతోనష్టం కలుగుతున్నది. ప్లానింగు కమీషన్ యీ విషయాన్ని గుర్తించి రిండర్‌పెస్టు నిర్మూలన పథకా న్నొకదానిని అమలులో పెట్టింది. అది మహబూబు నగరం, నల్గొండ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో ప్రారంభింప బడింది. ఈ ప్రణాళిక అమలుకై ప్రతిజిల్లాలోను ఒక పశువైద్య అసిస్టెంటు సర్జను ఆధిపత్యంక్రింద ఒక స్పెషల్‌జట్టు పనిచేస్తున్నది. ప్రతిజట్టుకీ ట్రైలర్‌తో కూడిన ఒక జీపు యివ్వబడింది. ఇందువల్ల ఆసిబ్బంది మారుమూలల గ్రామాలకుకూడా వెళ్లగలుగుతారు. ఈ స్పెషల్‌జట్టు పనిని ఆయా జిల్లాల వెటరినరీ ఆఫీసర్లు అజమాయిషి చేస్తారు. ఎనిమిది జిల్లాల్లోనూ జరిగిన పనిని సమన్వయం చేయడానికి ఒక రిండర్‌పెస్టు ఎరాడికేషన్ ఆఫీసర్ వున్నారు. ఈ ఆఫీసరు ముఖ్య కార్యాలయం నెల్లూరులోవుంది. రిండర్‌పెస్టు వాక్సీను భారతదేశ పశుచికిత్స పరిశోధన సంస్థనుంచి వస్తుంది. ఇది థర్మాస్ ఫ్లాస్కులలోపోసి విమానంద్వారా పంపబడుతుంది. ఆ తరువాత నెల్లూరు, హైదరాబాదులలో కీప్‌ఫ్రీజ్ కాబినెట్లలో నిలువ చేయబడుతుంది. అక్కడినుంచి అది పై జిల్లాలకి మనుషులద్వారా పంపబడుతుంది. ఈ జిల్లాలలో యీ కార్యక్రమం పూర్తిఅయిన పిమ్మట అది ఆంధ్ర ప్రదేశ్‌లో మిగిలిన జిల్లాలకు విస్తరింప చేయబడుతుంది.

## సెరం యిన్‌స్టిట్యూటు

సెరం యిన్‌స్టిట్యూటు హైదరాబాదులో 1947లో నెలకొల్పబడింది. ఇది త్వరితగతిని అభివృద్ధి చెందింది. ఇది 1956 - 57లో (ప్రారంభింప బడిన 9వ సంవత్సరంలో) వివిధ రకాలకు చెందిన [illegible] 23,75,200 డోసులను తయారు చేయగలిగింది.

ఆంధ్రప్రదేశ్ మొత్తంఅవసరాలకు సరిపడ వివిధ రకాల మందుల్ని పెద్ద యెత్తున తయారు చేయడానికి వీలుగా యీసంస్థ ఆధునిక పద్ధతులలో నడుపబడాలి. ఇందుకై దీనిని ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద విస్తృతీకరించాలని తలపెట్టబడింది.

## 2. పశుగణము

ఆంధ్ర ప్రదేశ్‌లో కనబడే వివిధరకాల పశువులు అవి నివసించే ప్రదేశం స్వభావానికీ, అక్కడ వుండేపనికీ మిక్కిలి తగివున్నాయి. గ్రామంలోవున్న పరిస్థితులలో ఆవులు యెక్కువ పాలుయివ్వవు. పాడి ప్రయోజనాలకి సాధారణంగా గేదెలు మేపబడతాయి. అయినప్పటికీ కూడా ఆవుల్ని పొలంలోమేపి సరిగా పోషించినట్లయితే అవి పాలను బాగానేయిస్తాయి. ఈజాతుల అభివృద్ధి కనవసరమైన చర్యలు ప్రభుత్వ పశుగణాభివృద్ధి క్షేత్రాలలో తీసుకొన బడుతున్నాయి. వీటి అభివృద్ధికై దిగువ పద్ధతులు వుపయోగింప బడుతున్నాయి.

1. శ్రేష్ఠమైన ఆబోతుల వుపయోగం.
2. సరియైన మేత, పోషణ.

పశుగణాభివృద్ధి క్షేత్రాల జాబితా, అక్కడ జరిగే కృషి వివరాలు మున్నగు విషయాలు సంక్షేపంగా దిగువ పేర్కొన బడినవి. ఈ క్షేత్రాలలోని శ్రేష్ఠమైన ఆబోతులు స్థానికంగా శ్రేష్ఠమైన పశువుల పెంపుదలకు వుపకరిస్తాయి.

1. *విశాఖపట్నం పాడిపరిశ్రమ క్షేత్రం* : ఈ క్షేత్రం వాల్తేరు రైలుస్టేషనుకు 5 మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ ముర్రాజాతి గేదెలు మాత్రం పోషింపబడుతున్నాయి. ఇక్కడ వివిధ తరగతులకు చెందిన పశువులు 500 వరకు వున్నాయి. ఇక్కడ వుత్పత్తిఅయ్యే పాలు ప్రభుత్వ ఆసుపత్రులకు, యూనివర్సిటీ హాస్టలుకు, ప్రజలకి కూడా సప్లయి

చేయబడతాయి. ఈ క్షేత్రం మొత్తంవైశాల్యం 165 యెకరాలు. దీనిలో 103 యెకరాలు సాగుక్రింద వున్నాయి.

2. *గుంటూరు ప్రభుత్వ పశుగణాభివృద్ధి క్షేత్రము :* ఇది గుంటూరుకి 5 మైళ్ళ దూరంలోవుంది. యిప్పుడు యీ క్షేత్రంలో ఒంగోలు జాతిపశువులు, కొన్ని ముర్రాజాతి గేదెలు వుండేవి. ఇప్పుడు ఒంగోలుజాతి పశువులు యితర క్షేత్రాలకి తరలించబడినవి. గుంటూరులో హెచ్చుతూవున్న పాల అవసరాలను తీర్చుటానికై ముర్రా గేదెలు మాత్రమే యిక్కడ వుంచబడినవి, ఇక్కడవాలు గుంటూరు ఆస్పత్రులకు, హాస్టళ్ళకి, ప్రజలకి సప్లయి చేయబడతాయి. ఇక్కడ పోషించబడిన పోతులు వివిధ ప్రణాళికల క్రింద గ్రామీణులకు సప్లయి చేయబడతాయి. ఈ క్షేత్రం మొత్తం వైశాల్యం 355 యెకరాలు. దీనిలో 200 యె. సాగుక్రింద వున్నాయి. మిగిలినది పచ్చిక బయలు.

3. *చింతలదేవి (నెల్లూరుజిల్లా) ప్రభుత్వ పశుగణాభివృద్ధి క్షేత్రము :* ఇది కావలికి 36 మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ ఒంగోలుజాతి పశువులు క్రమబద్ధమైన పద్ధతిలో చక్కగా పోషింపబడతాయి. ఆవిధంగా వాటి పాల వుత్పత్తిశక్తి పెంపొందించ బడుతుంది. ఇక్కడ శ్రేష్ఠమైన ఆబోతులు కూడా పెంచబడుతాయి. ఇవి రైతులకు అమ్మడానికీ. ప్రభుత్వశాఖ అమలు జరిపే ప్రణాళికలకు కూడా వినియోగింప బడతాయి. ఈ క్షేత్రంలో 438 పశువులు వున్నాయి. దీని విస్తీర్ణం 772 యెకరాలు. దీనిలో 225 యె. సాగుక్రింద వున్నాయి.

4. *బనవస్త (కర్నూలు జిల్లా) పశుగణాభివృద్ధి పాడి పరిశ్రమ క్షేత్రం :* ఇది ఆదోని - యెమ్మిగనూరు రోడ్డు మీద ఆదోనికి 16 మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ హల్లీకార్ జాతి పశువులు పోషింపబడుతున్నాయి. వాటి సంఖ్య 106. ఇవిగాక 28 ముర్రాగేదెలు వున్నాయి. వీటిపాలు ఆదోని ప్రజలకు సప్లయి చేయబడతాయి. తుంగభద్రా ప్రాజెక్టు ప్రాంతానికి హల్లికార్ జాతి యెడ్లను సప్లయి చేయడం యీ క్షేత్రం ఆశయం.

5. *మహానంది పశుగణాభివృద్ధి క్షేత్రం :* ఇది కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలోని గాజులపల్లి రైలుస్టేషనుకి 2 మైళ్ళ దూరంలోవుంది. ఇంచుమించు అదృశ్య మౌతున్న దూపాడుజాతి పశువుల్ని పునరుద్ధరించడం యీ క్షేత్రం ఆశయం. ఇక్కడ ఒంగోలు, గీర్ జాతి పశువులు కూడా పెంచబడుతాయి, ఇక్కడ 154 పశువులున్నాయి. ఈక్షేత్రం వైశాల్యం 339 యెకరాలు. దీనిలో 137 యెకరాలు సాగు క్రింద వున్నాయి.

6. *పలమనేరు (చిత్తూరు జిల్లా) పశుగణాభివృద్ధి క్షేత్రం:* ఇది [illegible] మైళ్ళ దూరంలోవుంది. ఇక్కడ పుంగనూరు. సింధీ. ఒంగోలు, హల్లికార్ మున్నగు రకాల పశువులు 154 వున్నాయి. పుంగనూరుజాతి పాల వుత్పత్తికి ప్రసిద్ధి కెక్కినది. కాని ఈ జాతిపశువులు [illegible] అదృశ్యమయినవి. వాటిని పునరుద్ధరించటం యీ క్షేత్రం ఆశయం. కర్రిజాతి యెడ్లు విదేశాలనుంచి తెప్పించబడినవి. వీటిలో మనజాతి పశువుల సంయోగానికి సంబంధించిన ప్రయోగాల నిమిత్తం అవి యిక్కడ పోషింపబడుతున్నాయి. ఈ క్షేత్రం మొత్తం విస్తీర్ణం 1,046 యె. దీనిలో 16. యె. లు సాగు క్రింద వున్నాయి.

7. *చింతపల్లి పశుగణాభివృద్ధిక్షేత్రం :* ఇది విశాఖపట్నం జిల్లా ఏజన్సీ ప్రాంతంలో నరసీపట్నం రోడ్డుకి యించుమించు 40 మైళ్ళ దూరంలోవుంది. పాడిపరిశ్రమతో సహా పశుపోషణకి సంబంధించిన సర్వవిషయాలను పశువుల పెంపకం దారులకు తెలియ చెప్పడం యీ క్షేత్రం ఆశయం. ఏజన్సీ ప్రాంతానికి సప్లయి చేయడానికై యిక్కడ స్వచ్ఛమైన ఆబోతులు కూడా తయారుచేయ బడుతాయి. ఇక్కడ సింధీ రకం పశువులు 32 వున్నాయి. దీని వైశాల్యం 1,000 యెకరాలు.

8. *కరీంనగరం పశుగణాభివృద్ధి క్షేత్రం :* ఇది కరీంనగరంజిల్లాలో వుంది, మాల్వీజాతిపశువుల అభివృద్ధికై యిది 1950 లో ప్రారంభించ బడింది. ఇక్కడి ఆబోతులు జిల్లాలలోని పశువుల పెంపకందారులకు సప్లయి చేయబడతాయి.

9. *రాజేంద్రనగర్ పశుగణాభివృద్ధి, పాడి పరిశ్రమ క్షేత్రం :* ఇది హైదరాబాదు నగరానికి 7 మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడ పెక్కు దియోనీజాతి ఆవులు. మరాట్వాడా, ముర్రా గేదెలు పోషించబడు తున్నాయి. ఇక్కడ వుత్పత్తి అయే పాలు హైదరాబాదు నగరానికి సప్లయి చేయబడతాయి. ఈ పశువులతో సెలెక్టివ్ బ్రీడింగు మున్నగు ప్రయోగాలు జరుపబడుతూ వుంటాయి. స్థానిక మరాట్వాడా గేదెలకు ముర్రా పోతులతో సంయోగం కలిగించి తద్వారా వాటి సంతానానికి యెక్కువ పాలు యిచ్చే గుణాలను కలిగించే విషయంలో కూడా యిక్కడ ప్రయోగాలు జరుపబడుతున్నాయి. ప్రస్తుతం యిక్కడ వుత్పత్తి అయే పాలు ప్రభుత్వ ఆస్పత్రులకి, ప్రజలకి సప్లయి చేయబడు తున్నాయి.

ఇక్కడ తయారైన ఆబోతులు అవసరమైన వారికి అమ్మ బడతాయి.

## కీలక గ్రామ ప్రణాళిక

కీలక గ్రామ ప్రణాళిక లక్ష్యం మన పశువుల పాల ఉత్పత్తి శక్తిని, పనిచేసే శక్తిని క్రమేణా అభివృద్ధి పర చడం. [illegible] లను లోతుగా పరిశీలించిన పిమ్మట యీ ప్రణాళిక రూపొందించబడినది.

కీలక గ్రామం అంటే పశుగణాభివృద్ధికి తీవ్రమైన కృషి జరిగే ప్రదేశం. దీనిలో ఒక గ్రామం కాని లేక కలిసి వున్న కొన్ని గ్రామాలుకాని ఉండవచ్చును. ఇక్కడ మొత్తం యించుమించు 500 ఆవులు లేక బఱ్ఱెలు వుండాలి. వాటి వయస్సు 3 సంవత్సరాలకు పైబడి వుండాలి. ఈ లక్షణాలు కలిగిన ప్రదేశాన్ని కీలక గ్రామం అంటారు. ఇక్కడ కొన్ని ఆబోతులు వుంచబడతాయి. ఇవి మామూలుగాకాని లేక కృత్రిమవీర్య ప్రదానానికి కాని వినియోగించ బడతాయి. ఈ ప్రదేశంలోగల అన్ని నాసిరకం యెద్దులకు, ఆమోదింపబడని యెద్దులకు విత్తు కొట్టబడుతుంది. లేదా అవి ఆ ప్రదేశంనుంచి తొలగించ బడతాయి. ఆ విధంగా నాసిరకం యెడ్లతో సంయోగం నివారించ బడుతుంది. ఈ కీలక గ్రామాలలోని ఆబోతులు సాధారణంగా నాలుగు సంవత్సరాల కొకమారు మార్చబడుతూ వుంటాయి. ఈ విధంగా కీలకగ్రామ ప్రాంతంలోని పశువులు 4,5 తరాల నాటికి శ్రేష్ఠమైన పశువులుగా తయారవుతాయి. ఇక్కడ పశుగణాభివృద్ధికి సంబంధించిన అన్ని పనులు శాస్త్రీయ పద్ధతిలో జరుపబడతాయి.

తమ పశువులకు శ్రేష్ఠమైన జాతులతో సంయోగం కలిగించి తద్వారా ఉత్తమమైన పశుసంతతిని అభివృద్ధి పరచుకోమని కీలకగ్రామ ప్రణాళికక్రింద పనిచేసే సిబ్బంది ఆయా ప్రాంతాలలోని పశువుల పెంపకందారులకు సలహా యిస్తారు. కీలక గ్రామప్రదేశాలలో అమలులోవున్న పశుగణాభివృద్ధి చట్టం యీ ప్రణాళిక ఆశయ సిద్ధికై తోడ్పడుతుంది. ఈ చట్టం నిబంధనల క్రింద బ్రాహ్మినిబుల్సు తప్ప మిగిలిన నాసిరకం యెడ్లన్నిటికి విత్తు కొట్టబడుతుంది.

పాడి పశువులలో పాలవృద్ధికి, పొలం పశువులు బాగా పనిచేయగలగడానికి పశువులకు ఖనిజములు మున్నగు వాటితో కూడిన సతులాహారం యెంతఅవసరమో పశువుల పెంపకందారులకు వివరించబడుతుంది. అన్నికాలాలలోనూ పశువులకు స్వయంగా మేతను సమకూర్చుకోడానికై పచ్చిక బయళ్ళను అభివృద్ధిపరచుకోమనీ, పశుగ్రాసం మున్నగు వాటిని పెంచమనీ తరుచు వారికి చెప్పబడుతూవుంటుంది.

ఆంధ్ర ప్రదేశ్ మొత్తంలో 5 కీలక గ్రామ కేంద్రాలు వున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద మరికొన్ని కేంద్రాలను ఆరంభించాలని సంకల్పించబడింది.

### పశుగణాభివృద్ధి ప్రణాళికలు

1. ఒంగోలు జాతి [illegible] అసోసియేషన్ : ప్రసిద్ధమైన ఒంగోలుజాతి పశువులను పెంచేవారికి తోడ్పడే వుద్దేశంతో ప్రభుత్వం యీ సంఘాన్ని యేర్పాటుచేసింది. ఈ సంఘం కార్యదర్శి ఒక ప్రభుత్వోద్యోగి— పశువైద్య అసిస్టెంటు సర్జన్. ఇతని ముఖ్యకార్యాలయం ఒంగోలులో వుంది. ఇతనికి తోడ్పడ్డానికి ఇతనిక్రింద కొంత [illegible] సిబ్బంది వుంది. ఈ సిబ్బంది పశువుల పోషణ, బ్రీడింగు, నిర్వహణ మున్నగు విషయాలను సలహాలనిస్తుంది. మార్కెటింగు సౌకర్యాలను కలిగిస్తుంది. ఇంతేకాక యీ సిబ్బంది పశువుల అంటువ్యాధుల నివారణ మున్నగు విషయాలలో కూడా తోడ్పడుతుంది.

2. *క్రాస్ బ్రీడింగు స్కీము* : ఇది ఇండియన్ కౌన్సిలు యొక్క వ్యవసాయ పరిశోధన ప్రణాళిక. దీని ముఖ్య కార్యాలయం విశాఖపట్నంలో వుంది. కొండ ప్రాంతాలలో తక్కువపాలు యిచ్చేరకాల పశువుల పాలవుత్పత్తి శక్తిని పెంపొందింపచేసే వుద్దేశంతో యిది మంజూరు చేయ బడింది. ఈ ప్రణాళికలో జెర్సీయెడ్ల వీర్యం వుపయోగింప బడుతుంది. ఇవి బెంగుళూరులోని ఇండియన్ పాడిపరిశ్రమ పరిశోధన సంస్థలో పోషించబడుతున్నాయి. ఇక్కడినుంచి వీర్యం విశాఖపట్నానికి విమానంలో పంపబడుతుంది. అక్కడి పశువులకు అది కృత్రిమంగా యెక్కించ బడుతుంది.

## 3. బ్రీడింగ్ బుల్ స్కీము

1. *ప్రీమియర్ స్కీము* : ఈప్రణాళిక ప్రకారం గుర్తించ బడిన రకాలకు చెంది, ఆమోదించబడిన యెద్దును పెంచే రైతుకి వాని పోషణనిమిత్తం రు. 200లు గ్రాంటు యివ్వ బడుతుంది. అయితే మేత మున్నగు విషయాలలో పశు పోషణశాఖ విధించే షరతులను అతడు పాటించవలసి వుంటుంది. ఈ ప్రణాళికక్రింద ఒకయెద్దు సాధారణంగా 3 సంవత్సరా లుండవచ్చును. ప్రస్తుతం దీనిక్రింద యించుమించు 494 యెడ్లు వున్నాయి.

2. *జిల్లాబోర్డు స్కీములకి గ్రాంటు ఇన్ ఎయిడ్* : ఈప్రణాళికక్రింద జిల్లాబోర్డు ఆమోదించబడిన యెడ్లను సప్లయి చేస్తుంది. ఎడ్ల ఖరీదులో 2/5 వంతుల్ని ప్రభుత్వం భరిస్తుంది. క్రిందటి యేడాది యీ ప్రణాళికక్రింద 32 యెడ్లు పంపిణీ చేయబడినవి.

3. *ఎడ్ల పంపిణీ పథకం* : ఈ ప్రణాళికక్రింద యోగ్యులైన రైతులకు యెడ్లు సప్లయి చేయబడతాయి. మూడు సంవత్సరాలు అవి సక్రమంగా పోషించబడిన తరువాత అవి వారి స్వంతంగా ప్రకటింపబడతాయి. క్రిందటి యేడాది యీ ప్రణాళికక్రింద 30 యెడ్లు పంపిణీ చేయబడినవి.

4. *పశువైద్య సంస్థలలో యెడ్లు* : అన్నిజిల్లాల ముఖ్య పట్టణాల ఆస్పత్రులలోనూ, ఒక్కొక్కప్పుడు పశువైద్య ఔషధశాలలలోనూ కూడా ఆ బోతులు పోషించబడుతూ ఉంటాయి. [illegible] ఉపయోగించబడతాయి.



* బాలనేరముల నివారణ * (*54వ పేజీ తరువాయి*)

ఆటపాటలు ఏర్పాటు చెయ్యాలి ఈ ప్రయత్నంలో కూడ తప్పక సహకరించినప్పుడే ఈ ఉద్యమం సత్ఫలితాలను సాధించ గల్గుతుంది.

బాలనేరస్థులను సక్రమశిక్షణలో ఉంచటానికి అన్ని దేశాల ప్రభుత్వాలు చాలా మంచి పద్ధతులను ప్రవేశ పెడుతున్నవి. బాలనేరస్థులను విచారించేందుకు మన దేశంలో ప్రత్యేకమైన న్యాయస్థానాలు ఏర్పడినవి. వాళ్ళకి ప్రత్యేకమైన పాఠశాలలు వసతిగృహాలు నెలకొల్పటం జరిగింది. బోర్‌స్టల్ సర్టిఫైడ్ స్కూళ్ళు ప్రొబేషన్‌శాఖ ఈఉద్యమంలో ప్రముఖపాత్ర వహించి ప్రశంసనీయమైన అభివృద్ధిని సాధించినవి. ఈసంస్థల సత్ప్రయోజనాలను నానాటికీ ప్రజలు బాగా గుర్తించ గలుగుతున్నారు. బాలకుల చిత్తవృత్తులు చెడుదారులలో పడకుండా మంచి మార్గాలలో నడిపించడం ఏ ఒక్క సంస్థగాని, అధికారిగాని సాధించగలిగిన స్వల్ప విషయం గాదు. ప్రతిపౌరుడు తన బాధ్యతను గుర్తించి నిర్వర్తించి నప్పుడే యీ ఆశయం సఫలం కాగలదు. సంఘసేవా సంస్థలన్నీ ఈ ఉద్యమాన్ని తమ సేవా ప్రణాళికలో ఒకముఖ్యమైన అంశంగా పరిగణించి పని చెయ్యాలి. అనతికాలంలో మన ఆంధ్రప్రదేశ్ బాల నేరస్థులను సంస్కరించి సన్మార్గాలకు మళ్ళించే సంస్థలు చాలా ఏర్పడి బాగా కృషిచేసి మంచిఫలితాలను సాధించగలవని ఆశిస్తున్నాను. ప్రొబేషన్‌శాఖ విస్తరించి ప్రశస్తమైన కృషి సాగించి జయప్రదం కాగలదని ఆశిస్తున్నాం

**49 వ పేజీలో ప్రశ్నలకు జవాబులు**

1. (1) గుంటూరు - 2,549,996 ; (2) తూర్పు గోదావరి - 2,414,808 ; (3) శ్రీకాకుళం - 2,123,136 ; (4) విశాఖపట్నం - 2,072,698.
2. (1) కర్నూలు - 9,275,000 చదరపుమైళ్ళు, (2) నెల్లూరు 7,942,000 చ. మైళ్ళు. (3) అనంతపురం - 7,387,000 చ. మైళ్ళు. (4) మహబూబునగరం - 6,833,000 చ. మైళ్ళు.
3. 26,450
4. 293
5. 25,821,679
6. 5,438,454




ఫిబ్రవరి 1957

1. కాశీ-కన్యాకుమారి జాతీయ రహదారిమీద, కర్నూలుకు 3 మైళ్ళ దూరములో తుంగభద్రమీద వంతెనకు ముఖ్యమంత్రి శంఖుస్థాపన చేశారు.

2. కాశ్మీరు వ్యవహారంలో పాకిస్థాన్ వైఖరికీ, అక్కడ జరిగిన రౌడీప్రదర్శనలకు అసమ్మతి సూచకంగా 20000 లకు పైగా కళాశాల, పాఠశాలల విద్యార్థులు "అసమ్మతిదినం" సందర్భంగా ప్రదర్శనలు చేశారు.

3. హైదరాబాదులోని నిలోఫర్ ఆసుపత్రిలో అఖిల భారత పెడియాట్రిక్ కేంద్రము స్థాపించవలసిందని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి సిఫార్సుచేసింది.

4. రాష్ట్రంలోని జైళ్ళలోనుండి సత్ప్రవర్తన గల కొందరు ఖైదీలను "ఆదర్శజైలుకు" పంపే ప్రతిపాదనకు రాష్ట్రప్రభుత్వం సూత్రప్రాయంగా అంగీకరించింది.

5. పెనకచర్ల వద్ద పెన్నారెగ్యులేటర్ నిర్మాణాన్ని ప్రభుత్వం మంజూరు చేసిందని ముఖ్యమంత్రి పత్రికా విలేఖరుల గోష్ఠిలో ప్రకటించారు. అనంతపురం, కడప జిల్లాలలోని కరువు ప్రాంతాలకు ప్రయోజనకరంగా తుంగభద్రను పెన్నానదితో కలిపేపథకంలో భాగంగా రెగ్యులేటర్ నిర్మాణానికి యిటీవల కొన్ని నెలలక్రితం శంఖుస్థాపన చేయబడింది.

6. సోవియట్ యూనియన్ రక్షణశాఖామాత్యులు మార్షల్ ఝుకోవ్ విశాఖపట్టణంలోని హిందూస్థాన్ నౌకానిర్మాణశాలను సందర్శించారు.

న్యూఢిల్లీనుండి విడుదలయిన ఒక పత్రికా ప్రకటననుబట్టి ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 389 మిలియన్ టన్నులవరకు లభించగల ముడియినుముగనులను యిండియా ప్రభుత్వ భూగర్భ పరిశోధనశాఖవారు కనుగొన్నట్లు తెలుస్తున్నది.

7. సహకార విషయాలమీద ప్లానింగు కమిషన్‌కు బ్రిటిష్ సలహాదారు సర్ మాల్‌కామ్ డార్లింగ్, రాష్ట్ర సహకారశాఖ అధికార్లతో మూడు రోజులుగా జరిపిన చర్చలు పూర్తిచేశారు.

8. దేశంలో పరీక్షల విధానాన్ని సంస్కరించే విషయములో చాలా జాగ్రత్తగా ఆలోచించుకుని విధానము నిర్ణయించటం అవసరమని [illegible] విద్యాలయాల ఉపాధ్యక్షులు సలహా యిచ్చారు.

9. మరణ శిక్షను యావజ్జీవ శిక్షగా మార్చే ప్రస్తుత ఆచారాన్ని కొనసాగించవలసిందిగా 7 గురు లోక్‌సభ సభ్యులు ఒక ప్రకటనలో ప్రభుత్వాన్ని కోరారు. "నలభై సంవత్సరాలనుండి పూర్వ హైదరాబాదు ప్రభుత్వం అనుసరించిన యీ విధానం, హైదరాబాదులో యికముందుకూడా కొనసాగుటేకాకుండా యావద్భారతదేశంలోనూ ఒక ఆదర్శ కరమయిన విధానముగా యిది అనుసరింపబడాలని మా ఉద్దేశం" అనికూడా వారు తమ ప్రకటనలో పేర్కొన్నారు.

10. ఆర్థిక కమిషన్ సభ్యులు గవర్నరును, ఆర్థిక మంత్రిని కలుసుకున్నారు. రాష్ట్ర మంతటికీ వర్తించే విధంగా సమగ్రమైన ఒక సేల్సుటాక్సు చట్టం చేయుటకు ప్రభుత్వం నిశ్చయించినదని ఆర్థికమంత్రి పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

11. యిటీవల జరిగిన రాష్ట్ర పునర్నిర్మాణ కార్యక్రమాల పర్యవసానంగా యీ రాష్ట్రం అనేక చిక్కులను ఎదుర్కొంటున్న కారణంగా, నిధుల కేటాయింపునుగురించి యీ రాష్ట్రం చేసుకున్న విజ్ఞాపనలు సానుభూతితో పరిశీలింపబడగలవని ఆర్థిక కమిషన్ అధ్యక్షులు చెప్పారు.

12. మార్చి 20 తో ప్రారంభమయ్యే రాష్ట్ర శాసన సభలో ప్రధాన చర్చనీయాంశమైన నాలుగుమాసాల తాత్కాలిక బడ్జెట్ ప్రతిపాదనలకు మంత్రివర్గం తుది స్వరూపమిచ్చింది,

13. దక్షిణమండల కౌన్సిల్ ప్రధానకార్య స్థానం మద్రాసు రాష్ట్రంలో ఉండాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది.

ప్రభుత్వం ప్రత్యేకంగా అనుమతి యిస్తేతప్ప, లేకపోతే ఒక భార్యగల పురుషులను పెండ్లి చేసుకున్న స్త్రీ అభ్యర్థినులకు ప్రభుత్వ ఉద్యోగాలలోచేరే అర్హత వుండదని ప్రభుత్వం నిర్ణయించింది.

14, స్థానిక అభివృద్ధి కార్యక్రమాలు యీ ఆర్థిక సంవత్సరాంతంలోగా పూర్తి చేయుటకై వాటిని తక్షణమే ప్రారంభించాలని రాష్ట్రంలోని 20 జిల్లాల కలెక్టర్లను ప్రభుత్వం ఆదేశించింది.

తెలంగాణాలో జరుగుతున్న కల్లుగీత పారిశ్రామికుల సత్యాగ్రహోద్యమం విరమించబడింది.

15, రాష్ట్ర ప్రభుత్వపు ఆర్థిక యిబ్బందులదృష్ట్యా ద్వితీయ ప్రణాళిక కాలంలో తెలంగాణా ప్రాంతంలో మద్యనిషేధం అమలుపరచ బడదని ఆర్థికమంత్రి పత్రికా ప్రతినిధుల గోష్టిలో ప్రకటించారు.

16. "స్టేట్ ఆఫ్ కచ్" నావకు సహచారి నౌకయైన "స్టేట్ ఆఫ్ ఒరిస్సా" నౌక, యిప్పటికి నౌకా నిర్మాణ కేంద్రంలో నిర్మింపబడిన డీసెల్ నౌకలలో పెద్దది. యీ నౌకకు జల ప్రవేశోత్సవం జరిగింది.

17. ద్వితీయప్రణాళిక ద్వితీయ సంవత్సరంలో (1957-58) రాష్ట్ర ప్రభుత్వం, వ్యవసాయాభివృద్ధికి రు 117 లక్షల ఖర్చుగల పథకాలను అమలు పరచాలని సంకల్పించింది.

18. సత్యాగ్రహం విరమించ బడినందున, కల్లుగీత పారిశ్రామికులమీద పెట్టబడిన కేసులను ఉపసంహరించటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

19. చేనేతవస్త్రాల అమ్మకం మీద రూపాయికి రెండణాలు రిబేట్ యివ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది.

20. ద్వితీయ ప్రణాళిక ద్వితీయ సంవత్సరంలో (1957-58) అమలు పరచవలసిన అభివృద్ధి పథకాలను గురించిన సమస్త వివరాలను వచ్చే ఆరు వారాలలో తయారు చేయుటకు ప్రభుత్వం నిశ్చయించింది. ఏప్రియల్ 1 వ తేదీనుండియే పనులు ప్రారంభించుటయీ సన్నాహము ఉపకరిస్తుంది.

రాష్ట్రమంతటా సిమెంటు పంపిణీలో ఒకే విధానము తక్షణమే అమల్లోకి వస్తుంది.

21. రాష్ట్రంలోని తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలలోని ఉద్యోగుల సర్వీసులను సంలీనము చేయుటకునూ, అన్ని తరహాల ప్రభుత్వోద్యోగాలలోనూ సమానమైన తరగతులను నిర్ణయించుటకునూ మూడు అధికార సంఘాలను నియమించాలని ప్రభుత్వంనిశ్చయించింది.

22. ప్రధానమంత్రి నెహ్రూ ఎన్నికల ప్రచారం నిమిత్తం హైద్రాబాదుకు వచ్చారు. సుమారు 2 లక్షలకు పైగా ప్రేక్షకులు గల ఫతేమైదాన్ బహిరంగ సభలో 90 నిముషాలసేపు ఉపన్యసిస్తూ శ్రీ నెహ్రూ జాతిద్వయ సిద్ధాంతం ప్రాతిపదికగా పాకిస్థాన్ నిర్మాణాన్ని యిండియా ఏనాడూ అంగీకరించలేదనీ, ప్రాంతీయ ప్రాతిపదిక పైననే అది జరిగిందని పేర్కొన్నారు.

23. [illegible] ఆలిండియా రేడియో హైద్రాబాదు కేంద్రమునుండి ప్రసంగిస్తూ ద్వితీయ ప్రణాళిక కాలంలో సగటు వ్యక్తి విద్యుచ్ఛక్తి వినియోగం సుమారు 20 యూనిట్ల వరకు పెరుగుతుందని ఉద్ఘాటించారు.

24. ఇండియాలో జరుగుతున్న సాధారణ ఎన్నికలలో ఒరిస్సా, పంజాబు రాష్ట్రాలలోని 10 పార్లమెంటు, 16 శాసనసభ నియోజకవర్గాలలో మొట్టమొదటిదఫా పోలింగ్ జరుగుతుంది.

25. ఆంధ్రప్రదేశ్‌లోని 24 లోక్‌సభ, 13 అసెంబ్లీ నియోజక వర్గాలలో యీ ఉదయం పోలింగ్ ప్రారంభమవుతుంది.

ప్రభుత్వోద్యోగుల పరిస్థితులను చక్కబరచటానికై రాష్ట్ర ప్రభుత్వానికి సహాయం చేయనుద్దేశించిన కొన్ని నిబంధనలతో యిండియా ప్రభుత్వంనుండి రాష్ట్ర ప్రభుత్వానికి ఒకలేఖ వచ్చింది.

26. సంస్కృత కమిషన్‌వారికి సమర్పించిన నివేదికలో ప్రభుత్వం, సంస్కృతాభ్యాసము విద్యార్థుల ఐచ్ఛిక విషయముగా చేయుటయే తమ విధానమనీ, దానిని నిర్బంధ పఠనీయాంశముగా చేయుటలేదనీ పేర్కొన్నది. హైద్రాబాదులోని ప్రభుత్వ సాంకేతిక కళాశాల కాలేజీ దినోత్సవానికి అధ్యక్షత వహించిన సందర్భంలో, అఖిలభారత సాంకేతిక విద్యాసంఘంవారు ఆంధ్ర ప్రదేశ్‌లో రెండు పాలీటెక్నిక్ కళాశాలలను మంజూరు చేశారని ప్రభుత్వ విద్యాశాఖా కార్యదర్శిగారు వెల్లడించారు.

27. రాష్ట్రంలోని గిరిజనుల సంక్షేమం నిమిత్తం ద్వితీయ ప్రణాళికలో రు 200.52 లక్షల మొత్తాన్ని ప్రభుత్వం కేటాయించింది.

28. న్యూ ఢిల్లీనుండి విడుదలైన ఒక అధికార ప్రకటన ననుసరించి, తుంగభద్ర ఆనకట్టవద్ద గల హంపీ పవర్‌హౌస్ యీ సంవత్సరం ఏప్రిల్‌నుండి పని ప్రారంభిస్తుందని తెలుస్తున్నది.

# మార్చి 1957

1. రాష్ట్రప్రభుత్వం హైదరాబాదు నగరంలో మురికిపేటల నిర్మూలనకొరకై రెండు పథకాలను చేపట్టనున్నది. ఈ రెండుపథకాలకు రూ. 25 లక్షలు వ్యయం కాగలవని అంచెనా వేయబడింది.

2. తెలంగాణా ప్రాంతంలో 1957-58 ఆర్థిక సంవత్సరంలో 6,150 అంబర్ చర్ఖాలను ప్రవేశపెట్టడానికి హైద్రాబాదు ఖాదీగ్రామీణ పరిశ్రమలబోర్డువారు తలపెట్టారు.

3. ఆంధ్ర గిరిజనుల సహకార ఆర్థికాభివృద్ధి కార్పోరేషన్ కొరకై రూ. 5 లక్షలు గ్రాంటుగా ఇవ్వవలసిందిగా రాష్ట్రప్రభుత్వం యూనియన్ ప్రభుత్వాన్ని అర్థించింది. ఈ గ్రాంటు కాలదోషంపట్టి చెల్లు అయిపోకుండా ఉండవలెనని కూడా రాష్ట్ర ప్రభుత్వం కోరింది.

4. బొగ్గుపొడిని పొగరాని వంటచెరకుగా (కుటుంబాల ఉపయోగానికి) అప్‌గ్రేడుచేసి వినియోగానికి తేవడానికై మూడు ఫ్యాక్టరీలను నెలకొల్పడానికై భారత ప్రభుత్వం ఒక ప్రతిపాదనను పరిశీలిస్తూ వుంది. ఈ మూడుఫ్యాక్టరీలలో ఒకటి ఆంధ్రప్రదేశ్‌లోని కొత్తగూడెంలోను, రెండవది బీహారు రాష్ట్రంలోని రాణీగంజ్‌లోను, మూడవది మద్రాసురాష్ట్రంలోని నెవెల్లీలోను నెలకొల్పబడుతాయి.

5. ఉస్మానియా వైద్య కళాశాల నిమిత్తం రూ. 50 లక్షల వ్యయంతో నూత్నభవనాలను నిర్మించడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించి, అందుకొరకై ప్రస్తుత సంవత్సరపు బడ్జెట్‌లో రూ. 10 లక్షలు కేటాయించింది.

6. చేనేత పరిశ్రమను ఉద్ధరించడానికై మిల్లు వస్త్రం అమ్మకంపై సెస్సుద్వారా వసూలవుతున్న మొత్తంకంటె హెచ్చు మొత్తాలను కేటాయించడానికి భారతప్రభుత్వం సిద్ధంగా వున్నదని యూనియన్ ఆర్థిక మంత్రి ప్రకటించారు.

7. భారత సైనిక దళాధిపతి జనరల్ యస్. యం శ్రీ నగేశ్ సైన్యంలో 34 సంవత్సరాల సర్వీసుచేసిన మీదట హైదరాబాదులో పదవీ విరమణ చేశారు.

8. రైలుమార్గాల పరిమాణాన్ని హెచ్చించడం, రైళ్ళను సగటువేగంతో నడపడం, ఉత్తమమైన సిగ్నలింగ్ పద్ధతులు — ఈ చర్యలను తీసుకోవడంవల్ల భారతీయ రైల్వేల అవసరాలు చాలావరకు తీరగలవని భారతరైల్వేల పరిశీలనకొరకై నియమింపబడిన అమెరికన్ ఇంజనీర్లజట్టుయొక్క ప్రాజెక్టు మేనేజర్ హైదరాబాదులో అన్నారు.

9. మైకా అమ్మకం. నిలువ, రవాణాలను అదుపులో పెట్టే ఉద్దేశంతో ప్రభుత్వం ఒక బిల్లును తయారు చేసినట్లు ప్రకటించబడింది. ఈ బిల్లువల్ల ప్రభుత్వానికి రాయల్టీ చెల్లింపుల ఎగవేత, పన్నుల ఎగవేత మొదలగు అక్రమాలు నివారింప బడగలవు.

ఒక క్యాలెండర్ నెలలో రాష్ట్రంలోని సిమెంటు వ్యాపారస్థులకు వచ్చే సిమెంటు నిలువలను పంపిణీ చేయడానికై ప్రభుత్వం కొన్ని ఏర్పాట్లు చేసింది. ఈ కొత్త ఏర్పాట్లు 1957 జనవరి 1 వ తేదీనుంచి అమలులోనికి వచ్చినట్లుగా భావింపబడుతున్నవి.

10. గ్రామ నాయకులకు శిక్షణఇచ్చే కార్యక్రమం క్రింద ఆంధ్రప్రదేశ్‌లో గమనించ దగిన కృషి జరిగినట్లు తెలుస్తున్నది. మొత్తం 11,000 మందికి ఈ శిక్షణ ఇవ్వబడింది. వీరిలో 1,400 మంది స్త్రీలు కూడా కలరు.

11. భారతదేశంలో పర్యటిస్తున్న అమెరికా వాణిజ్య ప్రతినిధివర్గం హైద్రాబాదు విచ్చేసింది. ఈ ప్రతినిధివర్గంవారు అమెరికన్ మార్కెటింగ్ విధానాలను గూర్చి, టారిఫ్ నిబంధనలను గూర్చి, వాణిజ్య విధానాలనుగూర్చి స్థానికవణిక్ప్రముఖులకు తెలియజేశారు.

12. ప్రస్తుత సంవత్సరం పట్టణ నీటి సరఫరా, డ్రైనేజీ పథకాలను పూర్తి చేయడానికై భారత ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌కు తాత్కాలికంగా రూ 40 లక్షలు కేటాయించింది.

హైద్రాబాదు విచ్చేసిన అమెరికా వాణిజ్య ప్రతినిధివర్గం సభ్యుడు మిస్టర్ ఈజిల్ ఇ. క్రో నగరంలో పత్రికా విలేఖరుల గోష్ఠిలో ప్రసంగిస్తూ "భారతీయ చేనేత వస్త్రాలలో అనేక డిజైనులకు అమెరికాలో మంచి విక్రయావకాశాలుంటాయి," అని తెలియజేశారు. ఇక్కడి చేనేత వస్త్రాలు నాణ్యంలో కొన్ని కనీస ప్రమాణాల ప్రకారం వుండవలసిన ఆవశ్యకతను కూడా ఆయన నొక్కి చెప్పారు.

13. నాలుగు నెలల కొరకు ఆమోదింపబడవలసి వున్న తాత్కాలిక బడ్జెటుకు రాష్ట్ర మంత్రివర్గం తుది స్వరూపమిచ్చి ప్రస్తుత సంవత్సరానికి రాష్ట్రానికి కేటాయింపబడ్డ అభివృద్ధి పథకాలపై పని ఎట్లా జరుగుతున్నది కూడా సమీక్ష చేసింది,

14. ఇటీవల జారీ చేయబడిన సర్క్యులర్ వల్ల తెలంగాణా ప్రాంతంలోని ప్రభుత్వ పాఠశాలల్లో ఇది వరకుయుండి పనిచేయుచున్నట్టి ఉపాధ్యాయుల వేతన క్రమ స్కేళ్ళలోను, అలవెన్సులలోను పెద్దమార్పు ఏమీ కలుగదని రాష్ట్ర ముఖ్యమంత్రి హామీ ఇచ్చారు.

15. ఆంధ్ర కౌల్దార్ల రక్షణచట్టం అన్ని దేవాలయాల ధర్మాదాయాల భూములకు వర్తించకుండా మినహాయింపుచేసే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నదని హిందూమత ధర్మాదాయముల కమీషనర్ తెలియ జేశారు.

16. "భారత దేశంలోని ముస్లిములకు కాశ్మీరు పాకిస్థానులో చేరడం ఇష్టం" అనిచెప్పి పాకిస్థాన్ కలిగించే దురభిప్రాయాన్ని విశ్వసించరాదనీ అట్టి అభిప్రాయాన్ని తృణీకరించ వలసిందనీ కోరుతూ హైద్రాబాదు నేషనలిస్టు కాశ్మీర్ ఫ్రంటువారు ఐక్యరాజ్య సమితి ప్రతినిధిగా విచ్చేసిన మిస్టర్ గున్నార్ జారింగ్‌కు ఒక తంతిని పంపారు. భారతదేశంలోని నాలుగున్నరకోట్ల ముస్లిములు కాశ్మీరును భారతదేశ అంతర్భాగంగా గుర్తిస్తూ పాకిస్థాన్‌ను దురాక్రమణ దారుగా భావిస్తున్నారని ఆ తంతిలో స్పష్టపరచబడింది.

17. ఖాదీ గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్యక్షుని నివేదికనుబట్టి ఖాదీ గ్రామీణపరిశ్రమలలో 1953-54లో నాలుగులక్షల మందికి పనులు లభించగా గత సంవత్సరం డిసెంబరు నెలాఖరు వరకు దాదాపు 12 లక్షల మందికి పనులు (పూర్తికాలపు పనులు కొంత సమయపు పనులు) లభించినట్లు తెలుస్తున్నది.

18. ఆంధ్ర-మద్రాసు సరిహద్దుల పరిష్కారం విషయంలో మధ్యవర్తిగా వుంటున్న యూనియన్ ప్రభుత్వ న్యాయవ్యవహారాలమంత్రి కొత్త ఢిల్లీలో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ తాము ఉభయపక్షాలతో చర్చలను తిరిగి ప్రారంభించగలమని తెలిపారు.

సంచార గ్రంథాలయాలద్వారా పల్లెప్రాంతాలలోని స్త్రీలకు ఉపయుక్తమైనగ్రంథాలు లభింపజేయుటకు తగు చర్యలు గైకొనవలెనని రాష్ట్ర విద్యామంత్రి అన్నారు.

19. మే, జూన్ నెలలలో జరుగవలెనని తలపెట్టబడిన జిల్లాబోర్డుల ఎన్నికలు ఈ సంవత్సరం అక్టోబరువరకు వాయిదా వేయవలసి వచ్చేటట్టు వున్నదని రాష్ట్ర స్థానిక స్వపరిపాలనామంత్రి తెలిపారు.

20. రాష్ట్రగవర్నర్ ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఐదవ సమావేశాన్ని ప్రారంభిస్తూ భారత ప్రభుత్వంచే నియమించబడిన ఆర్థిక విచారణ సంఘంవారు నానాటికీ పెరుగుతూవున్న రాష్ట్రప్రభుత్వ ఆర్థిక బాధ్యతలను గుర్తించగలరనీ, ఆ సంఘంవారి సిఫారసులవల్ల రాష్ట్రప్రభుత్వాదాయం పెరిగి, రెండవ పంచవర్ష ప్రణాళికను పూర్తిగా అమలు జరుపడానికి రాష్ట్రానికిమంచి అవకాశా తేర్పడగలవనీ తాము ఆశిస్తున్నట్లు తెలిపారు.

రాష్ట్ర ఆర్థికమంత్రి శాసనసభలో 1957-58 సంవత్సరపు బడ్జెటును ప్రవేశపెట్టారు. ఈ బడ్జెటులో రూ. 5.20 కోట్ల లోటు వున్నది.

21. రాష్ట్రంలో మరిరెండు భిక్షుక గృహాలను స్థాపించేవిషయం ప్రభుత్వ పరిశీలనలో వుందని శాసనసభలో రాష్ట్ర ఆంతరంగిక వ్యవహారాల మంత్రి తెలియజేశారు.

22. గోదావరిపై రామపాదసాగర్ ప్రాజెక్టు నిర్మాణం నిమిత్తమై ఆ ప్రాంతాన్ని విమానంలోనుంచి సర్వేచేసే పనిని పూర్తిచేయడానికి ప్రభుత్వం రూ. 2.61 లక్షలు కేటాయించింది. ఈ కేటాయింపు బడ్జెట్ డిమాండు రూపంలో శాసనసభ ఆమోదం నిమిత్తమై పెట్టబడింది.

కేంద్ర చెరకుపైరు సంఘంవారి ఆర్థికసహాయంతో రాష్ట్రంలోని చెరకుపంట అభివృద్ధి నిమిత్తమై ప్రభుత్వం ఒక పథకాన్ని మంజూరుచేసింది.

23. పంచవర్షప్రణాళిక ముగిసే నాటికి రాష్ట్రంలో సహకార గ్రామీణ పరపతి రూ. 7.71 కోట్లు వున్నది. ఈ మొత్తాన్ని 1960-61 సంవత్సరంవరకల్లా దాదాపు రూ. 19 కోట్లకు పెంచి తద్వారా రెండవ పంచవర్షప్రణాళిక ముగిసేనాటికి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయదారుల మొత్తం పరపతి అవసరాలలో నూరింట 20 వంతుల అవసరాలను తీర్చవలెనని ప్రభుత్వం తలపెట్టింది. ఈ విషయాన్ని రాష్ట్రసహకార సంఘాల రిజిస్ట్రారు ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్రబ్యాంకుల ప్రతినిధుల మహాసభలో ప్రసంగిస్తూ తెలియజేశారు. ఈమహాసభను రాష్ట్రసహకారమంత్రి ప్రారంభించారు.

# వార్తలు-విశేషాలు

## ప్రాథమిక పాఠశాలల కొరకు పుస్తకాలు

రిజిస్టరైన ప్రచురణకర్తలు ప్రాథమిక పాఠశాలల కొరకు పుస్తకాలను దాఖలు చేయవలసిన చివరి తేదీ 1957 ఫిబ్రవరి 28 నుంచి మార్చి 11 వ తేదీ వరకు పొడిగించ బడ్డట్లు విద్యాశాఖ డైరెక్టరు చేసిన ఒక ప్రకటన తెలుపు తున్నది.

## హైదరాబాదులో ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షా కేంద్రం

ఆంధ్రప్రదేశ్ యేర్పడిన సందర్భంలో హైదరాబాదుకి వచ్చిన వుద్యోగుల పిల్లలలో 1956 లో 6 వ ఫారం చదివే వారి సౌకర్యార్థం 1957 మార్చిలో జరిగే ఆంధ్రరాష్ట్రపు స్కూలుఫైనలు పరీక్షకి హైదరాబాదులో ఒక కేంద్రం యేర్పాటు చేయబడాలని 14-9-1955 న ప్రభుత్వం ఒక వుత్తరువు చేసింది. 1958 మార్చిలో జరిగే ఆంధ్ర స్కూలు ఫైనలు పరీక్షకికూడా హైదరాబాదు కేంద్రంగా వుండాలని యిప్పుడు ప్రభుత్వం ఆదేశిస్తున్నది. ఈ సంవత్సరం 5 వ ఫారం చదువుతూ చెన్నపురినుంచి హైదరాబాదుకి తరలివచ్చే విద్యార్థులు వచ్చే సంవత్సరం 6 వ ఫారంలో హిందీపఠనం నుంచి మినహాయించబడి, ఆంధ్రలోని పాఠ్య ప్రణాళిక ప్రకారం 1958 మార్చిలో స్కూలుఫైనలు పరీక్షకి హాజరు కావడానికి అనుమతించబడాలని కూడా ప్రభుత్వం ఆదేశిస్తున్నది.

## వర్కింగు జర్నలిస్టుల చట్టం

1955 వర్కింగు జర్నలిష్టులు (ఉద్యోగ షరతులు) మరియు మిసిలేనియస్ ప్రోవిజన్సు చట్టం యొక్క 17 వ సెక్షన్ క్రింద గవర్నరు ఆ సెక్షన్ నిమిత్తమై అధికారిగా ఆంధ్రప్రదేశ్ లేబర్ కమిషనర్ని నిర్దేశించారు.

## పెరటి తోటలు

మీ ఇంటి తోటలను పరిశీలించి ఉచితంగా సలహాల నిచ్చుటకై ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖ తన సాంకేతిక సిబ్బందిని పంపుతుంది. నామకార్థపు రేట్లపై పెరటి తోటలు వేయబడుతాయి కూడా. వివరాలకు హైద్రాబాదు, హైదర్ గూడాలోని వ్యవశాయశాఖ హార్టికల్చరిస్టుతో సంప్రదిం చండి.

## కాలరీలలో ఆరోగ్య వారోత్సవం

కొత్తగూడెంలో కాలరీలలో 1957 మార్చి 11 నుంచి 17 వరకూ, యెల్లెందులో 1957 మార్చి 22 నుంచి 26 వరకు ఆరోగ్య వారోత్సవం జరుగుతుంది. ఆ సందర్భంలో జాతీయ నిర్మాణ కార్యక్రమాలను నిర్వహించు అన్నిశాఖల స్టాళ్లతో కూడుకున్న ఒక ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడుతుంది.

## ఉద్యోగ నిబంధనల సవరణ

ఆంధ్రా స్టేట్, సబార్డినేటు సర్వీసుల నిబంధనావళికి ఒక సవరణ చేయబడింది. ఇది 16-10-56 నుంచి అమలులోకి వస్తుంది.

ఈ నిబంధనావళి 2 వ భాగంలో :—

(1) నిబంధన 12 — ఏ, నిబంధన "12—ఏ (ఏ)" గా మార్చబడి, దానికి మరొక సబ్ రూలు (బి) చేర్చబడు తుంది.

దాని ప్రకారం భార్య బ్రతికి వున్న పురుషుని వివాహం చేసికొన్న స్త్రీకి, యీ నిబంధన వర్తించకుండా ప్రభుత్వం ప్రత్యేకమైన మినహాయింపు యిస్తే తప్ప, లేక పోతే ప్రభుత్వోద్యోగంలో చేరే అర్హత వుండదు.

## మాజీ గీత కార్మికుల సంక్షేమ కార్యక్రమాలు

1956 సెప్టెంబరు 30 వ తేదీతో అంతమైన అర్థ సంవత్సరంలో మాజీ గీత కార్మికులకు సహకారసంఘాలద్వారా ఆర్థికాభ్యున్నతిని సాధించడానికి ఉద్దేశింపబడిన సంక్షేమ కార్యక్రమాలు కొనసాగింపబడినవి. తాటిబెల్లం సహకార సంఘాలలో 55,613 మంది, పాల సరఫరా సంఘాలు, కూలీల కంట్రాక్టు సంఘాలు, భూమి కాలనైజేషను సంఘాలు, కౌల్దార్ల సంఘాలు మొదలైన ఇతర రకాల సహకార సంఘాలలో 6,083 మంది చేర్చుకోబడినారు. పాల సరఫరా సంఘాలలోని మాజీ గీతకార్మికుల సభ్యులకు ఋణరూపంలో రు. 14,050 లు కేటాయింపబడినవి. ఈ అర్థ సంవత్సరంలో వ్యవసాయకూలీలుగాను, పరిశ్రమలలో నిపుణత లేని పనివారుగాను 722 మంది మాజీ గీతకార్మికులకు వృత్తి కల్పించబడింది. కాగా 30-9-1956 వరకు మొత్తం 13,810 మంది మాజీ గీత పనివారికి వృత్తి సౌకర్యం కలిగింది.

## ఎన్నికలలో దురలవాట్లు

1951 సం. పు ప్రజాప్రాతినిధ్య చట్టంలోని 123 సెక్షను ననుసరించి, ఎన్నికలలో పోలింగ్ స్టేషన్‌నుండి గానీ, పోలింగ్‌స్టేషనుకుగానీ ఓటర్లను చేరవేయటానికి (అభ్యర్థి, అతని కుటుంబం, ఏజెంటు తప్ప) అభ్యర్థిగానీ, అతని ఏజెంటు గానీ, యితర వ్యక్తి యెవరైనాగానీ వాహనాలను ఉపయోగించుట, లేదా అద్దెకు తీసుకొనుట దురభ్యాసంగా పరిగణించబడుతుంది. ఎన్నికల రోజున యిట్టిచర్యకు తమ వాహనాలను వినియోగించిన యెడల లైసెన్సుదార్లు, ముఖ్యంగా బస్సులు, లారీలు, టాక్సీలు నడిపేవారినిగురించి ప్రభుత్వం గట్టి చర్య తీసుకోవలసివస్తుందని యిందుమూలముగా హెచ్చరించడమైనది.

## హైద్రాబాదు రేడియో కేంద్రం నుంచి ప్రాంతీయ వార్తల ప్రసారం

హైద్రాబాదు రేడియో కేంద్రంనుంచి త్వరలోనే తెలుగులో ప్రాంతీయ వార్తల బులెటిన్ ప్రసారం చేయబడుతుంది. ఈ కార్యక్రమం విజయవాడ రేడియోకేంద్రంనుంచి కూడా రిలే చేయబడుతుంది. ఢిల్లీలోని ఆలిండియారేడియో న్యూస్ డివిజను నుంచి ప్రధానమైన భారతీయ భాషలలో జాతీయ వార్తల బులెటిన్‌కూడా ప్రసారం చేయబడుతుంది. అయితే స్థానికఅభిరుచులకు అనుగుణమైనవార్తలనందించే ఉద్దేశంతో అనేక స్టేషన్లనుంచి స్థానికవార్తల బులెటినులను ప్రసారం చేయడానికి ఆలిండియా రేడియో ఏర్పాట్లుచేసింది. ఈ పథకాన్ని అనుసరించే హైద్రాబాదునుంచి స్థానికవార్తల బులెటిన్ ప్రసారం చేయబడుతుంది.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంలో 1957 జనవరి నెలలో 546 మంది సభ్యులకు 1,190 పుస్తకాలు ఇవ్వబడినవి. గ్రంథాలయానికి మొత్తం 21,660 మంది పాఠకులువచ్చారు. వారికి 15,241 పుస్తకాలు ఇవ్వబడినవి. బాలల విభాగంలో 1,600 మంది పాఠకులకు 1,900 పుస్తకాలు ఇవ్వబడినవి.

## విద్యున్మయ తామ్రభస్మము

విద్యున్మయమైన తామ్రరజం తయారికై కరైకుడిలోని కేంద్ర విద్యుత్ రసాయన పరిశోధక సంస్థలో ఒక విధానం రూపొందించబడింది. వ్యాపారానికై పెద్ద యెత్తున నిర్వహించడానికి యిప్పుడీ విధానం అందుబాటులోవుంది. ఇది భారత జాతీయ పరిశోధకాభివృద్ధి కార్పొరేషన్, మండీహౌస్, లిట్టన్‌రోడ్డు, న్యూఢిల్లీ-1 విధించగల షరతులకు లోబడి జరుగుతుంది. ఈ విధానంలో పెద్దయెత్తున పనిచేయ గోరువారు ఆ విషయాన్ని పై కార్పొరేషనుకు తెలియచేయవచ్చు. 1957 మార్చి 10 వ తేదీ నాటికి తెలియచేయడం మంచిది.

## విద్యార్థులకు ఉపకార వేతనాలు

తక్కువ రాబడి గలవారి పిల్లలు పబ్లిక్ పాఠశాలలవల్ల మేలు పొందడానికి వీలుగా 1952 లో కేంద్ర విద్యామంత్రిత్వశాఖ పబ్లిక్ పాఠశాలల్లో కుశాగ్రబుద్ధులైన విద్యార్థులకు విద్యార్థి వేతనాలను ఇచ్చే ప్రణాళిక నొకదానిని ప్రవేశపెట్టింది. ఈసంవత్సరం యీ ప్రణాళికక్రింద 87 మంది విద్యార్థి వేతనాల్ని పొందుతారు. వీరిలో 14 మంది షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు జాతులు, ఇతర వెనుకబడిన తరగతులకు చెందినవారు.

## శ్రీ లక్ష్మీనరసింహస్వామి జాతర

పరకాల తాలూకాలోని కొడవటంచలో మార్చి 15 నుంచి 18 వ తేదీవరకు శ్రీ లక్ష్మీనరసింహస్వామి జాతర జరుగుతుంది. మార్చి 17 వ తేదీ ఉ. 9 గం. లకు అచ్చట పశు ప్రదర్శనం జరుగగలదు.

## ప్రత్యేక రిబేటు

ప్రాథమిక చేనేత సహకార సంఘాలు హైద్రాబాదు చేనేత కేంద్ర సహకార సంఘముల క్రింద నడిచే షాపుల లోనూ ప్రభుత్వ విక్రయ కేంద్రాలలోనూ అమ్మకమయే చేనేత నూలుబట్టల అమ్మకంపై రూపాయకు 2 అణాల (ఇదివరకు 1 న్నర అణాలు మాత్రమే) చొప్పున ప్రత్యేక ప్రత్యేక రిబేటును ఇవ్వడానికి ఆమోదించబడింది. ఇది [illegible] 15-2-1957 నుండి 14-5-1957 వరకు అమలులో వుంటుంది. అంధ్రప్రదేశ్ ప్రభుత్వపు పరిశ్రమలు, వాణిజ్య శాఖ నిర్దేశించిన విధానానికి లోబడి రిబేటు సొమ్ము ఇవ్వ బడుతుంది.

## వేరుశెనగ పంట

1956-57 సం. కు ఆంధ్ర ప్రాంతంలో వేరుశెనగపంట ద్వితీయ అంచనా నివేదిక ననుసరించి ది. 25-10-56 వరకు విస్తీర్ణం అంచనా 1,578,300 ఎకరాలు. గత సంవత్సరం ఇదే కాలానికి విస్తీర్ణం య. 1,59,700 లు. విస్తీర్ణం తరుగు 1.2 శాతం.

శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి, గుంటూరు, నెల్లూరు, అనంతపురం జిల్లాల్లో విస్తీర్ణం ఎక్కువైనట్లు మిగతా జిల్లాలలో తగ్గినట్లు అంచనా. ఈపంట కర్నూలు, అనంత పురం, కడప, చిత్తూరు, గుంటూరు జిల్లాలలో చాలా ప్రధానమైనదిగా పరిగణించబడుతుంది. ఆంధ్ర ప్రాంతం లోని మొత్తంపంటలో 80శాతం యీజిల్లాలలో పండుతుంది.

## నువ్వుల పంట

ఆంధ్రప్రదేశ్ నువ్వుల పంటను గురించి అందిన మధ్య కాలిక నివేదిక ప్రకారం 1957 జనవరి వరకు చిత్తూరు కడప, తూర్పు, పశ్చిమ గోదావరులు, నెల్లూరు జిల్లాలలో ఆలస్యంగా వేస్తున్న నువ్వుపైరు విత్తనాలు చల్లేపనులు కొనసాగుతున్నవి. చాలా జిల్లాలలో ముందరగా వేసిన పైరు కోతలు జరుగుతున్నవి. పంట దిగుబడి పశ్చిమ గోదావరి మినహా అన్ని జిల్లాలలో సంతృప్తికరంగానే వుంది. ఆ జిల్లాలో మాత్రం పూతవేసే కాలంలో అకాల వర్షాలవల్ల పంట కొంచెం దెబ్బతిన్నది.

తెలంగాణా ప్రాంతంలో నిజామాబాద్, ఆదిలాబాదు జిల్లాలలో తప్ప మిగిలిన జిల్లాలలో విస్తీర్ణంలో తరుగుదల సంభవించింది. పంట ప్రారంభం కాలంలోగల అధిక వర్షాలే దీనికి కారణం. గత సంవత్సరం పంటతో పోలిస్తే యీయేటిపంట అంచనా కొంచెం ఎక్కువగావుంది. దీనికి వాతావరణ పరిస్థితుల అనుకూల్యత కారణం. గత సంవ త్సరంకంటె యీఏడు సగటు దిగుబడి ఎక్కువగా వుంటుందని అంచనా.

## పంటలు - జొన్న

1956-57 తొలిఅంచనా నివేదిక ప్రకారం 25-9-56 నాటికి ఆంధ్రదేశంలో 11,21,000 ఎకరాలలో జొన్న పంట వేయబడినట్లు అంచనా వేయబడింది. అంతకుక్రితం సంవత్సరం యిదే కాలానికి యీ పంటక్రిందగల భూమి అంచనా 11,55,000 యెకరాలు. గడచిన 5 సంవత్సరాల సరాసరి అంచనా 10,66,500 యెకరాలు. ఈ రెండిటితోను పోల్చినప్పుడు ప్రస్తుతపు అంచనాలో వరుసగా 3.0 శాతం తగ్గుదల, 5.1 శాతం హెచ్చుదల కనబడుతుంది.

## స జ్జ

1956-57 తొలిఅంచనా నివేదిక ప్రకారం 25-9-56 నాటికి ఆంధ్రరాష్ట్రంలో 8,26,000 యెకరాలు సజ్జపంట క్రింద వున్నట్లు అంచనా వేయబడింది. అంతకు క్రితం సంవత్సరం యిదే కాలానికి యీ పంటక్రిందగల భూమి అంచనా 8,23,200 యెకరాలు. గడచిన అయిదు సంవత్స రాల సరాసరి అంచనా 8,03,000 యెకరాలు. ఈ రెంకిటి తోను పోల్చినప్పుడు ప్రస్తుతపు అంచనాలో వరుసగా 0.3 శాతము, 2.2 శాతము హెచ్చుదల కనబడుతుంది.

## ఇతర మెట్టధాన్యాలు

1956-57 తొలిఅంచనా నివేదిక ప్రకారం 25-10-56 నాటికి అంధ్రప్రాంతలో 11,66,100 యెకరాలు యితర మెట్ట ధాన్యాలక్రింద వున్నట్టు అ ం చ నా వేయబడింది. అంతకుక్రితం సంవత్సరం అంచనా 11,74,500 యె.తోను. గడచిన 5 సంవత్సరాల సరాసరి అంచనా 9,97,100 తో. పోల్చినప్పుడు ప్రస్తుతపు అంచనాలో వరుసగా 0.7 శాతము తగ్గువల, 16.9 శాతము హెచ్చుదల కనబడుతుంది.

## వ రి

1956-57 రెండవ అంచనా నివేదిక ప్రకారం ఆంధ్ర ప్రదేశ్‌లో వరి (శీతాకాలం) పంటక్రింద 57,49,000 యెక రాలు వున్నట్టు అంచనా వేయబడింది. అంతకు క్రితం సంవత్సరం యిదేకాలపు అంచనా 55,46,000 యె. తోను.

గడచిన అయిదు సంవత్సరాల సరాసరి అంచనా 50,88,000 యెకరాలతోను పోల్చినప్పుడు ప్రస్తుతపు అంచనాలో వరుసగా యించుమించు 4 శాతము, 13 శాతము హెచ్చుదల కనబడుతుంది.

## చెరకు

1956-57 రెండవ అంచనా నివేదిక ప్రకారం 25-9-56 నాటికి ఆంధ్రరాష్ట్రంలో 98,300 యెకరాలు చెరకు పంట క్రింద వున్నట్టు అంచనా వేయబడింది. అంతకుక్రితం యిదేకాలపు అంచనా 89,900యె. తోను గడచిన 5 సంవత్సరాల సరాసరి అంచనా 87,400 యెకరాంతోను పోల్చినప్పుడు ప్రస్తుతపు అంచనాలో వరుసగ 9.3 శాతము, 12.5 శాతము హెచ్చుదల కనబడుతుంది. ఈ హెచ్చుదలకి కారణం కాలమాన పరిస్థితులు అనుకూలంగా వుండడమట.

## హైకోర్టు వ్యవహారాలు

హైకోర్టు వ్యవహారాలకు సంబంధించిన అప్పీళ్ళు, పిటీషన్లు, యితర వ్యవహారాలు, అప్పీలు చేసినవారుగానీ, ఆయనతరఫు ప్లీడరుగానీ, లేక రిజిష్టరయిన ప్లీడరు గుమస్తా ద్వారాగానీ స్వయంగా సమర్పించుకో బడవలెను. వాయిదా వేయాలనే కోర్కెలతోసహా పోస్టుద్వారాగానీ, టెలిగ్రాం ద్వారాగానీ వచ్చే కోర్కెలు అంగీకరింపబడవు.

## పిల్లల గ్రంథాలయం

1957 ఫిబ్రవరి నెలలో హైదరాబాదు పబ్లిక్‌గార్డెన్సులోని పిల్లల గ్రంథాలయానికి 1,365 మంది పిల్లలు వచ్చారు.

## సిమెంటు సలహాదారు

సికింద్రాబాదులోని ఇండియా ప్రభుత్వ ప్రాంతీయ ఆనరరీ సిమెంటు సలహాదారును యీ రాష్ట్రానికి సిమెంటు సలహాదారుగా ప్రభుత్వం నియమించింది.

## వాల్యుయేషన్ ఆఫీసర్లు

చిత్తూరు, చీరాల, అమలాపురం, భీమవరం, తాడిపత్రి గుంతకల్లు పురపాలక సంఘాలను, ఆస్తిపన్ను లెక్కలకు సంబంధించిన పుస్తకాలను పూర్తిగా సవరించుటకు వాల్యుయేషన్ అధికార్లను నియమించవలసిన సంఘాలుగా ప్రకటించడమైనది.

## వ్యవసాయ పరిశోధక కేంద్రానికి సలహాసంఘం

ఎమ్మిగనూరు వ్యవసాయ క్షేత్రంలో గల ప్రదర్శన - పరిశోధన కేంద్రానికి యీ క్రింది సలహా సంఘం నియమించబడింది.

అధ్యక్షుడు : తుంగభద్రా ప్రాజెక్టు స్పెషల్ కలెక్టరు, అదోని.

కార్యదర్శి : ఎమ్మిగనూరు వ్యవసాయ క్షేత్రం సూపరింటెండెంట్

అధికారసభ్యులు :
1. వ్యవసాయ డిప్యూటీ డైరక్టరు, కడప
2. స్పెషల్ జిల్లా వ్యవసాయ శాఖాధికారి తుంగభద్రా ప్రాజెక్టు ఆదోని.
3. ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, లోకల్ ఇరిగేషన్, ఆదోని
4. రివిన్యూ డివిజనల్ అధికారి, ఆదోని

వీరుగాక యిద్దరు అనధికార సభ్యులు నియమింపబడ్డారు. అనధికార సభ్యుల పదవీ కాలం మూడు సంవత్సరాలు.

## పవర్ మగ్గాల రిజిస్ట్రేషన్

కేంద్ర ప్రభుత్వపు నోటిఫికేషన్ నం. ఎన్. ఆర్. సి. 8-5-56 క్రింద పవరు మగ్గాల రిజిస్ట్రేషన్ యెందుకు జరుగుతున్నదో అన్నవిషయంలో ఆందోళనను తెలుపుతూ బొంబాయిలో టెక్స్‌టైలు కమిషనర్‌కి విజ్ఞప్తులు పంపబడినవి.

దేశంలో విద్యుచ్ఛక్తితో పనిచేసే మగ్గాలు యెన్ని వున్నాయో అవి యే రకం బట్టను తయారుచేస్తున్నాయో తెలుసుకోవడమే యీ రిజిస్ట్రేషన్ ఆశయం. ఈ రిజిస్ట్రేషన్‌లో మర మగ్గాల ఫ్యాక్టరీలతో జోక్యం కలిగించుకుని వాటి మామూలుపనికి అంతరాయం కలిగించడం ప్రభుత్వోద్దేశం కాదు.

రిజిస్ట్రేషన్ సందర్భంలో ప్రభుత్వం దిగువవిషయాలను లెక్కలోనికి తీసుకుంటుంది.

1. మామూలుగా నూలుతో పనిచేసే మర మగ్గాలు నూలును విడిచి మరొకరకం దారంతో పనిచేయడానికి అనుమతించబడదు.

2. మర మగ్గాలు 5 లేక అంతకంటె తక్కువగలఫ్యాక్టరీలు 31-7-56 లో అంతమైన సంవత్సరంలో నూలు నేత నుంచి తదితరమైన రకాల నేతకి వాటినుంచి నూలునేతకి యే కారణం చేతనైనా మారినట్లయితే అట్టి ఫ్యాక్టరీలు ఆయా రకాల నేత కొరకు రిజిష్టరుకావచ్చు. అయితే ఆ ఫ్యాక్టరీలు పై సంవత్సరంలో ఆ విధంగా నేతను మార్చిన విషయాన్ని ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు సర్టిఫై చేయాలి. అట్టి మగ్గాలు నూలు, పట్టు, ఆర్టుసిల్కు, ఉన్ని మున్నగురకాల నేతకొరకు రిజిష్టరు చేయబడతాయి ఆ విధంగా అన్ని రకాల ప్రయోజనాల కొరకు రిజిష్టరైన ఫ్యాక్టరీలు యేమైనా మార్పులు చేస్తే ఆ విషయాన్ని టెక్స్టైలు కమిషనర్‌కి తెలియచేయాలి.

3. పై విధంగా రాష్ట్రప్రభుత్వాలచే సర్టిఫై చేయబడకుండా నూలు లేక తదితరమైన రకం నేతకొరకు రిజిష్టరైన ఫ్యాక్టరీలు తరువాత మార్పును కోరితే టెక్స్టైల్ కమిషనర్ ఆమోదంతో మాత్రమే అందుకు అనుమతించబడుతుంది.

## వెనుకబడిన తరగతులకు సౌకర్యాలు

వెనుకబడిన తరగతులకు చెందిన అభ్యర్థులు వుద్యోగ నియామకానికై యెన్నిక చేయబడే నిమిత్తం పంపుకొను దరఖాస్తులకు నిర్ణీతమైన రుసుమును చెల్లించ నవసరం లేకుండా మినహాయింపు యివ్వబడింది. ఆ వుద్యోగాలు ఆంధ్రాపబ్లిక్ సర్వీసు కమీషన్‌ద్వారా జరిగేవి కావచ్చు, తదితరమైనవి కావచ్చు. అభ్యర్థులు ఎఫ్. ఏ. (ఆర్ట్సు) పరీక్షలో వుత్తీర్ణులై వుండాలి లేదా రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులై వుండాలి. లేక మరియేయితర విశ్వవిద్యాలయంలోనైనా పై అర్హతలతో సమానమైన విద్యార్హతలను పొందివుండాలి. ఇట్టి అభ్యర్థులకి యీ మినహాయింపు సౌకర్యం 31-12-56 వరకూ (1954 జులైలో చేయబడిన ప్రభుత్వ వుత్తరువులలో) యివ్వబడింది. షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలకు కూడా యిదే సౌకర్యం 31-12-1960 వరకూ యివ్వబడింది వెనుకబడిన తరగతుల అభ్యర్థుల విషయములో కూడా యీ సౌకర్యం గడువును 31-12-1960 వరకూ పొడిగించడానికి యిప్పుడు నిశ్చయించబడింది.

## చిత్తూరు మార్కెటు కమిటీ

6-2-1956 తేదీగల రెవిన్యూశాఖ 260 వ వుత్తరువులో చిత్తూరు మార్కెటు కమిటీ సభ్యులుగా నియమించబడిన వారి పదవీకాలం 8-3-57 నుంచి ఆరు నెలలు పొడిగించబడింది.

కడప మార్కెటు కమిటీలో ప్రస్తుతంవున్న అందరి సభ్యుల పదవీకాలము 26-3-57 నుంచి ఆరునెలలు పొడిగించబడింది.

## ఇంటి తోటలు

ఆయా కాలాలకి అనువైన నారు మొక్కలు, క్రిమి సహకారకమయిన మందులు, రసాయన యెరువులకై ఆనరరీ సెక్రటరీ, 'అగ్రి - హార్టికల్చరల్ సొసైటీ, కేరాఫ్ హార్టికల్చరిస్టు, వ్యవసాయశాఖ, హైదరుగూడ, హైదరాబాదుకి వ్రాయండి.

హైదరాబాదులోని అగ్రి - హార్టికల్చరల్ సొసైటీ ద్రాక్ష తోటలను అవసరమైన విధంగా నామమాత్రపు రుసుముపై కత్తిరించి పెడుతుంది. ఆ సహాయాన్ని పొందగోరువారుపై సొసైటీ కార్యదర్శికి ఒకటవ పేరాలోని చిరునామాకి డబ్బును ముందుగాపంపి తమతమ పేర్లను రిజిస్టరు చేయించు కోవాలి.

## పరీక్షల వార్తలు

స్పెషల్ ఓవర్సీరు తుది పరీక్షలు పరీక్ష తప్పిన అభ్యర్థులకు మాత్రమే 1957 జూన్ 10 వ తేదీ సోమవారంనుంచి ఆరంభమవుతాయి. పూర్తిచేసిన దరఖాస్తు ఫారాలను ఉస్మానియా విశ్వవిద్యాలయం ఇంజనీరింగు కాలేజీలోను; పరీక్ష రుసుం రు. 30 లను అక్కౌంట్సు బ్రాంచీలోను 1957 మే 15 న కాని తత్పూర్వంకాని అందజేయాలి. ఆ తేదీ తరువాత పంపే దరఖాస్తులకు రోజుకి అర్ధరూపాయి లేటుఫీజు చెల్లించాలి.

సహకారంలో డిప్లొమాకి మూడవ పరీక్ష కో ఆపరేటివ్ ట్రైనింగు కాలేజీ, గన్‌ఫౌండ్రి, హైద్రాబాదులో 1957 మే 13 నుంచి 22 వ తేదీవరకూ జరుగుతుంది. దరఖాస్తులు పంపడానికి ఆఖరుతేదీ 1957 ఏప్రిల్ 30. ప్రతి దరఖాస్తులోను పరీక్ష రుసుం రు. 10 లు పంపబడాలి, అభ్యర్థులు గ్రూపులకి హాజరయినా లేక పూర్తిగా అన్ని పార్టులకు హాజరయినా కూడా.

## ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రోడ్డు రవాణాశాఖ యిప్పటి నుంచి "ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా" అని వ్యవహరింపబడుతుంది.

# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*
సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతుల చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ప్రతియేటా నూటికి 3½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి, 10 రూ. లవి, 25 రూ. లవి, 50 రూ. లవి, 100 రూ. లవి, 500 రూ. లవి ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 2,500 ల వరకు కొనవచ్చును. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| *15 సంవత్సరముల అన్యూటీ సర్టిఫికెట్లు* | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి, జారీచేయబడు ధరలు ; రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*

## *భారతదేశ ఉజ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు :
**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకు గాని లేక**
**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**
చిరునామాకు గాని వ్రాయవలెను.

*Statement about ownership and other particulars about newspaper "ANDHRA PRADESH" to be published in the first issue every year after the last day of February.*

# FORM IV

( SEE RULE 8 )

| | | | |
|---|---|---|---|
| 1. | **Place of Publication** | ... | Hyderabad. |
| 2. | **Periodicity of its publication** | ... | Monthly. |
| *3. | **Printer's Name** | ... | Sri N. C. S. Venkatachari, Ajanta Printers. |
| | **Nationality** | ... | Indian |
| | **Address** | ... | 7112, Mahakali Street, Secunderabad-3. |
| 4. | **Publisher's Name** | ... | Director of Information and Public Relations, Government of Andhra Pradesh. |
| | **Nationality** | ... | Indian. |
| | **Address** | ... | Mukarramjahi Road, Hyderabad - 1. |
| 5. | **Editor's Name** | ... | Sri K. Kasipati, |
| | **Nationality** | ... | Indian, |
| | **Address** | ... | Director of Information and Public Relations, Government of Andhra Pradesh, Mukarramjahi Road, Hyderabad - 1. |
| 6. | **Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital.** | | — |

*I*, SRI K. KASIPATI, *Director of Information and Public Relations, Government of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

Sd/- K. KASIPATI
*Signature of the Publisher*

DATE 28th March 1957.

*NOTE :— The Director, Government Printing Press, Government of Andhra Pradesh, Hyderabad-Deccan 2, is the official printer but he may name any other printer when the Government Press cannot undertake printing of this journal.



పదవీ విరమణచేస్తున్న సందర్భంలో ఫతే మైదాన్‌లో ఏర్పాటు చేయబడిన వీడ్కోలు. పెరేడ్‌కు విచ్చేస్తున్న జనరల్ యస్. యం. శ్రీ నగేష్



ఫతే మైదాన్ పెరేడ్‌లో గౌరవ సైనిక వందనం స్వీకరిస్తున్న జనరల్ యస్. యం. శ్రీ నగేష్